సాహిత్య ప్రస్థానం
మే 2019

సంపుటి : 18 సంపాదకీయం సంచిక : 5

# శతవర్ధంతి సందేశం

గత ఏడాది మే నెలలో రాజమహేంద్రవరంలో తెలుగు జాతి వైతాళికుడు కందుకూరి వీరేశలింగం శత వర్ధంతి ఉత్సవాలు ప్రారంభించాము. ప్రస్థానం ప్రత్యేక సంచికా అందించాము. ఇప్పుడు ఆ ఉత్సవాల ముగింపు సమయం వచ్చేసింది. రాజధాని విజయవాడలో విస్తృత స్థాయిలో సమాపన సమ్మేళనం జరగబోతున్నది. శతవర్ధంతికి ప్రతీకగా శతాధిక సాహిత్య సాంస్కృతిక సంస్థలు ఈ ఉత్సవ నిర్వహణలో భాగస్వాములు కానున్నాయి. ఏ విధంగా చూసినా ఇదొక చారిత్రిక సందర్భం. ఆంధ్రప్రదేశ్‌లో పోలింగు ముగిసి కొత్త ప్రభుత్వ ఆవిర్భావం జరిగే వేళ వీరేశలింగంను స్మరించుకోవడం మన కర్తవ్యాలను మనకు గుర్తుచేస్తుంది. దేశంలో మోడీ హయాంలో శ్రుతిమించిన అసహనం, అశాస్త్రీయ భావజాలం, నిరసన గొంతు నులివే నిరంకుశత్వం వీటన్నింటికీ భరత వాక్యం పలకాల్సిన సమయం ఇది. మరీ ముఖ్యంగా రచయితలు, కవులు, మేధావులపై దాడులు, దౌర్జన్యాలు కొన్ని చోట్ల హత్యలు కూడా చూసిన కరాళ కాలానికి తెరదించాల్సిన పోరాటంలో మనమున్నాం. విభజనానంతర ఆంధ్ర ప్రదేశ్‌నూ నాలుగేళ్లపాటు పాలనలో పాలుపంచుకున్న ఈ శక్తులు ప్రత్యేక హోదాను సమాధి చేసి ప్రజా చైతన్యాన్ని సవాలు చేశాయి. రెండు ప్రధాన పార్టీలూ దశలవారీగా అదే శక్తులతో కలవడం వల్ల దానిపై జరగాల్సిన పోరాటం మొద్దుబారిపోయింది. ఎన్నికలలోనైనా ఈ రెండు పార్టీలలో ఏది గెలవాలనే ఘర్షణ తప్ప పైనున్న ప్రమాదాలను గురించి ప్రత్యేక హోదా గురించి జరగాల్సిన చర్చ జరక్కుండా పోయింది. అంతేగాక కార్పొరేట్ విధానాలు రాజకీయ స్వార్థాలు కొత్త రాష్ట్ర గమనాన్ని దారి తప్పించాయి. అధికార చత్రంతో చాపకింద నీరులా మూఢనమ్మకాలు, అంధ విశ్వాసాలను పెంపొందించడం రివాజుగా మారింది. ఫలితంగా కులతత్వాలు ప్రకోపించాయి. ఉపేక్షిత వర్గాలపై మహిళలపై వివక్ష పైశాచికాలు విజృంభించాయి. తెలుగు రాష్ట్రాల స్థాయిలోనూ అసహనం పెరిగిందనేది అనుభవం. స్వామీజీలు రాష్ట్ర రాజకీయాలను పాలకులనూ కూడా ఆడిస్తున్న దృశ్యం నిత్యం చూస్తున్నాం. ప్రశ్నకు ప్రతిఘటనకూ ప్రతీకగా నిలిచిన వీరేశలింగం జీవితం ఈ దుర్నీతులపై పోరాటానికి స్ఫూర్తిదాయకం కావాలి. హేతుబద్ధతకు నిబద్ధమైన మేధావి లోకానికి ఆలోచనా పరుల ప్రపంచానికి ఆశాజ్యోతి కావాలి. ఆంధ్ర దేశానికి అఖిల భారతానికి కూడా పునర్వికాస పతాకమై ఎగరాలి.

**జోహార్ కందుకూరి వీరేశలింగం**



రచనలు, చందాలు, విరాళాలు, మనీ ఆర్డర్లు, చెక్కులు, డిడిలు పంపవలసిన చిరునామా:
సాహిత్య ప్రస్థానం, 27-30-4, ఎం.బి. విజ్ఞానకేంద్రం, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నరుపేట, విజయవాడ - 520002, ఫోన్: 0866-2577248, సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com, www.prasthanam.com
ISSN No: 2581 - 7477
సాహిత్య ప్రస్థానం మాసపత్రికకు చందా కట్టండి! తెలుగు భాషా, సాహిత్య కృషిలో భాగస్వాములు కండి!!
1 సంవత్సర చందా రూ. 240/- ◆ 5 సంవత్సరాల చందా రూ.1000/
◆ 10 సంవత్సరాల చందా రూ. 2000/-
Bank A/c Details: A/c Name: PRASTHANAM, SBI, Governorpet, Vijayawada
A/c No. 52001500585, IFSC: SBIN0020343
చెక్కులు, డిడిలపై prasthanam అని రాయగలరు.

## ఈ సంచికలో ... సాహిత్య ప్రస్థానం మే 2019

### కథలు



### కవితలు



### వ్యాసాలు



### కవిత

## విలువ


- నూతలపాటి వెంకట రత్నశర్మ
9866376050




వెలకట్టటం ఎలా?
ఆనందాల్ని
దుఃఖాల్ని
సన్మానాలని
అవమానాలని
అనుభూతుల్ని
ఆలోచనల్ని
వెలకట్టటం ఎలా?
ఆకలేసినప్పుడు
పండు ఇచ్చిన వాడికి
దాహమేసినప్పుడు
నీళ్ళు పోసినవాడికి
వెలకట్టటం ఎలా?
మానవత్వాన్ని వెలకట్టటానికి
పడికట్టురాళ్ళు
దొరుకుతాయా మనదగ్గర
ఒక వస్తువుకు
వెలకట్టినంత తేలిక కాదు
మానవత్వానికి వెలకట్టటం!
ఒక చీర కొన్నప్పటి
విలువ కన్నా
ఆ చీర
శరీరాన్ని కప్పినప్పుడు
విలువ ఎంతని చెప్పగలం! ◆

# మనసున మనసై




కె. ఉషారాణి
9492879210

నిర్మలమయిన నీలాకాశం. సముద్రం అలలుకూడా ఈ రోజు అంతగా ఎగసిపడడం లేదు. ఆటుపోట్లు పెద్దగాలేవు. ఇంకా సూర్యుడు గుడ్‌బై చెప్పలేదు. సూర్యకిరణాలకి అలలు మెరిసిపోతున్నాయి. ఏ నేతకారుడు తన జలతారు తో ఈ నగిషీలు చెక్కగలడా, ఏ చిత్రకారుడి ఊహ ఈ ప్రతిరూపాన్ని తీర్చిదిద్దగలదా అని సవాలు చేస్తున్నట్టు ఉంది సూర్యాస్తమయం! ప్ఫ్! ఇంత వరకు ఇంతటి అద్భుతమయిన చిత్రాన్ని ఎన్నడూ చూడలేదు. ఎన్ని ఆర్ట్ ఎగ్జిబిషన్స్‌కి వెళ్ల లేదు!! ఆంటోనియో శాటిన్ ఈ చిత్రాన్ని గీయగలడా? చిత్రాన్ని ఇంత మనోరంజకంగా ప్రతిబింబించగలడా! ఏమో !!!

"ఐస్క్రీమ్ కావాలా మేడం" తొమ్మిదేళ్ల లేత చేతులు ముందుకు పడుతున్న అడుగులకు అడ్డంగా నిలిచాయి.

వాచీ చూసుకుంది. సరిగ్గా ఆరయింది. మధ్యాహ్నం లంచ్ అయిన వెంటనే పనిలో మునిగిపోవడం మొదలవుతుండగా ప్రదీప్ ఫోన్.

"లల్లీ! ఈ రోజు ఆరుగంటలకు మనం ఎప్పుడూ బీచ్లో కలుసుకునే చోటే కలుసుకోవాలి. అర్జంట్. డోంట్ డిసెపాయింట్ మి ! పని ఉందనకు. ఓకే" అంటూ ఫోన్ కట్ చేసాడు. ఆర్డరో, అభ్యర్థనో, రెండూనో! ఉన్న పనులన్నీ పక్కన పెట్టి వచ్చింది. మిగిలినవి వెళ్లి చేసుకోవాలి.

ప్రదీప్‌ని ఓ ఆర్ట్ ఎగ్జిబిషన్లోనే తొలిసారి చూసింది. సామాజిక స్పృహతో వేసిన కళాఖండాలు తనని అబ్బుర పరుస్తుండగా, పక్కనే నిల్చుని ఉన్న ప్రదీప్ కనిపించాడు. అప్పుడు ఇద్దరూ చూస్తున్నది జగన్నాధ్ పాండా గీసిన చిత్రం. అదో మిక్స్ మీడియా ఆర్ట్ వర్క్. తమ దేశంలోనే తమను పరాయి వారిని చేస్తే మనుషులు ఎలాంటి భావాలకు గురవుతారో చక్కగా చిత్రీకరించినది. మనుషులను ఆలోచింప చేస్తుంది. పుట్టి పెరిగిన ఊరు నీది కాదంటే మనుషులు పడే వేదన, తన ఊరేదో తెలియక పడే మానసిక సంఘర్షణ చూపించిన చిత్రం. అందుకే మనుషులందరినీ తాళ్లతో శూన్యంలో చూపించారు ఆ చిత్రంలో. మనుషుల కోసం భూమి ఉందా? భూమికోసం మనుషులున్నారా? దేశాల హద్దులు మనం గీసుకున్నవి కావూ?!

ఐస్ క్రీం అబ్బాయి ఇంకా కదలలేదు. ప్రదీప్ రాలేదు.

♦♦♦

"మీకు కూడా ఆర్ట్ ఎగ్జిబిషన్స్ చూసే అలవాటు

ఉందా? ఈ మధు ఆర్ట్ సెంటర్‌లో పెట్టే ప్రతి ఎగ్జిబిషన్ నేను చూస్తాను. కానీ మిమ్మల్ని చూడ్డం ఇదే మొదటి సారి" మాట కలిపాడు.

"ఔను నేను రావడం ఇదే మొదటిసారి" ఈ మధ్యే ఈ ఊరు ట్రాన్స్‌ఫర్ మీద వచ్చాను. మాది చెన్నై."

"ఓ ! నైస్ మీటింగ్ యు ! వెల్కమ్ టు విజయవాడ !! మాకు మరో ప్యాట్రన్ దొరికారు అనుకోవచ్చా! నా పేరు ప్రతాప్. నేను లైలాకాలేజి లెక్చరర్ని. మీ పేరు తెలుసుకోవచ్చా?"

" నా పేరు లలిత. నేను స్టేట్‌బ్యాంక్‌లో ఆఫీసర్ని. "గ్లాడ్ టు మీట్ యు" కాస్త ముభావంగానే చెప్పింది.

పరిచయాలు అయిన తరువాత తను ఎగ్జిబిషన్ చూసి ఇంటికి వచ్చేసింది.

మళ్ళీ రెండో నెలలో అనుకుంటా .. ఎం ఎఫ్ హుస్సేన్ ఎగ్జిబిషన్ పెట్టినట్టు పేపర్‌లో చూసి వెళ్ళింది మధు ఆర్ట్ సెంటర్‌కి. ప్రదీప్ అక్కడే ఉన్నాడు.

అలా ప్రారంభమయిన పరిచయం కొన్ని రోజులకి బయట కూడా కలవడం, కాలక్షేపం కబుర్లు చెప్పుకోవడం వరకు వచ్చింది.

ప్రదీప్ మంచి మాటకారి. ఎవరికి ఏ సహాయం అవసరమైనా అందుకుని చేసే నైజం కూడా. ఇద్దరికీ పుస్తకాలు చదవడం, చిత్రలేఖనం ఇష్టం. అందుకే ఇద్దరూ ఎప్పుడు కలిసినా టైం తెలియదు. ఆఫీస్‌లో ఎంతమంది ఉన్నా ఒంటరిగా అనిపించే లలితకి, ప్రదీప్ ఒక్కడితో ఉంటే కాలమే తెలియదు, ప్రపంచం హరి విల్లులాగా అనిపిస్తుంది. ప్రదీప్ సేన్‌గుప్తా చిత్రాలలాగే.

"హలో, హలో!" ప్రదీప్ గొంతు ఆలోచనలకు అంతరాయం కల్పించింది. ఐస్క్రీమ్ అబ్బాయి ఓ రౌండ్ వేసి మళ్లి వచ్చినట్టుంది. ప్రదీప్‌ని నా పక్కన చూసి కొనిపించి తీరవలసిందే అని ఫిక్స్ అయినట్టు ఉన్నాడు.

"రెండు ఇవ్వు" ప్రదీప్.

" రా, కూచుని మాట్లాడు కుందాం." ప్రదీప్.

"ఏమిటిట ఇంత అర్జెంట్" లలిత.

"…. "

"కానీ , ఈ సస్పెన్సు ఏమిటి ?" లలిత.

"సరే, డైరెక్ట్‌గా టాపిక్‌లోకి వచ్చేస్తున్నా" ప్రదీప్.

"ఏం లేదు లల్లి ! మనం ఇన్ని రోజుల నుంచి ఒకరి నొకరం తెలుసుకున్నాం. మంచి స్నేహితులం అయ్యాం. ఈ బంధం శాశ్వతం చేసుకోవచ్చుకదా ! అమ్మ ఈ రోజు ఒక మ్యారేజ్ ప్రపోజల్ తెచ్చింది. నీతో ఆ విషయం మాట్లాడాలని, నీ అభిప్రాయం తెలుసుకుని తరువాతే ఆమెకి సమాధానం చెప్పాలని పించింది .. ఏమంటావు ?" ప్రదీప్.

ఇద్దరి మధ్య మౌనం రాజ్యమేలింది.

" ఫరవాలేదు, లల్లి, నీ సమాధానం ఏదయినా నేను అర్థం చేసుకోగలను. నాకు నీ అభిప్రాయం ఏ సందేహాలు లేకుండా చెప్పవచ్చు" ప్రదీప్.

ప్రదీప్ కళ్ళలోకి చూసింది లలిత.

ఈ మాటలు నిజమేనా? ఆ కళ్ళు ఏం చెపుతున్నాయి? నా గతం తెలిసిన తరువాత ఇప్పుడున్న బంధం కాస్తా తెగిపోదు కదా! మళ్ళీ తాను ఒంటరిది అవదుకదా !! ఏ క్షణం వస్తుందని భయపడిందో, రాకుండా ఉంటే బాగుండును అనుకుందో ఆ క్షణం రానే వచ్చింది. ఒక్కక్షణం ఆందోళన పడ్డా వెంటనే తేరుకుంది. మనసున్న మనిషి తోడు కావాలిగాని కేవలం ఓ మగతోడు కాదు తనకు కావలిసింది. అందుకే ఎవరిని పెళ్లి చేసుకున్నా ఈ విషయం చెప్పి చేసుకోవాలనే అనుకుంది తను. సహృదయుడు స్నేహశీలి కాని వాడి సాహచర్యం తాను భరించలేదు. ఆలోచనలకు ఫుల్‌స్టాప్ పెట్టమన్నట్టు ఇసుకలో ఉన్న తన చేతిమీద చేయి వేసాడు ప్రదీప్. కాసేపు చేతిలో వేసిన చేయి మరింత గట్టిగా పట్టు బిగించింది.

లలిత కళ్ళు ఇసకనే చూస్తున్నాయి. పాదాలను సుతారంగా తాకుతూ చడీచప్పుడు లేకుండా కింద ఉన్న ఇసుకను తమతో తీసుకు పోతున్నాయి అలలు.

ఓ నిట్టూర్పు విడిచి లలిత మళ్ళి ప్రదీప్ కళ్ళలోకి చూసింది. ఈ సారి చూపులో బిడియం లేదు.

"ప్రదీప్ ! మన మధ్య ఇటువంటి ఓ సమయం వస్తుందేమో అని నేను అనుకుంటూనే ఉన్నాను. ఈ రోజు రావడం కూడా మంచిదేలే ! నేనెవరిని పెళ్లి చేసుకున్నా ఈ విషయం ముందు చెప్పే చేసుకోవాలనుకున్నాను. ప్రతి మనిషికి పెళ్ళికి ముందు ఓ గతం ఉంటుంది కదా ! అలాగే నాకో మరిచిపోవాలనిపించే గతం ఉంది. నా గతంతో నీకు సంబంధం లేదని అనుకోకు. గతం ఎప్పుడూ మనిషిని వెన్నాడుతూనే ఉంటుంది. అయితే నన్ను నన్నుగా హృదయ పూర్వకంగా స్వీకరించగలిగితే నాకేం అభ్యంతరం లేదు. నిన్ను మించిన స్నేహితుడు నాకు ఇప్పటి వరకు తారసపడలేదు.

"మన సమాజంలో స్త్రీకి పురుషుడికి విలువలు నిర్ణయించడంలో చాల వ్యత్యాసం ఉంటుంది కదా. పురుషుడికి

చదువు, తెలివితేటలూ, హోదా, ఆస్తి ఉండడం మంచి వరుడి అర్హతలు. మిగిలినవన్నీ సర్దుకోవచ్చు. కానీ స్త్రీ విషయానికి వచ్చేసరికి వీటన్నీతోపాటు, అంతకంటే ముఖ్యంగా కూడా ఆమెకు కన్యత్వం ఉండాలి. ఇంటి గౌరవం అంటే స్త్రీ శీలం అని ఇప్పటికీ చలామణి అవుతున్నది. దానిని కాపాడు కొనే భాధ్యత ఆమెది, ఆమెను కన్నవారిది. కానీ ఈ సమాజం లో స్త్రీ భద్రతకి గ్యారంటీ మాత్రం లేదు. స్త్రీల విషయంలో తప్పొకరు చేస్తే శిక్ష మరొకరికి. ఆనాటి శకుంతలయినా, సీతయినా, అహల్య అయినా ఈనాటి ఆధునిక మహిళ అయినా స్త్రీ ని సమాజం చూసే విషయంలో పెద్ద మార్పేమీ రాలేదు. ఆనాటి నుంచి నేటి వరకు తన వ్యక్తిత్వం గుర్తించబడేందుకు స్త్రీ ఘర్షణ పడుతూనే ఉంది.

ప్రదీప్ వింటున్నాడా లేదా అని ఓ సారి మొహం లోకి చూసింది.

ప్రదీప్ మౌనంగా వింటున్నాడు. ఏ రకమయిన భావం వ్యక్తం కావడం లేదు. కాస్త ఆపింది.

'ఊ చెప్పు' అన్నట్లు ఉన్నాయి కళ్ళు. మళ్ళీ మొదలు పెట్టింది లలిత. " మాఊరు తాంబరం. చెన్నై దగ్గరే. మానాన్న తాంబారంలోని మద్రాస్ క్రిస్టియన్ కాలేజీలో తోటమాలి. కాలేజీ పక్కనే ఉన్న ఓ చిన్న ఇంట్లో మేము ఉండేవాళ్ళం. నాన్న నన్నెంతో ప్రేమతో పెంచారు. ఆ కాలేజీలో నేను లెక్చరర్ అవ్వాలని కలలు కనేవారు. అప్పుడు నేను నాలుగో తరగతి చదువుతున్నాను. ఆ కాలేజీ నాకు ఇల్లులాగా ఉండేది. స్కూల్‌కి వెళ్ళని సమయమంతా అక్కడే గడిపేదానిని. అమ్మ మా ఇంటిపక్కనే ఉన్న ప్రైవేట్ స్కూల్‌లో టీచర్‌గా ఉండేది.

"ఒక రోజు అమ్మ స్కూల్ కి వెళ్ళింది. నాన్న పనిమీద బయటికి వెళ్ళాడు. కాలేజీకి కూడా సెలవే. కానీ అక్కడే నేను ఆడుకుంటున్నాను. కాలేజీ ఇంగ్లీష్ లెక్చరర్ సంపత్. నాన్న ఒకసారి నన్ను వాళ్ళింటికి తీసుకెళ్లారు. వాళ్ళింటి గార్డెన్ కూడా నాన్నే చూసేవారు. ఆయన చాలా సరదాగా ఉంటారు. మంచి కథలు చెప్పేవారు. నాకు చాక్ లెట్లు కూడా కొని ఇచ్చే వారు. తాను ఇంటి కెళుతూ నన్ను రమ్మన్నారు. నాతో ఆడుకునే పిల్లలంతా కూడా వెళ్లిపోయారు. నేను ఆయనతో పాటే వాళ్ళింటికి వెళ్ళాను.

ఇంట్లో నాకు స్వీట్స్ ఇచ్చారు. ఆంటీ ఇంట్లో లేరని నాకు అప్పుడు అర్థం అయింది. కాసేపాగి నేనిక వెళతానని లేచాను. కానీ మాష్టారు కూల్ డ్రింక్ తాగి వెళ్ళమని తెచ్చి ఇచ్చారు. నేను తాగడమే నాకు గుర్తుంది. ఆ తరువాత ఏం జరిగిందో నాకు తెలియదు. తరువాత నాకు మెలుకువ వచ్చి చూసే సరికి మాస్టారి పక్క పై ఉన్నాను. నాకు భయం వేసి లేవబోయాను. కానీ లేవలేకపోయాను. చెప్పలేని బాధ. నెమ్మిదిగా ఓపిక చేసుకుని లేచి చూస్తే మాస్టారు లేరు.

వాచ్ మాన్ నన్ను చూసి నవ్వి నేను బయటికి రాగానే తాళం పెట్టుకుని వెళ్ళిపోయాడు.

"ఇంటికి వెళ్లి నాన్నతో నేను జరిగిన విషయం చెప్పాను. అమ్మ నాన్న ఒకటే ఏడుపు. ఎందుకేడుస్తున్నారో నాకు అర్థం కాలేదు. అంతకు ముందు నాకు ఎన్నోసార్లు జ్వరాలు వచ్చాయి. ఒంట్లో నలత చేసింది. డాక్టర్ దగ్గరికి తీసుకెళ్లారు. ఎప్పుడూ నాకే ధైర్యం చెప్పేవారు. గాయాలకు భయపడకూడదనే వారు. కానీ ఇప్పుడు అమ్మ నాన్న ఏడుపు నన్ను ఎంతో కలవర పెట్టింది. చివరికి ఒక డాక్టర్ ఆంటీ దగ్గరికి తీసుకెళ్లారు. డాక్టరుగారు లెక్చరర్‌ని తెగ తిట్టింది. పోలీస్‌లకు కంప్లైంట్ ఇవ్వమనింది. అయినా నాన్న అటువంటి పనేం చేయలేదు. నా చుట్టూ ఏం జరుగుతున్నదో నాకు అర్థం కాలేదు.

ఆ తరువాత అమ్మ నాన్న బయటికి మామూలుగానే ఉన్నా దిగులుగానే ఉండేవారు. నన్నేమి అనలేదు కానీ ఆ తరువాత ఎప్పుడూ నాన్న నన్ను కాలేజికి తీసుకెళ్లలేదు. నాతో సరిగ్గా మాట్లాడేవారే కాదు. నాకంతా అయోమయంగా ఉండేది. మూడేళ్లు గడిచిన తరువాత, నేను పెద్దదాన్నయిన తరువాత మాత్రమే ఏమి జరిగి ఉంటుందో ఊహించగలిగాను. నాన్న ఎవరికీ చెప్పుకోలేక, ఆ బాధతో కుంగి పోయారు. ఆ బాధతోనే నేను ఇంటర్ చదువుతుండగా కన్నుమూశారు. టెంత్‌లో బాగా మార్కులు వచ్చాయి కాబట్టి స్టేల్లాకాలేజీలో సీట్ వచ్చింది. నేను చేరాను. కాలేజీ టాపర్‌గా డిగ్రీ ముగించాను. అమ్మ ఆరోగ్యం దృష్ట్యా చదువుకు స్వస్తి చెప్పి ఉద్యోగం చేయాలనుకున్నాను. నాన్న కల కలగానే ఉండిపోయిందనుకో. ఇదిగో ఇలా డిగ్రీ అవగానే బ్యాంకు ఉద్యోగానికి సెలెక్ట్ అయి చేరి పోయాను. చెన్నైలో మూడేళ్లు చేసి ఇప్పుడు ఇక్కడికి వచ్చాను. నాన్న పోయిన బెంగతో అమ్మకి అనారోగ్యం ఎక్కువయింది. ఇప్పుడు నేనే మా కుటుంబానికి ఆధారం. నా గతాన్ని చెరపలేను. నిజానికి జరిగిన దానిలో నా ప్రమేయం లేదని, అది కేవలం ఒక గాయమని నేను గట్టిగా నమ్ముతున్నాను. అలా అనుకోగలిగిన వ్యక్తినే నా జీవిత భాగస్వామి చేసుకోవాలనుకున్నాను. మా అమ్మ నాన్న కూడా అలాగే అనుకునుంటే బాగుండేది. ఈ

# అప్పటికింకా ముగిసిపోదు

-మురళీకృష్ణ పాయల
8309468318



అక్కడక్కడా
ఈశాన్య పవనం పెదవుల్ని తుంపర్లై తాకుతున్నపుడు
నేను నీకు తెలియకుండానే వెళ్లిపోతాను

ఖచ్చితంగా నాపక్కనే నువ్వు నిద్రపోతూ వేల మైళ్ళ
దూరమైపోతావు
ఆకాశమలా చీకటి చీకటిగా రాలడం
ముగింపుకు మలుపు కావచ్చు

స్పష్టంగా మనకు పరిచయమైన నడవడిక మెల్లమెల్లగా
ఎందుకు అర్థం కాకుండాపోతుందో తెలుసుకోవడంలోనే
మనం ఇంకొకరికి అస్పష్టమైపోతుంటాం

ఎవరో నీకందించిన స్వరపేటికను
ఎంత తృణప్రాయంగా మధ్యలో వదిలేస్తావో
నాకు తెలిసినంత ఎక్కువగా
ఎవరికైనా ఎందుకు తెలియాలి!?
పైపైనే నీ పద్యాన్ని హత్తుకున్న వాడు
అకస్మాత్తుగా నీపై దండెత్తితే మరో పద్యానికి
పూనుకుంటావు

నీ స్నేహాన్ని కోరి తలకెత్తుకున్నవాడు
ద్వేషాన్ని విషంలా కక్కిన రోజు
నువ్వు మునుపటికన్నా ముందుంటావు

ఉదయపునడకల మైదానంలో
నీ సూర్యోదయాలు మసిబారిపోతే ఆనందిస్తావు
సమూహంలో ఏ మూలనో
దిక్కుమాలి నువ్వు బ్రతుకు తున్నపుడు
గత రాత్రులన్నీ వెలికి తీయబడి
నీ కన్నీటి చుక్కలు
వలపు పూల జల్లులుగా నిందించబడితే నవ్వుకుంటావు

ఖాళీ కాగితానికి తప్ప నువ్వెవరికీ అర్థం కావని
పాత పుస్తకాల మధ్య పేజీల్లో
ఎవరూ గుర్తించని
నువ్వు దాచి పెట్టుకున్న హృదయానికి
బాగా తెలుసు

ముగింపు క్షణాలకు
పునరుజ్జీవనం కోసం నల్లగా మండుతుంటావు
బోరుబావిలో పడ్డ పిల్లాడు ప్రాణాలతో బయట పడ్డపుడు
తల్లి ముఖం లాంటి ఆనందం కోసం తపిస్తూ తప్పిపోతావు

అప్పటికింకా నీ జీవితం ముగిసిపోదు ◆

---

విషయాన్ని నన్ను పెళ్లి చేసుకోబోయే వారెవరైనా వాళ్ళ దగ్గర దాచకూడదని అనుకున్నాను. అందుకే నీకు చెప్పడం. నువ్వు ఆలోచించుకుని నిర్ణయం తీసుకో" చెప్పడం ముగించి పరుగులెడుతున్న అలలను చూస్తూ కూచుంది లలిత.

ఆ అలలు ఇలాంటి కథలెన్నో తాము విన్నామని చెపుతున్నట్టు అనిపించింది. "ఎందరిని నేను కలపలేదు. ఎందరు నా సాక్షిగా విడిపోలేదు. ఫరవాలేదు. ముందుకు వెళ్ళవలసింది నువ్వు" అని ధైర్యం చెపుతున్నట్టు పరుగున వచ్చి కాళ్ళు తాకుతున్నాయి. ముందు కన్నా ఇప్పుడు అలల ఉధ ృతి పెరిగింది. సూర్యుడూ సముద్రం మాటున దాక్కున్నాడు. శరత్చంద్రుడు చిరునవ్వు నవ్వుతున్నాడు. నక్షత్రాలు చుట్టూ చేరి వయ్యారాలు ఒలక బోస్తున్నాయి. నిశ్శబ్ద సంగీతం వీనుల విందు చేస్తోంది.

లలిత చేయి తీసుకుని ప్రదీప్ గుండెలకి హత్తుకున్నాడు. ఆ చేయి వెచ్చగా మెత్తగా ఉంది. ఇద్దరి ఉచ్ఛ్వాస నిచ్ఛ్వాసలు సముద్రపు హోరుతో సయ్యాటలాడుతున్నాయి.

"పద. అమ్మను రేపు కలుద్దాం, నిన్ను పరిచయం చేస్తాను" అంటూ ప్రదీప్ లలితను ఆఫీస్‌లో వదిలి పెట్టాడు.

ఎవరో పాత పాటలు పెట్టుకున్నారు కాబోలు. శ్రావ్యంగా ఘంటసాల గొంతులో నుంచి "మనసున మనసై బతుకును బతుకై తోడొకరుండిన అదే భాగ్యము అదే స్వర్గమూ.." పాట వినిపిస్తోంది. లలిత ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ ఆఫీస్ లోకి అడుగు పెట్టింది. రేపు ప్రదీప్ వాళ్ళ అమ్మను కలవడానికి వెళ్ళేటప్పుడు ఏం డ్రెస్ వేసుకోవాలా అని ఆలోచిస్తూ ...

◆

# మట్టి చీకటి సం'గీతం'

- నల్లా నరసింహమూర్తి
9247577501



మట్టి చిగురు వెనుక
మౌనం ప్రవహిస్తోంది కాలం నదిలో
పచ్చని పొలం
రొయ్య మడుగై కాలుష్యాన్ని చిమ్ముతోంది
బంగారం లాంటి పొలం
నిశ్శబ్దంగా నిద్రిస్తోంది
పచ్చదనం క్రొత్త అనుభూతుల్ని వెదజల్లే
అపూర్వ స్ఫూర్తి
చిగురు గుండె గుడిలో కనిపించడం లేదు
ప్రవహించే కాలువ నీరు
మురికినీరై ప్రకాశిస్తోంది
రైతు చిరిగిన బతుకులో ఆకలి అలలు
గాయాలు తడిలేని ఎడారైంది
పొలం గట్టు జానపద పాటలు పల్లకిలో
ఊరేగుతోంది నిశ్శబ్దంగా గాలి స్పర్శతో
ఆ జ్ఞాపకాలన్నీ గుండెలను వెలిగించి వెళ్లింది
కరెన్సీ కాగితాల మత్తులో
మట్టి హృదయాన్ని పగలగొట్టి కత్తుల వంతెన వేస్తున్నారు
అందరికి అన్నం పెట్టె రైతు
నగ్నంగా కన్నీళ్ళు పెడుతున్నాడు
పచ్చని పొలం లేదు రాతి చిగుళ్ళుగా మారి
రొయ్యలకు కన్నీటి స్వాగతం పలుకుతున్నాయి
కాలుష్యంతో చిల్లులు పడ్డ మట్టి గుండెకాయను
చూసుకుంటున్నాడు నిశీధిలో అన్నదాత
కాలం సాక్షిగా
మట్టి మానవతా సుగంధ వీచిక కోసం
సారవంతమయిన హృదయం
రొయ్య మడుగుల క్రింద తపస్సు చేస్తోంది
మళ్లీ చైతన్యం కోసం వసంతాల కోసం
ఎన్నో జీవితాలు కాలుష్యం మంటల్లో
కాలిపోతున్నాయ్ దృశ్యం మారిపోతోంది క్షణక్షణం
ఆకలి జీవిత విశాల రంగస్థల వేదిక మీద
విశ్వగీతికను ఆలపిస్తోంది
మనిషి స్వార్థం ఎంత పెరిగిందో ఆవిష్కరిస్తోంది
ధాన్యం పండించే రైతు గుండెను లాగేసుకొని
రొయ్యల్ని పండిస్తున్నారు
కరెన్సీ రంగుల నేత్రాల వెలుగుల్లో
మురికి మురికి వాసన
ఆనందాన్ని పంచుకుంటున్నారు కళాత్మకంగా
బతుకంతా బాధల తీవ్ర ఎండలతో
రైతు బ్రతుకు ఎండిన చెరువైంది
మట్టి పరిమళాలు లేని క్షణం ఆత్మహత్యకు వేదికైంది
అందరికి అన్నం పెట్టె రైతు రొయ్యమడుగుల
స్వాగతంతో పర్యావరణ పరిరక్షణ కోసం
కాలం ఆకలి వంతెన మీద నృత్యం చేస్తున్నాడు
రొయ్యమడుగు రాతి గుండెను చూసి
కళ్లల్లో చెమ్మతనం ఆవిరైపోయింది
చెట్టు నుండి రాలే ఆకుల్లా
కోట్ల కరెన్సీ కాగితాల కోసం
కార్పొరేట్లు రొయ్య మడుగుల వ్యాపారంలో
పచ్చదనాన్ని ఉరివేస్తున్నారు నిశ్శబ్దంగా
పొలం చుట్టూ కొబ్బరి మొక్కలు రక్షకులుగా ఉండేవి
నేడు కాలుష్యంతో చనిపోయి విషాదాన్ని నింపుతున్నాయే
కొబ్బరి పూలు గాకుండా
ట్రాఫిక్ దీపాలు, సిమ్మెంట్ రోడ్డు పూస్తున్నాయ్
రైతుల ఆశల్ని సమిధలుగా చేసి
ఆకలి సంగీతాన్ని వినిపిస్తున్నారు అలుపెరుగని గొంతుతో
క్షణక్షణం కరెన్సీ కాగితాలు
ఆకాశంలో ఉదయిస్తున్నాయ్
చీకటిలో చిక్కిన హృదయం మళ్లీ స్వేచ్ఛగా
బయటికి రావడంలేదు పక్షిలా
ప్రవహించే కాలం మంచుముద్దలై కరిగిపోతున్నాయ్
మునిమాపు చైతన్యం నిశ్శబ్దంలో
శరీరానికి మనసుకు కాలుష్యం అత్తరుగా అద్దుకుని
జీవితకాలం పాటు
కాలం తీగను పెనవేసుకొని
ధనస్వాముల స్వార్థ బహువుల్లో బంధీనై
ఆకలి నిప్పుల మీద నిరాశ సాంబ్రాణీ పొడి చల్లినట్లు
పొగలు కక్కుతున్నాను మౌనంగా

(కోనసీమలో పచ్చని పంట పొలాలు రొయ్య మడుగులుగా మారుతున్న దృశ్యం చూసి హృదయం ద్రవించి....) ♦



కందుకూరి వీరేశలింగం
**(16.04.1848 -27.5.1919)**

# ఆయన సాహసంలో సగం ఆమే

- డా॥ కనుపర్తి విజయబక్ష్
9441382303

కందుకూరి శతవర్ధంతి సందర్భంగా ఎంతో శ్రద్ధతో, నిబద్ధతతో వీరేశలింగం మీద ప్రతి నెల అమూల్యమైన వ్యాసాలనెన్నింటినో, పెద్దలెందరో రాసినవి వరుసగా అసిధారావ్రతం వలె ప్రచురించారు సాహిత్య ప్రస్థానం పత్రికా సారథులు. వారిని ఈ సందర్భంగా ఎంత పొగిడినా అది చాలా తక్కువే.

వీరేశలింగం జీవితమంతా యుద్ధరంగమే! ఆయన కలం కత్తితో అవిశ్రాంతంగా సమాజపు ఛాందసంతో పోరాటం సలిపాడు. ఆ యుద్ధంలో ఆయన పడి లేచిన సందర్భాలు చాలానే వున్నాయి. అయినా వీరుని వలె సాహసంతో ఆయుధ పరికరాల ప్రక్రియలతో కలం కత్తితో యధావిధిగా స్వైరవిహారం చేసాడు. తిట్లు, బెదిరింపులు, అవహేళనలు, దూషణలు, తిరస్కారాలు... మానసికంగా ఆయన దెబ్బతీయటానికి కావలసినంత వస్తుసామాగ్రి వుండేది ప్రతిపక్షుల వద్ద. అయినా ఈ బక్కమనిషి పడిపోకుండా నిలదొక్కొని పదేపదే కలంకత్తిని 'నూరుకొని' పదును పెట్టుకొని ప్రతిదాడికి నిలబడి నిలదొక్కుకొనే వాడు. ఎట్లా సాధ్యమైంది?

మితిమీరిన ఈ సాహసం, పట్టుదల, బలం శారీరకంగా బలహీనమైన ఈ మనిషికి ఎక్కడి నుండి వచ్చేయి? ఏ బలం వల్ల అభ్యుదయం వైపు అడుగులు వేయగలిగేడు? ఎవరికైనా తాము చేపట్టి చేస్తోన్న పనులలో ఎవరో ఒకరి చేదోడు, ప్రోత్సాహం కొండంత బలాన్నిస్తుంది. అంతకు ముందు ఎవరు చేయసాహసించని పనులు, నిందాపూర్వకమైనవని అందరూ భావించే పనులు, భయపడిపోయే పనులకి ఎవరీయనకి అంత ప్రోద్భలమిచ్చారు. అంత నిశ్చింతగా మనో నిబ్బరంగా సంఘ వ్యతిరేకమని ముద్రపడిన ఇటువంటి పనులని ఎలా చేయగలిగాడు? ఏ శక్తి ఆయన్ని ప్రేరేపించింది?

ఆయన చేసే ప్రతి పనికి ఆమోదాన్ని తెలుపుతూ, చేయూతనిస్తూ వెన్నంటి నడచిన వ్యక్తి ఆయన జీవన భాగస్వామి శ్రీమతి రాజ్యలక్ష్మి. నిజానికి ఒక్కమాటలో చెప్పాలంటే ఆయన సాహసంలో సగం ఆమెకే దక్కుతుంది.

ఆనాడు ఆయన చేపట్టిన సంస్కరణ కార్యాలన్ని అందరికీ కినుక తెప్పించేవే! ఆడపిల్లలకు చదువు చెప్పించటం, బాల్యవివాహాలు కాదనటం, వితంతువులకి తిరిగి పెళ్ళిళ్ళు చేయాలనటం, కన్యాశుల్కాన్ని వ్యతిరేకించటం, విగ్రహారాధనను వద్దంటూ ఏకేశ్వరోపాసనను ప్రోత్సహించటం, మూఢవిశ్వాసాలను ఖండించటం... ఇత్యాదిక విషయాలు నాటి సమాజానికి కొత్తవి. అంతక్రితం ఇట్లాంటివి ఎవరు కోరుకోలేదు. చేయాలని అనుకోలేదు. ఇవన్నీ అందరికి అసమ్మతిగానే అనిపించటం కాక, వీటి వల్ల సామాజిక కట్టుబాట్లకు అనర్థం ఏర్పడుతుందని చాలామంది గగ్గోలు పెట్టారు. ఆయన ప్రతిపాదించిన ఈ విషయాలు అంగీకరించిన నూటికి ఒకరో... ఇద్దరో! అంతే ! ఆ ఒకరిద్దరిలో ఆయన సహచరి కందుకూరి రాజ్యలక్ష్మిది అగ్రస్థానం.

వీరేశలింగం తన 12వ ఏట 8 ఏళ్ళ వయస్సున్న రాజ్యలక్ష్మిని వివాహమాడాడు. ఆమె 12 ఏళ్ళ వయసులో రాజమహేంద్రికి కాపురానికి వచ్చింది మొదలుకొని దాదాపు

ఏభై సంవత్సరాలపాటు ఆయనని అనుసరిస్తూనే జీవితాన్ని వెళ్ళబుచ్చింది. అందరి సంసారాల్లోని స్త్రీలకు మల్లే ఈమె సంసారం నల్లేరు మీద బండిలా సాగిపోయేది కాదు. నిరంతరం ఘర్షణతో కూడుకొన్న జీవితాన్ని గడిపే భర్తకు భార్య ఈమె. సమాజానికి వ్యతిరేకమనిపించిన ఏ పని చేసినా వెలివేయటాన్కి సిద్ధంగా కాచుకొని కూర్చుండేవారు కులపెద్దలు. బహిష్కారపత్రాలు పంపటాన్కి రెడీగా వుండేవారు పీఠాధిపతులు. ఆ పరిస్థితుల నెదుర్కోటమంటే కష్టమే! అట్లా 'వెలివేయటమంటే చాలా అవమానకరమైన సంఘటనగా భావించేవారు. ఇతరులెవ్వరు వీరివద్దకు రారు. వీరి నితరులెవ్వరు తమ వద్దకు రానివ్వరు. మంచిచెడులకు మాటసాయం కూడా వుండదు. సంఘంతో నా కేమి పని అని వుండటం చాలా కష్టం. ఎంతైనా మానవుడు సంఘజీవే కదా!! అయినా ఎవరెన్ని అవమానాలు చేసినా పరాభవాలెదురైనా తాను నమ్మిన సిద్ధాంతం ప్రకారం తన పని తాను చేసుకొని పోతున్న వీరేశలింగంతో పాటు రాజ్యలక్ష్మి కూడా వీటన్నింటిని ఏ మాత్రం ఖాతరు చేయలేదు. తోటి స్త్రీలతో కలిసి పేరంటాళ్ళు, పండుగలు, పబ్బాలు, వ్రతాలు, నోములు వీటికంటే కూడా వితంతు బాలికలు, యువతులు, ప్రార్థనా సమాజపు స్త్రీలతో కలిసిమెలసి వుండటమే ఆమెకు సంతోషాన్నిచ్చేది.

ఆమె తన పెళ్ళినాటికే చదవగల్గి, రాయగలిగి వుండటం వల్ల వీరేశలింగం ఆమెకు మరికొంత చదువు చెప్పటం జరిగింది. ఆ చదువు ఆమెకు ఉపకరించడమే కాక తదుపరి ఆయన స్థాపించిన వితంతుశరణాలయంలోని స్త్రీలకు చదువు చెప్పటాన్కి ఉపయోగపడింది.

కందుకూరి బ్రహ్మసమాజస్థుడుగా ఏకేశ్వరోపాసన చేపట్టి 'మానవసేవే మాధవసేవ' అని నమ్మి తదనుగుణమైన కార్యక్రమాలు కొనసాగించేవాడు. భార్య అడిగిన మీదట స్త్రీల కోసమై ప్రత్యేకంగా ఒక ప్రార్థనా సమాజాన్ని స్థాపించేడు. అందులో స్త్రీల నందరిని సమావేశపరచి రాజ్యలక్ష్మి ప్రార్థనాగీతాలు పాడతుండేది. ఆమె ఇందు నిమిత్తమై ఎన్నో కీర్తనలు-పాటలు కూడా రచించింది. ఆమె రాసిన ఆ పాటల కీర్తనల సంకలనం 1912లో రాజమహేంద్రిలోని చింతామణి ప్రెస్సులో ముద్రించబడింది. ఇవికాక తొలి తెలుగు కథా రచయిత్రిగా చెప్పబడుతోన్న భండారు అచ్చమాంబ మరణించినపుడు ఆమె కృషిని కొనియాడుతు చెప్పిన సీసపద్యం ఒకటుంది. ఆ పద్యంలో అచ్చమాంబ మహిళాభ్యుదయానికై చేసిన కృషిని పొగుడుతూ "విద్యవలని మేలు విదుషియౌటనెఱింగి పడతుల విద్యకై పాడుపడును..." అంటుంది. అచ్చమాంబ సోదరుడు కొమర్రాజు వెంకటలక్ష్మణరావు సోదరి మరణానంతరం ఆమె చిత్ర పటాన్ని ప్రార్థనా సమాజానికి బహుకరించగా, దాన్ని సమాజంలో పెడుతూ ఒక చక్కటి పాట కూడా రాసింది రాజ్యలక్ష్మి.

విద్యవలన భూషితయై విరివిగ
విద్యాలాభము వెలదుల కొసగెను
అబలసచ్చరిత్ర రత్నమాల
యబలలకు కానుకగా నొసగెను

ఇంకా ఆమె ఎన్నో పాటలు ప్రార్థనా సమాజంలో స్త్రీలు పాడుకొంటానికి అనువుగా వుండేలా రాసింది. ఏకేశ్వరోపాసనకు చెందినవి. స్త్రీలకు విద్యాబుద్ధికలగాలని, విద్యభూషణంబని తలచేలా స్త్రీలను చేయమని, విద్యా వినయాలకీయాలని కోరుకొంటుంది. తాను బ్రహ్మసమాజ పద్ధతినే అనుసరించింది అని చెప్పుకొనే పద్యం -

నోములు వ్రతములు మానితి
నా మానసమున వసించి నా కెల్లపుడున్
నీ మీదనచల భక్తిని
స్వామీ దయ చేయమయ్య సత్కృపతోడన్

ఈ కీర్తనల్లో పాటల్లో హారతి, జోలపాటలు, స్త్రీ విద్యావిషయకమైనవి ఆమె ప్రార్థనా సమాజంలో పాడి, వినిపించి అందరిచేత పాడించేవి వున్నాయి.

ఆమెను ఏ దూరప్రాంతం వెళ్తున్నా వీరేశలింగం తనతోపాటు తీసుకెళ్ళేవాడు. అట్లా ఆమె మద్రాసు, బెంగుళూరు, మంగుళూరు, బరంపురం మొదలైన ప్రాంతాలన్నీ తిరిగారు.

ఆ సందర్భంలోనే ఒక పాటలో ఆమె "విదేశముల నెల్ల విరివిగా చూసి స్వదేశమునకు రాజ్యలక్ష్మిని చేర్చెను" అంటు దూర దూర పట్టణాలను విదేశములు అంటుంది.

"దేశముల మనము తెలివితో దిరిగిన దేశవార్తలు వాయువేగమున దెల్పును"

కందుకూరి తలపెట్టి కొనసాగిస్తున్న సంఘ సంస్కరణల వల్ల నష్టం చాలా వుందని వ్యాకుల పడిన బంధువర్గం ఇట్లాటి పనుల నుండి ఆయన్ని విరమింప చేయమని ఆమెని బతిమాలినా, బెదిరించినా ఆమె ఏ మాత్రం లక్ష్యపెట్టలేదు;

## విజిల్

### రాయితీలు

- బండి ప్రసాదరావు
9866483732



ఒకటి కొంటే రెండు యిచ్చును రాయితీలు
అదనుజూసియె అది ఫలిచ్చును రాయితీలు

"బండ" గుడియగు పొగలు విషమగు వ్యాధి యింట
అమ్మకాలకె లబ్ధిగూర్చును రాయితీలు

ధనమె ఘనమై రాజమేలగ ధర్మమేది?
మాయమాటలె హోయి శూన్యము రాయితీలు

"దూడ" రుణముకు తాడు ఉచితం దుఃఖమౌను
తీర్థస్వార్థమె మెండుయోగదె రాయితీలు

కులము పేరున విద్య, కొలువులు కల్లలయ్యె
బ్రహ్మముడుల బేక్‌లాగ్‌లు రాయితీలు

లక్షలెనిమిది పదితొ సరియట దక్షతాన
కోట్లు దొరలకు నలుబదాయెన రాయితీలు

తంతులెన్నియె తంత్రమందున పంతముండె
మంతనాలతొ మసగబారును రాయితీలు

వెనుక బాటును పాటకర్థము వేటుగొనుటె
ప్రవేటు బోనులొ ఎరలు అయ్యెను రాయితీలు ◆

---

కారణం భర్త చేసే పనులు మంచివనే విశ్వాసం ఆమెకు కలగడం వల్లనే! లేకుంటే పెళ్ళి చేసుకోవాలని ఆశతో వచ్చే వితంతువులను, ఆశ్రయం కోరి వచ్చేవారిని ఆమె అంత ప్రేమతో చూడగలిగేది కాదు. అంత ఆదరణ ఇచ్చేది కాదు. పైగా వారిని బొట్టు పూలు గాజులతో అలంకరించగలిగేది అంటే అది సామాన్యమైన విషయం కాదు. ఎవ్వరూ సాయం రాకున్నా గోదావరికి వెళ్ళి నీళ్ళు మోసుకొచ్చి వారి పెళ్ళిళ్ళల్లో వంటవార్పు చేయాలంటే ఎంత సహృదయం వుండాలి! ఇట్లా పెళ్ళైన వారు ఇంకేదైనా పొరపాటున గర్భం దాల్చి పిల్లల్ని కని వదిలేసినా వాళ్ళ బాధ్యత కూడా తానే మోసేది!

భర్త సంపాదించే ధనమంతా పుస్తకాలు అచ్చువేయటాన్కి పత్రికలు పెట్టి నడపటానికి, వితంతు శరణాలయ స్థాపనకు, ప్రార్థనాలయాలు, పాఠశాలలు నిర్మాణమూ అంటూ, పురమందిరాలు అది యిదంటూ ఖర్చు చేస్తున్నా, ఆమె ఏమి అడ్డు చెప్పకపోవటమేకాక సహకరించేదంటే ఆమె గొప్పతనమేమిటో అర్థం అవుతుంది.

కోపిష్ఠి అయిన వీరేశలింగాన్ని తన సాంత్వన వచనాలతో శాంతింప చేయగల నేర్పున్న స్త్రీ. ఆయన నిర్విరామ నిరంతర సాహిత్యసంఘ సంస్కరణ కృషిలో ఆవిడ సహకారం, ధైర్యం, ఆయన వెన్నంటి నిలబడటం వల్లనే నిశ్చింతంగా ఆయన అన్ని పనులు చేయగలిగాడు. అందుకే ఆమె మరణానంతరం కాలాన్ని తన జీవితంలో "అసహాయదశ" అని పేర్కొన్నాడు. తన కత్యంత ప్రేమపాత్రురాలైన ఆమెకు తన స్వీయచరిత్రను అంకితం చేస్తూ చెప్పిన మాటలు వారిద్దరి అన్యోన్యతకు అద్దం పడతాయి....

నేను చేసిన సమస్త ప్రయత్నములలోను
ఛాయ వలె నా తోడ నుండి నన్ను
ధర్మమార్గానుసరణమునందు నా తోడ గూడ
సకల కష్టములను సంతోష పూర్వకముగా సహించుచు
సత్యమైన సహధర్మచారిణియయి
తల్లిబిడ్డకు వలె నవ్యాజానురాగముతోడ
సహస్రహస్తములతో సదా నాకు
సంరక్షణము చేయుచు
ఏబది సంవత్సరముల కాలము
నా ప్రాణమునకు ప్రాణమయియుండిన
నా యర్థాంగలక్ష్మియైన రాజ్యలక్ష్మికి
దీనిని నే నంకితము చేయు చున్నాడను.

ఆమె మరణానంతరం ఆయన పడ్డ పాట్లు అన్నియిన్ని కావు. ఆమె సమాధిని పాలరాతితో నిర్మింపచేసి, అందు మీద ఆమె జననమరణ తేదీలను అందంగా రెండు పాలరాతి పలకల మీద చిత్రింపచేసాడు. దానిచుట్టు రంగు రంగుల పూల మొక్కల్ని శ్రద్ధగా వేయించాడు.

సంఘవ్యతిరేకతను ఎదుర్కొంటూ, ఏ మాత్రం చలించక తన జీవితాంతం మొక్కవోని ధైర్యంతో యిన్ని పనులను ఆచరించిన కందుకూరి వీరేశలింగం పట్టుదల, ధీరత్వంలో సగభాగం రాజ్యాలక్ష్మికి చెందవలసిందే! ◆

# అతడొస్తాడు




సూర్యుని కన్నా
అమ్మే ముందు ఉదయిస్తుంది-
అమ్మను కూడా నిద్రలేపే
జీవరాగాన్ని చూసారా
మీరెపుడైనా?

- శిఖా- ఆకాష్
9381522247

ఆ బాల్యానికి
ఆకలిపోరాటం
ఒక పాఠం చెప్పింది-
తరగతి గదిని
బతుకు పాఠం చేసుకుని
తన బాల్యాన్ని
వీధి మీద ఆరేస్తాడు-
భూమికి వేళ్లైన
నదిని తన కాళ్ళకు కట్టుకుని
భాషకు ఊపిరైనా
వేకువ పిట్టల ఆశల్ని
తన కళ్ళలో నింపుకుని
అక్షర కాంతిని
ఇంటింటా ప్రసరింపజేసేందుకు
చీకటిని చెదరగొట్టే
సైకిల్ బెల్లై...
వెలుతురును పంచిపెట్టే
సూర్య రథమై....
అతనొస్తాడు-
కాలానికి క్రమశిక్షణ నేర్పిన
చైతన్య స్వరమై
దేశదేశాల కరచాలనమై
మన వీధిలోకి
అతనొస్తాడు-
సమస్త ప్రపంచాన్నీ
మాయాదర్పణంలో బంధించి
క్షణకాలంలో దర్శింపజేసే
మహా మాంత్రికుడిలా
అతడొస్తాడు-
నడిచే ప్రపంచాన్ని
నడిపించే సమాజాన్ని
నడిచొచ్చిన నాగరికతని
నడయాడేబోయే నయాగరాల్ని
పొట్లంగట్టి
పొద్దున్నే ఇంటిముందు
అక్షరాకాశాల్ని పరచిపోతాడు-
పొద్దున్నే
మన ఇంటిముందు ఆకాశమౌతాడు-
తరగతి గదిలో విద్యార్థి
సూరీడౌతాడు-
సాయంకాలం పచారీకొట్లో
గుమస్తా చంద్రుడౌతాడు-
ఏ వీధికీ పేపర్‌గర్ల్‌ని
పరిచయం చేయకుండా
తానో వెలుతురును ప్రసవించే
చీకటి తల్లిగానే మిగిలిపోతాడు-
నిత్యం ఆకలిరాగంతో
జీవన గీతాన్నాలపిస్తూ...
అతడొస్తాడు-
చలిని వణికించైనా
వర్షాన్ని బెదిరించైనా
జ్వరాన్ని జోకొట్టైనా
నిత్య సంగీతమై
స్వచ్ఛ సంకీర్తనై
అతడొస్తాడు-
ఎన్నెన్నో సన్మాన సత్కార
సంతోష సమయాల సంబరాల్ని
వెంటేసుకుని
జీవిత పాఠాల్ని నెమరువేసుకుంటూ...
వచ్చే ఆ నిత్య విద్యార్థిని
ఎపుడైనా ప్రేమగా పలకరించామా?!
ఆత్మీయంగా భుజం తట్టామా?!
ఆప్యాయంగా మెచ్చుకున్నామా?!
అతడొస్తాడు
ప్రతిరోజూ
మనకు కనిపించకుండానే-

◆




# కాలంతో కదలిన గేయం

డా॥ పాపినేని శివశంకర్

సంగీత సాహిత్యాలు కలగలిసిందే పాట. పాటకు మరో మాట గేయం. గేయానికి మరో మాట గీతం. ఇవన్నీ ఇంచుమించు సమానార్థకాలే. సాహిత్య ప్రక్రియల్లో తక్కిన వాటికి లేని ప్రత్యేకత పాట లేదా గేయానికి ఉన్నది. అందులో సాధారణంగా పల్లవి, చరణాలు ఉంటాయి. ఒక్కొక సారి అనుపల్లవి కూడా ఉండవచ్చు. అది పాడినప్పుడు శ్రుతిలయలతో కూడిన గానం శ్రోతల్ని తేలిగ్గా ఆకట్టుకొంటుంది. గానానికి సహజంగానే హృదయాన్ని ద్రవీకరించే శక్తి ఉంటుంది. ఆ క్రమంలోనే అందులో కలగలిసిన భావాలు కూడా శ్రోతల్ని సులభంగా చేరుకోగలవు. కనుకనే తక్కిన సాహిత్య ప్రకియలకి లేని ఆకర్షణ శక్తి, ప్రేరణ శక్తి పాటకి ఉంటుంది. కనుకనే ఒక్కొక సారి పెద్ద కవుల రచనల కన్న సాధారణ కవుల గేయాలు లోకుల నోళ్లలో నానుతుండటం కద్దు. ప్రతి ఉద్యమ సందర్భంలోను ప్రజల్ని తక్షణం ఆకట్టుకోవటానికి ఎన్నో గేయాలు వెలువడుతుంటాయి. అదే క్రమంలో అవి అప్పటి సామాజిక పరిణామాల్ని నమోదు చేస్తుంటాయి.

పద్య కవిత, వచనకవితల కన్న పాటకు ఆశు లక్షణం**(Spontaneity)** ఉంటుంది. అల్లిక పనితనం ఉంటుంది. పదే పదే పాడే క్రమంలో పాటలో కొత్త కూర్పు **(Improvisation)** కూడా జరుగుతుంది. పాతకాలం నాటి జానపదగేయాలు మొదలు ఇప్పటి చైతన్య గీతాలదాక అపురూపమైన కవిత్వీకరణ గల పాటలెన్నో ఉన్నాయి. అయితే సాహిత్య చరిత్రలో తతిమ్మా ప్రకియలకి లభించిన గౌరవం గేయ సాహిత్యానికి లభించలేదు. జానపద గేయాలు గాని, అన్నమయ్య, వీరబ్రహ్మం, త్యాగయ్య మొదలైనవారి కీర్తనలు గాని సాహిత్యపరంగా విశ్లేషించబడలేదు. వాటిని పక్కన బెడితే 20, 21 శతాబ్దాల్లో వచ్చిన గేయ సాహిత్యం సమకాలిక సామాజిక సంఘటనల్ని, ఉద్యమాల్ని, స్వీయానుభూతుల్ని రంగరించుకొంటూ కొనసాగింది. ఆ పరిణామాల్ని పదిలపరుచుకోవటానికి కొన్ని విలువైన గేయాల్ని ఏరి కూర్చాలనే తలపుతోనే ఈ సంకలనం రూపు దిద్దుకొంది.

20వ శతాబ్ది మొదట్లో ఆంగ్లేయుల వలస పాలనలో ప్రజాస్వామిక, మానవతా వాద భావాలతో కూడిన ఆధునికత ఏర్పడింది. మధ్య తరగతినుంచి ప్రగతిశీలక ఆలోచనా రీతులు మొదలయ్యాయి. ఈ సంఘం, ఈ దేశం గురించిన తపన మొదలైంది. తత్ఫలితమే జాతీయోద్యమం. అది అంతకు మునుపు లేని భారతజాతి అనే ఐక్యభావనను కల్పించి, దేశ సంస్కృతికి కొత్త సారం ఇచ్చింది. మతదృక్పథాన్ని విశాలం చేసింది. 'మేలుకొనుమీ భరతపుత్రుడ! మేలుకొనుమీ సుజనమిత్రుడ! మేలుకొనుమీ సచ్చరిత్రుడ! మేలుకొనవయ్యా!' అంటూ కవులు (మంగిపూడి) 'జాతీయత అను వేగుచుక్క'ను చూపించారు. జాతీయోద్యమ క్రమంలోనే బంకించంద్ర 'వందే మాతరమ్'తో 'దేశమాత' అనే రూపకం ఏర్పడింది.

మహాత్మగాంధీ భావాలవల్ల ప్రచోదితులై, ఆయన అడుగు జాడల్లో ఎందరో కవులు, రచయితలు చైతన్యస్ఫోరకమైన రచనలు చేశారు. దేశభక్తిని దాటి 'మాకొద్దీ తెల్ల దొరతనమూ' (గరిమెళ్ల) అన్నప్పుడు జాతీయభావన స్వాతంత్ర్యేచ్ఛగా మారిందని అర్థమవుతుంది. 'శ్రీ గాంధి నామం మరువం మరువం' (దామరాజు) అని దేశభక్తులు ప్రతిన బూనారు. స్వాతంత్ర్యోద్యమకారులకు వీరగంధాలు పూశారు. భారత జనయిత్రికి జయ హారతులిచ్చారు. స్వరాజ్యం సిద్ధించగానే 'మాదీ స్వతంత్రదేశం' (బాలాంత్రపు) అంటూ ఉప్పొంగిపోయారు. కథలు, కవితలు, గేయాలు, కావ్యాలు వెల్లువలయ్యాయి.

జాతీయోద్యమంలో హరిజనోద్ధరణ కూడా ఒక భాగమైంది. కింది కులాల పట్ల సానుభూతి కవిత్వం వెలువడింది. అదే కాలంలో 'మాకొద్దీ నల్ల దొరతనమూ' (కుసుమ ధర్మన్న) అన్న ప్రబల దళితస్వరం వినపడటం ఆశ్చర్యమే. అది గాంధీ మార్గానికి ఎడంగా జరిగిన స్వతంత్రకంఠం. వేదనాన్నిపూరితమైన ఆ కంఠం అగ్రవర్ణాలు పాటించే అంటరానితనంలోని వైరుధ్యాలను వినయంగా ప్రశ్నించింది. 'వారు వీరను వాదభేదమేమీ లేక భూమి మోయుచున్నదండి...సృష్టిలో భేదమేదీ చూపండి' అని నిగ్గదీసింది. గరిమెళ్ల తెల్ల దొరతనం పాటకి ఎదురుగా అదే బాణీలో సాగిన గేయం అది. (56 చరణాల ఆ సుదీర్ఘ గేయంలో కొంత భాగం ఈ సంకలనంలో చేరింది.) ధర్మన్న కవి ఆవేదనే కాలక్రమంలో దళిత చైతన్యంగా విప్పారింది. ఫూలే, అంబేద్కరుల భావాలనుంచి ఉత్తేజం పొందింది. ఇక ప్రత్యేకించి కులచేతన అగపడకున్నా అట్టడుగు సామాజిక వర్గాల గురించిన ఆవేదనతో 'అన్నా కూలీ లేకము కావలెరా!' అని పెండ్యాల లోకనాథం తొలి శ్రామికగీతం రచించాడు. 'ఎన్నాళ్లీ కాపురాలు', (నాజర్), 'పల్లెటూరి పిల్లగాడ!' (సుద్దాల హనుమంతు) మొదలైన పాటలు కూడా శ్రామికపక్షపాతంతో వచ్చినవే.

ఒకవైపు స్వాతంత్ర్యపోరాటం సాగుతున్న కాలంలోనే తెలుగు వారికి సొంత రాష్ట్రం గురించిన ఆలోచన ఒక ఉద్యమంగా రూపు దిద్దుకొంది. కవులు 'రాష్ట్ర గానాలు' చేశారు. తెలుగువారి తలపుల్లోనుంచి తెలుగు తల్లి ఆవిర్భవించింది. 'తెనుంగు తల్లీ! నీకు జోహారు/దేశమాతా! నీకు జేజేలు' (తుమ్మల సీతారామమూర్తి) అని కవులు గానం చేశారు. గతకీర్తి తలచి, తెలుగువాడిని చెయ్యెత్తి జైకొట్టమన్నారు (వేములపల్లి శ్రీకృష్ణ). 'పంచె కట్టుటలో ప్రపంచాన మొనగాడు, తిక్క రేగిందంటె డొక్కచీల్చేవాడు' (సి. నారాయణ రెడ్డి) తెలుగువాడు కీర్తించబడ్డాడు. అయితే తెలుగు తల్లి ఎక్కడుంది అని ఈ మధ్య కొందరు ప్రశ్నించటం అతి-తెలివి తప్ప మరొకటి కాదు. 'భరతమాత... తెలుగుతల్లి..! ... ఈ పద్యాలు...మాటలకేం గాని ఆ మట్టిని చూసి నీకు తల్లిలా అనిపించిందా?... ఏదో మాతట. వీళ్లకి స్తన్యం ఇస్తోందట... లేని మాతల్నీ అక్కల్నీ కల్పించుకొని ఎందుకా ఏడుపులు?' అని ఏనాడో చలం కూడా ఈసడించాడు. తెలుగుతల్లి, దేశమాత మొదలైనవి భావనలు. వాటికి భౌతికస్థితి ఉండదు. ఉండకపోయినా అవి మనకొక భావోద్వేగాన్ని, ఆలోచనలకు పుష్టిని కలిగిస్తాయి. ఒక గొప్ప ఆచరణకి దారితీస్తాయి. మాత అనే రూపాన్ని మనసుల్లో నిల్పుకోగలిగితే ఆ విషయం పట్ల మనకు గౌరవం కలుగుతుంది. అది గ్రహించలేని వాళ్ల బుద్ధి కాస్త మందగించిందనటంలో నాకెలాంటి సందేహం లేదు.

భారత్-చైనా యుద్ధ సందర్భంలో (1962) ఎన్నో పాటలు, దేశభక్తిపూరితమైనవి వెలువడ్డాయి. అయితే సంకలనకారులు వాటిపై 'శీతకన్ను' వేశారు. అటువంటి పాటల్లో ఒక ఆగ్రహ గీతం 'మంచుకొండను మ్రింగవచ్చిందిరా చైన....పొంగరా జలధివై మ్రింగరా అరుల' (దాశరథి రంగాచార్య) అని ఉద్రేకించింది. మరో గొంతు 'పద పదరా! భారత వీరా! పథమంతా నీ వశమేరా!' (యస్వీ జోగారావు) అని వెన్ను తట్టింది. అన్నిటిలో 'జయం మనది, జయం మనది, జయం మనదిరా' అని ఘంటసాల గొంతు చీల్చుకు వచ్చిన ఉత్తేజకరమైన పాట ఆ రోజుల్లో తెలుగునాట మార్మోగింది. అదే సమయంలో చైనాని వెనకేసుకొచ్చిన భారత రాజకీయవేత్తలూ ఉన్నారని తెలిసినప్పుడు బాధ కలుగుతుంది. జాతీయత పిమ్మటనే అంతర్జాతీయత అని, ఏ సిద్ధాంతమైనా స్వదేశక్షేమాన్ని తృణీకరించరాదనీ తెలుసుకొంటే మంచిది.

అభ్యుదయ, విప్లవ కవిత్వోద్యమాల్లో వచన కవిత్వానికి దీటుగా వందలకొద్దీ పాటలు వెలువడ్డాయి. వివిధ (సాంస్కృతిక సంస్థల) గాయకుల ద్వారా విస్తృతంగా ప్రచారమయ్యాయి. ఒక గేయం 'అంగారగంగలాగ తరంగించుతూ పద'మని అంటే (రాంభట్ల) అభ్యుదయగీతం

అలపిస్తే, ఇంకో పాట 'గోలకొండ ఖిల్లకింద నీ గోరి కడ్తం కొడకో' (యాదగిరి) అని నిజాం నవాబుకే తుది హెచ్చరిక చేసింది. ఒక పాట నర్రెంగ చెట్టుకింద నెత్తుటి వాగులో ఒరిగిన భాస్కరుడిని స్మరిస్తే, (శివసాగర్), వేరొకటి 'పోరూ మార్గానెన్నీయలో... కలిసే పోదామెన్నీయలో' (అల్లం నారాయణ) అంటూ సామూహిక విప్లవగానం చేసింది. 'శ్రమ ఎవడిదిరో, సిరి ఎవడిదిరో' (చెరబండరాజు) అని ప్రశ్నిస్తూ ఒక పాట సాగితే, 'ఊరు మనది' అయినప్పుడు 'దొర పెత్తనమేందిరో' (గూడ అంజయ్య) అని వేరొక పాట ప్రశ్నించింది. 'కవిత శితఖడ్గం' (అదృష్టదీపక్) అయింది. ముఖ్యంగా తెలంగాణ గడ్డపై పాట వీరనాట్యమాడింది. కాగా ప్రపంచీకరణ విషవీచికల్ని నిరసించే 'పల్లె కన్నీరు', 'గ్లోబల్ సంకెళ్లు', 'హైటెక్ మాయలేడి' కవితల్ని పరిశీలించవచ్చు.

కవులు వర్తమానం నుంచి భవిష్యత్తులోకీ ప్రయాణించగలరు. గతంలోకీ ప్రయాణించగలరు. ఆ ప్రయాణం అకారణంగా జరగదు. గతకాలపు ఔన్నత్యాన్ని, వైభవాన్ని తలచుకొంటే వర్తమాన ప్రయత్నాలకి మళ్లీ కొత్త సత్తువ వస్తుంది. జాతీయోద్యమకాలంలో ఈ గత వైభవ ప్రసక్తి ఎన్నో రచనల్లో కన్పించింది. 'గతమెంతొ ఘనకీర్తి' గల తెలుగువాడిని 'చెయ్యెత్తి జై కొట్ట'మంటున్నాడు కవి. ఈ క్రమంలో ప్రాచీనచరిత్రను పునఃస్మరణ చేసుకోవటం కూడా వర్తమాన అవసరమే. 'దత్తమండలం' అనే ఆంగ్లేయుల పరిభాష సరి కాదని, 'రాయలసీమ' అని వ్యవహరించటం అవసరమని ఒకనాడు కవులు (చిలుకూరి నారాయణరావు) చేసిన విన్నపం ఫలించింది. నాటి రాయలసీమ పండిత కవి (రాళ్లపల్లి) పెనుగొండ కొండ ధైర్య స్థైర్యాలను తలపోశాడు. కాగా నేటి కవి (పాపినేని) 'అమరావతి' చారిత్రక ఖ్యాతిని తిరిగి గుర్తు చేస్తున్నాడు. ఒక మహారాజధాని నిర్మాణ ప్రయత్నాల నేపథ్యంలో 'అమరావతి' గేయానికి ప్రత్యేకత ఉంటుంది. నాయకుల కన్న ప్రతినాయకులే వెలిగిపోతున్న తరుణంలో దాటిపోయిన త్యాగధనుల్ని, సమున్నత వ్యక్తిత్వాల్ని సానుకూల దృక్పథంతో స్మరించుకోవటం కూడా వర్తమాన అవసరమే. కనుకనే 'అమరజీవి,' 'అల్లూరి సీతారామరాజు' ఈ సంకలనంలోకి ప్రవేశించారు.

ప్రాంతీయత, ప్రాంతీయ సమస్యలు, ఉద్యమాలు తక్కిన ప్రాంతాలను కూడా ప్రభావితం చేస్తాయి. ఒకనాడు తెలంగాణ రైతాంగ విముక్తి పోరాటం ఆంధ్ర ప్రాంత రచయితల్నీ ఎంతగానో కదిలించింది, తనలో కలుపుకుంది. 'నవలోకం ప్రభవించునులే, దానవలోకం సమయునులే' అని కవులు (తుమ్మల) ఆశించారు. ఇక 'యమ బాధలు' పెట్టిన నిజాము పిశాచానికి 'గోలకొండ ఖిల్ల కింద' గోరి కట్టిన గాయకుడు (యాదగిరి) ఇందులో ఉన్నాడు. 'నల్లగొండలో నాజీ వృత్తుల నగ్ననృత్యమింకెన్నాళ్లు' అని ప్రశ్నించిన కవి (కాళోజీ) ఉన్నాడు. తెలంగాణ రాష్ట్ర సాధన క్రమంలో 'నవ్వేటి బతుకుల్ల నా తెలంగాణ' అని తన నేలపై వలపు చూపిన కవీ (నందిని సిధారెడ్డి) ఉన్నాడు. 'ఇంత మంచి పెన్నతల్లి ఎందుకెండి పోయెనో?' (విశ్వం) అన్నప్పుడు కరువు గడ్డగా మారిన రాయల సీమ దుఃఖం ఏరై పారుతుంది. పుట్టిన తావు పట్ల ఎనలేని కూరిమి ఉన్నపుడే 'పలనాడు వెలలేని మాగాణిరా!' (పులుపుల వెంకట శివయ్య) అనే విధంగా పాటలు పుట్టుకొస్తాయి. అలాగే గోగాకును, పొగాకును, పత్తిని, ఎండు మిరప ఘాటును గుర్తు చేసే 'గుంటూరు' గేయం కూడా.

రైతును విస్మరించిన ఏ సాహిత్యమైనా సారం లేని పిప్పిదంటులా అన్పిస్తుంది నాకు. సంకలనాలైనా అంతే. 'ఆగునా జీవాలు సాగునా లోకాలు / రాజుగా మనమెంచి రైతు జూడకపోతె' (శెట్టిపల్లి) అనే భావన కలగాలి. 'పచ్చపచ్చగ పండి ఒరిగున్న' పంటచేను రొద (సుంకర) కావాలి. 'రేగటి పొలాల నాగలి చిందించిన చెమటచుక్క' (పాపినేని) తడి జనానికి సోకాలి. 'ఏరువాకా సాగారో రన్నో చిన్నన్నా! నీ కష్టమంతా తీరునురో రన్నో చిన్నన్నా!' (కొసరాజు) అనే భరోసా కావాలి. (ఇది చలనచిత్రంలో పాట అయినా రైతు బ్రతుకును కనులార వర్ణించి, ప్రసిద్ధి చెందింది.)

కాలాన్ని బట్టి కవుల ఆలోచనా విధానం కూడా మారటం సహజమే. భిన్నకాలాల్లో భిన్న కవులు ఒకే విషయం మీదైనా భిన్నంగా ఆలోచించాల్సిన అవసరం ఏర్పడవచ్చు. 'మాకొద్దీ తెల్లదొరతనమూ' (గరిమెళ్ల) అనేది ఒక ధోరణి అయితే 'మాకొద్దీ నల్ల దొరతనమూ' (కుసుమ ధర్మన్న) అనేది మరొక ధోరణి. ఏదీ అబద్ధం కాదు. అది ఆ కాలపు సత్యమే. కాలం మారినప్పుడు సత్యం యొక్క ఆవలిమోము కనిపిస్తుంది. విస్మయం కలుగుతుంది. చిరకాలపు సంకెళ్లు తెగిపోయిన సవ్వడిలో, స్వాతంత్ర్య శంఖారావంలో అప్పటికవులు 'మాదీ స్వతంత్రదేశం' అంటూ ఆహ్లాదంగా గొంతు కలిపారు. రెండు

దశాబ్దాలు గడవకముందే ఆ పొంగు చల్లారి, దేశంలో అసమానతలు, అవినీతి హర్మ్యాలు, స్వార్థపూరిత విధానాలు అన్నీ అవగతమైనప్పుడు కవి 'పాడలే నీవేళ పారవశ్యమ్ముతో' (గజ్జెల మల్లారెడ్డి) అనటం తప్ప ఏం చెయ్యగలడు? దేశభక్తి అనే మాట ఎంత డొల్లగా మారిందో అందరికన్న ముందు కవులకే బోధపడింది. అయితే అన్ని వైరుధ్యాల్ని అర్థం చేసుకొన్న తర్వాత కూడా 'శతసహస్ర నరనారీ హృదయనేత్రి' అయిన 'ప్రియభారత జనయిత్రి'ని (కృష్ణశాస్త్రి) ప్రేమించక తప్పదు. ఎన్ని లోపాలున్నా, కోపాలున్నా 'అనుమాన మేలరా అవమానమేల, భారతీయుడనంచు భక్తితో పాడ?' (రాయప్రోలు).

స్థూలంగా సాహిత్యంలో విషయాన్ని ఆత్మాశ్రయం **(subjective)**, వస్త్వాశ్రయం **(objective)** అనే రెండు పాయలుగా విడగొడతారు. ఆత్మాశ్రయం వ్యక్తికి సంబంధించింది; వస్త్వాశ్రయం బాహ్య సమాజానికి సంబంధించింది. దేశమంటే మట్టి కాదు, మనుషులే అన్న గురజాడ దగ్గరనుంచి సాహిత్యంలో సామాజికచైతన్యానికే పెద్దపీట వేశారు. వైయక్తిక అనుభూతులు తక్కువ. ఇందుకు వామపక్ష భావజాలం, రకరకాల సామాజిక ఉద్యమాల ప్రభావం ప్రధాన కారణాలు. ఈ ధోరణి తప్పని చెప్పటం నా ఉద్దేశం కాదు. అయితే అదే సమయంలో మనిషి బ్రతుకులో తడమాల్సిన, అందించాల్సిన, జొరబడాల్సిన అంశాలెన్నో ఉంటాయి. వ్యక్తిగత కామనలుంటాయి. సందిగ్ధతలుంటాయి. సుడిగుండాలుంటాయి. స్నేహగీతాలుంటాయి. వలపు పిలుపులుంటాయి. తాత్త్వికశోధనలుంటాయి. అన్నీ కలిసిందే జీవితం. కనుక ఈ అంశాలు వేటినీ నిర్లక్ష్యం చెయ్యనక్కర్లేదు అని చెప్పటమే నా ఉద్దేశం.

అందువల్లనే ఈ పొత్తంలో మూడు ప్రణయగీతాలు చోటు చేసుకొన్నాయి. అవి మూడూ వలపుగత్తెల కూరిమి పలుకులే కావటం యాదృచ్ఛికం. 'కలత నిదర' (నండూరి) సున్నితమైన విరహభావానికి అక్షరరూపం. ఈ రేయి మామతో కలవకపోతే ఎన్నెలల సొగసంతా ఏటిపాలేనని బాధపడుతుంది యెంకి. ఆ రేయి ఆమెది జాగారమే. 'గుత్తొంకాయ్ కూరోయ్ బావా!' పాట (బసవరాజు) మరదలి చిలిపితనపు చిన్నె. ఆ కూరలో తన వలపంతా కూరి పెట్టింది ఆ వెఱ్ఱిపిల్ల. ఇక 'మొక్కజొన్న తోటలో ముసిరిన చీకట్లలో మంచెకాడ కలుసుకొ'మ్మంటుంది బంగారిమామతో ప్రేయసి (కొనకళ్ల). ఇది జానపద ఫక్కిలో గ్రామీణ శృంగారం. ఇటువంటి పాటలు ఏ సంకలనానికైనా అలంకారాలే గదా! అట్లాగే స్నేహమాధుర్యం తెల్పుతూ 'సృష్టిలో తీయనిది స్నేహమేనోయ్' అని ఇంద్రగంటి నిరూపిస్తే, 'మిత్రుడే కావాలి సుఖమున, శోకాన / అతడు లేకున్నచో నగరమే కాన' అంటున్నాడు దాశరథి. 'కలలండీ కలలూ' అని కలల బేహారి (అమరేంద్ర) పిలుస్తున్నప్పుడు అక్కడ 'బాధలన్ని మరపించే మాధుర్యపు తళతళలు' కనుగొంటాం.

ఇప్పటిదాక మానవజాతి సృజించిన సాహిత్యం ప్రధానంగా మానవకేంద్ర సాహిత్యమే **(man-centered literature)**. మానవసంబంధాలు, వ్యక్తి అంతర్లోకాలు, సామాజిక సంఘర్షణలు, ఉద్యమాలు - ఇటువంటివే ముఖ్య రచనా వస్తువులయ్యాయి. మనుషులు మనుషుల గురించి, మనుషుల చుట్టు సమాజం గురించి కాక మరి దేని గురించి రాస్తారు అని అడగొచ్చు. నిజమే. అయితే మనిషి మానవేతర విషయంతో సంబంధం లేని ఏకశిలా సదృశుడు **(monolithic)** కాడు. ప్రకృతిలో ఒకడు. ప్రకృతి అతనికి చెందింది కాదు. ప్రకృతికి అతను చెందినవాడు. సమాజం మనిషిని నిరంతర ఘర్షణకి గురి చేస్తుంటే ప్రకృతి మనిషికి నిరంతర సామరస్యం కలిగిస్తుంది. ప్రకృతిని చూసి మనం ఆనందించటానికి కారణం అదే. మనిషి ప్రకృతిలో అఖండభాగంగా తనను గుర్తించినప్పుడు సాహిత్య పరిధి విస్తృతమవుతుంది. చెట్టు, గుట్ట, పుట్ట, పులుగు, పశువు - అన్నీ రచనా విషయాలవుతాయి. ప్రకృతికి చేరువ అయినప్పుడు మనిషి పొందే ఆహ్లాదమే ప్రాకృతిక భావాల వర్ణనలో కవి, పాఠకులు పొందగలుగుతారు. అప్పుడు చైతన్యం అనే కళా ప్రయోజనంతో పాటు ఆనందం అనే మరో ప్రయోజనం కూడా సహజంగా సిద్ధిస్తుంది. 'తేనె వెన్నెల, సోన వెన్నెల, మానవుని మంత్రించు వెన్నెల' (నార్ల వెంకటేశ్వరరావు) ఎంత హాయిగా ఉంటుంది! 'ఓ భ్రమరీ! నాదఝరీ!' (పుట్టపర్తి) అనే తుమ్మెదపాట వినసొంపుగా ఉండదా? 'గొంతు గొంతు కలిపి పాడుకోమన్న' (భుజంగరాయశర్మ) ఆమని కోయిలల వగరు కూత మురిపించదా? 'కదలిరా! కదలిరా! కదలి రాయని రాణి!' (కరుణశ్రీ) అనే గీతంలో 'కడుపు చల్లని తల్లి' కృష్ణవేణి గలగలలు వీనుల విందు చేస్తాయి. తల్లి గోదావరి అలలు ఆణిముత్యాలుగా, మేటలు ఇసుక పానుపులుగా కవికి

(జయరాజ్) కనపడతాయి. ఎండిపోయిన 'ఇంత మంచి పెన్నతల్లి' (విశ్వం) కూడా మనలో తడి కల్గిస్తుంది. మనుషులే కాదు, 'లేపాక్షి బసవయ్య' (అడివి) గంగడోలూపుతుంటే, 'నింగికిని మోరెత్తి, కాల్ దువ్వి తోకెత్తి, ఖంగుమని రంకేసే' 'ఒంగోలు గిత్త' (మండువ) ధీరగంభీరంగా కనిపిస్తుంది. ఒకటి కోవెలలో, మరొకటి పొలంలో. దాని మెడలో గంట, దీని మెడపై కాడి. రెండూ అవసరమే. కాగా 'కుంచెల కందని వన్నెల అరకులోయ చాన' (గంటేడ) కూడా ఇక్కడ కనువిందు చేస్తుంది.

ఇక్కడే భావుకత, కల్పనాత్మకతలను గూర్చి కూడా చెప్పుకోవాలి. గేయమంటే కవితారూపమే కదా? రకరకాల వాదాల్లో, ఉద్యమాల్లో ఆవేశంగా అల్లుకొనేటప్పుడు ఆ రచనల్లో కవిత్వం పాలు తగ్గటం కద్దు. దీనిని గేయకర్తలు తప్పక గమనించి పలచదనం లేకుండా జాగ్రత్తపడాలి. ఈ సంకలనంలో అద్భుతమైన భావుకత, చిక్కనైన కవిత్వీకరణ గల గేయాలెన్నో మనసును మైమరిపిస్తాయి. చూడండి. జాతీయవాద కవి దృష్టిలో రాట్నమే లక్ష్మి అయ్యింది. కోహినూరు వజ్రం హిందుమాత జడలో పువ్వులా కనపడింది. 'యెలుతురంతా మేసి యేరు నెమరేసింది / కలవరపు నా బ్రతుకు కలత నిదరయ్యింది' (నండూరి) అన్న తలపు ఎంత లలిత కవితాత్మక వ్యక్తీకరణ! లేపాక్షి బసవయ్య గంగడోలు 'పొంగేటి పాల్కడలి'లా కవికి కన్పించింది. 'వెన్నెల నిచ్చెనలు వేసే' వింత వింత కలలను 'కాలపు గాజులబత్తుని మలారంపు మిలమిలలు'గా (అమరేంద్ర) భావించటం అద్భుతమైన ఊహ. 'చీకటి పడినది తల్లీ! దీపం చూపవేలనే' (బైరాగి) అంటున్న తాత్వికత కూడా ఇక్కడి గేయాల్లో నిండారింది. 'అంగారగంగ' అనేదే అద్భుతమైన రూపకం. మొక్కజొన్న తోట వద్ద 'కంచెమీద గుమ్మడి పువు పొంచి పొంచి' చూస్తుంది. 'పంటబోది వరిమడితో పకపక'లాడుతుంది. 'గోరుకొయ్యల పొద్దు నా తెలంగాణా, గోరింకలా సభలు నా తెలంగాణా' (నందిని) అన్న వాక్యాలు తెలంగాణ స్థానికత సొగసుతో పాఠకుల ఊహకెంతో పదును పెడతాయి. కులవృత్తులు కూలిపోతున్న దశలో 'కుమ్మరి వాములో తుమ్మలు మొలవటం', 'కమ్మరి కొలిమిలో దుమ్ము లేవటం' (గోరటి) భావనాత్మక కవి దృష్టి మాత్రమే గుర్తించగలదు.

ఈ సంకలనంలో కన్పించే ముగ్గురు కవయిత్రులు చాలా అరుదైన వాళ్లు. కనుపర్తి వరలక్ష్మమ్మ స్వాతంత్ర్యోద్యమంలో చురుకుగా పాల్గొన్నది. కథారచయిత్రిగా పేరుగాంచింది. వల్లెటూరి బ్రతుకుల్ని వరావర్ణిస్తూ 'వల్లెటూరి భాగ్యశాలీ!...సొంత రాజ్యం వచ్చినా నీ సొదలు యేమీ అణగలేదూ' అంటూ ప్రగతిమార్గం చూపింది. ఇక వట్టికొండ విశాలాక్షి వామపక్షభావాలతో అభ్యుదయ రచయితల సంఘంలో క్రియాశీలక పాత్ర వహించింది. కథా నవలా గేయకారిణిగా విశేషకృషి చేసింది. 'వృత్తి విభజన చేసి ఊడిగము మన కిచ్చి / పురుషవర్గము వారు బులిపించి వేశారు / కన్నీరు గార్చకుము, కరిగినీరై పోకుమీ' అని 1940 దశాబ్దిలోనే గొప్ప స్త్రీ చైతన్యంతో రాయగలిగింది. ఇక వాణీ రంగారావు రామ జన్మభూమి సందర్భంలో మతోన్మాదాన్ని క్షుద్రశక్తిగా వర్ణించి శాంతిమార్గం చూపుతూ నిర్దిష్ట కవిత **(specific poem)** రచించింది.

వచన కవిత్వంలో ఛందస్సుకు సంబంధించిన ఏ నియమాలు లేకపోవటం వలన కచ్చితమైన చట్రం, బిగింపు ఉండవు, పనిగట్టుకొని కవులు అంతర్గతలయని పాటిస్తే తప్ప. పద్యకవిత్వంలో యతిప్రాసల వలన, గణనిర్దేశం వలన నిర్దిష్టమైన చట్రం ముందు గానే ఏర్పడి ఉంటుంది. ఛందోజ్ఞానం ఆ కవులకు తప్పనిసరి. అందువల్ల ప్రతి పద్యంలో ఒక ప్రత్యేకమైన ఊగు, తూగు ఉంటాయి. ఇక గేయరచనలో పద్యం కంటె కొంత వెసులుబాటు ఉంటుంది. గేయంలో ఉండేది మాత్రా ఛందస్సు. ఛందస్సులో అక్షరాలను గురువులుగా (ఎక్కువ సేపు పలికే అక్షరాలు), లఘువులుగా (తక్కువ సేపు పలికే అక్షరాలు) విభజిస్తారు. అవి పలకబడే కాలాన్ని బట్టి లఘువును ఒక మాత్రగా (రెప్పపాటు కాలం), గురువును రెండు మాత్రలుగా పరిగణిస్తారు. ఆ విధంగా నియమిత సంఖ్య గల గురులఘువులతో పాటలో మాత్రాగణాలు, వాటితో పాదాలు ఏర్పడతాయి. ఒక లయ ఏర్పడుతుంది. దానితో పాడుకోవటానికి అనువుగా ఉంటుంది. ఉదాహరణకు 'మేలు /కొనుమీ / భరత / పుత్రుడ' అనే గేయం 3+4+3+4 మాత్రాగణాలతో 'తకిట తకధిమి తకిట తకధిమి' అనే జతులతో మిశ్రగతిలో నడుస్తుంది. తొలి ముత్యాలసరం ఇదే. 'మనిషి / చేసిన / రాయి / రప్పకు' అనే గురజాడ కట్టిన ముత్యాల సరం నడక కూడా అదే. 'సుక్క / లన్ని / కొండ / మీద' పాటలో 3+3+3+3 మాత్రాగణాలతో

'తకిట తధిమి తకిట తఖిమి' జతులతో త్రిస్రగతి ఉంటుంది. 'కల్లా / కపటం / కానని / వాడా' అన్న పాట 4+4+4+4 మాత్రల గణాలతో 'తకధిమి తకధిమి తకధిమి తకధిమి' అనే జతులతో చతురస్ర గతిలో సాగుతుంది. 'మంచుకొం / డలపైన / పొంచింది / రా చైన' అన్న గేయంలో 5+5+5+5 మాత్రల చొప్పున ఉన్నాయి. ఇది 'తకతకిట తకతకిట తకతకిట తకతకిట' జతులతో ఖండగతిలో నడిచే గేయం. 'మాదీ స్వతంత్ర దేశం / మాదీ స్వతంత్ర జాతి' అన్నప్పుడు తొలిపాదంలో 12 మాత్రలు, మలి పాదంలో 11 మాత్రలే ఉన్నాయి. అయితే పాడేటప్పుడు దరువుకు అనుకూలంగా 'జాతీ' అని దీర్ఘం తీసి లయ సరిచేసుకుంటారు. చాలా గేయాల్లో పాటగాళ్లు గురువుల్ని తగ్గించి, లఘువుల్ని సాగదీసి పాటని లయానుకూలం చేసుకోవటం మామూలుగా జరిగేదే. గేయ రచనలో మాత్రాగణాల పోహళింపు బాగా తెలిసిన రాంభట్ల కృష్ణమూర్తి నుంచి వెలువడిన 'అంగార/గంగ/లాగ/తరం/గించుతూ/పద' పాట 5+3+3+3+5+2 మాత్రాగణాలతో విలక్షణమైన లయతో సాగుతుంది. కాగా 'జన్మభూమి', 'దత్త' మొదలైనవన్నీ ద్విపద పద్యం నడకలే. ఇట్లాగే తక్కిన పాటల్నీ పరిశీలించవచ్చు.

అయితే పాటలు రాసేవాళ్ళందరికీ, పాడే వాళ్ళందరికీ ఈ మాత్రా ఛందస్సుకు సంబంధించిన జ్ఞానం ఉండదు, ఉండాల్సిన పనీ లేదు. లయ జ్ఞానం ఉంటే చాలు. ఒక దరువుకు అనుగుణంగా పాట అదే సాగుతుంది. ఈ సంకలనంలోని కొన్ని పాటల్లో మాత్రం లయ సరిగ్గా కుదరలేదు.

పాటలు ప్రచారమయ్యే క్రమంలో – ముఖ్యంగా గేయకర్తే పాడేటప్పుడు – మార్పులు అవసరమనిపిస్తాయి. కనుకనే 'రైతు భజనావళి'లోని 'రైతు జూడకపోతే' కవిత తర్వాత 'పాలికేక' అయ్యింది. 'ఎన్నాళ్లు?' అనే పాట తొలి చరణంలోని 'నల్లగొండ' తర్వాత కాలంలో 'నవయుగం' గా మారింది. 'తెలుగోడా!' గేయంలో 'నాయకీ నాగమ్మ' కాలం గడిచి, 'కాకతీ రుద్రమ్మ' అయ్యింది. అవి ఆ కవులు చేసినవే. కాగా సుప్రసిద్ధమైన 'మా తెలుగు తల్లికి' గేయంలో సుందరాచారి 'అమరావతీ గుహల అపురూప శిల్పాలు' అన్నాడు. తొలుత ఆ పాట పాడిన టంగుటూరి సూర్యకుమారి రికార్డులోను 'గుహలు' అట్లాగే ఉన్నాయి. బహుశః అమరావతిలో గుహలు లేవని కవికి తెలియలేదు కనుక ఆ గేయపాదాన్ని ఆయనెప్పుడూ సవరించినట్టు లేదు. రాను రాను ఆ పాట పాడేవారో, పరిశీలకులో ఆ పాదాన్ని 'అమరావతీ నగర అపురూప శిల్పాలు' అని సరిదిద్దారు. సరిదిద్దామనుకున్నారు. ఎందుకంటే చరిత్రలో ధాన్యకటకం (ధరణికోట) తప్ప 'అమరావతీ నగరం' ఎక్కడుంది? ఇది ఒక తప్పును సవరించబోయి మరో తప్పు చెయ్యటమే. అదీ గాక మూలపాఠాన్ని సవరించే హక్కు కవికే ఉంటుంది గాని తదితరులకు ఉండదు. ఎవరికి తోచిన మార్పులు వాళ్లు చేసుకుంటూ పోతే అసలుకే ఎసరు అవుతుంది. తప్పు గానీ, ఒప్పు గానీ ఆ కవిదే బాధ్యత. కవి వాక్యం ఉన్నదున్నట్లు గ్రహించటమే మన పని.

సంకలనాల్లో సమగ్రత ఉండదనే అవగాహన ఉంది నాకు. ఎంత గొప్ప సంకలనంలోనైనా ఏవో లోటు పాట్లు తప్పనిసరి. ఈ పుస్తకంలోను కొన్ని లోపాలుండవచ్చు. సాధ్యమైనంత వరకు ఆధునిక సాహిత్యంలో ప్రధాన భావధారల్ని ప్రతిబింబించాలనే ఒక ప్రయత్నం ఇది. వీలైనంతవరకు రచనాకాలం, ప్రచురణకాలాన్ని బట్టి గేయాల వరస ఉంటుంది. అయితే ఆధునిక రచనలకే ప్రాధాన్యం ఇవ్వటం చేత జానపద గేయాల జోలికి పోలేదు. ముందు ముందు సహృదయ పాఠకులవలన తెలియబోయే లోపాలనును మలి ముద్రణలో తప్పక సరి చేయగలమని మనవి.

మిక్కిలి శ్రమతో కూడిన ఈ గేయసంకలనం పనిలో నాకు సహకరించిన వారిలో మిత్రుడు పెనుగొండ లక్ష్మీనారాయణ ముఖ్యుడు. ఇది తన పనిగా తలచి, ఎన్నో విలువైన పాటలు సేకరించి యిచ్చాడు. పాటల వివరాలు తెలుసుకోవటంలో వల్లూరు శివప్రసాద్ మిక్కిలి తోడ్పడ్డాడు. దీనికి తోడు అన్నమయ్య ఆధ్యాత్మిక గ్రంథాలయం. దాని ప్రధాన నిర్వాహకులు శ్రీ లంకా సూర్యనారాయణ మరియు సిబ్బంది. అందరికీ అనేక కృతజ్ఞతలు.

ఏ సంకలనంలోను మీకు కనపడని నందికొండ నాగార్జున సాగరం, అల్లూరి సీతారామరాజా!, జయం మనది జయం మనది జయం మనదిరా, ఒంగోలు గిత్త, చిన్నిపాప మొదలైన గేయాల్ని పరికిస్తే దీనిలోని వైవిధ్యం, అందుకై పడిన శ్రమ గమనించ గలరు.

**(అరసం గుంటూరు జిల్లా ప్రచురించిన 'ఈ తరం కోసం... గేయ కవిత' సంకలనం ముందుమాట నుండి)** ◆

## సాహిత్య ప్రస్థానం ఏప్రిల్ 2019 పురస్కారాలు

**వీరేశలింగం రచనలు - సమాజ అభ్యుదయం**
వ్యాసం: రూ.500/-
రచయిత : డా॥ వీపూరి వెంకటేశ్వర్లు

**మూడు మరణాలు**
కవితకు : రూ .500/-
రచయిత : యం. శబరీష్

**సృజనోత్సవం**
కవితకు : రూ .500/-
రచయిత : పసుమర్తి పద్మజవాణి

■■■

కథకు, కవితకు సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కారం, వ్యాసానికి కర్లపాలెం రుక్మిణమ్మ పురస్కారం చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

■■■

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు. తగిన రచనలు లేనప్పుడు పురస్కారాలు ప్రకటించబడవు.

**- ఎడిటర్**

కవిత

## ఒక ప్రాణం కథ

- సుంకర గోపాలయ్య
9492638547

అనుకుంటాం గానీ
మరణం పెద్ద ప్రమాదమేమి కాదు
ఎన్ని ఆకులు మరణించడం లేదు
అంత్యక్రియలు లేని పూలమాటేమిటి
సముద్రతీర స్మశానం లో
విరుగుతున్న అలల విషయమేంటి
పడమర కిటికీ నుండి దూకే
సాయంత్రాల సంగతి?
ఆరిపోవడానికి సిద్ధంగా ఉన్న
దీపం చివరిమాట విను
గాయపడి అల్లాడుతున్న
కుందేటి కూన కంట్లోకి చూడు
ఎండిన నది పాడుతున్న
పొడిగొంతు రాగం ఆలకించు
ఎంత గుంజు కున్నా
తుపాను గాలికి
గొడుగు ఆగదు
ఎడతెరిపి లేకుండా
లోన కురుస్తున్న వర్షం
తడుస్తున్న ఆత్మ
వికసిస్తూ పరిమళించే ప్రాణపుష్పం
రక్తంలో వెలిగే ఎర్రనికాంతి



చీకటి అలా పొంచి ఉంటుంది
అచ్చు నీడ లాగే

నువ్వెక్కిన పడవ
నీకు భయంలేని పగళ్లను
సంతోష ద్వీప శిబిరాలను
తెరచాప మీద జరిగే
బొమ్మలాటను చూపుతుంది

పడవ ఆగే రేవు వద్ద
ఎవరిమీదకో నెపాన్ని తోస్తావ్
ఆక్సిజన్ అందదు
కర్త కర్మ క్రియ
నువ్వే అని గ్రహించవ్. ◆

# చారిత్రక నవల కొల్లాయి గట్టితేనేమి?

- గనారా
9949228298




1920 - 1922 మధ్య నడచిన కథకాలం 1964 నాటికి 'కొల్లాయిగట్టితేనేమి?గా రూపు దిద్దుకుంది. నవలలో 1935-45 కాలంనాటి వాస్తవికతను రచయిత కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు. రాజకీయ, ఆర్థిక, సామాజిక వాస్తవిక స్థితిగతులు మనముందు ఉంచి, ఈనాటి పాఠకుణ్ణి 80 సంవత్సరాలు వెనక్కి తీసుకుపోయారు. జీవితాన్ని అనుభవించి జీవించినట్లు చిత్రించాడు మహీధర రామమోహనరావు

1919 నాటికి వీరేశలింగం తెరపై నుండి తొలగిపోయాడు. కాని ఆయన నడిపిన ఉద్యమంలో తీవ్రత, సంస్కరణలో పట్టుదల, ఆచరణలో వెనకడుగు వేయకపోవడం, ఆనాటి యువకుల్లో జీర్ణించుకుపోయాయి. మెల్లమెల్లగా యువకులు సనాతన సాంప్రదాయాలకు రాజీపడక అన్నిరంగాలలో భౌతిక జీవితాన్ని ఆహ్వానిస్తున్న కాలం.

మరోపక్క గోదావరి ఆనకట్ట, కృష్ణా ఆనకట్ట పూర్తియి వ్యవసాయం అభివృద్ధి చెంది వ్యాపార మార్గాలు ఏర్పడ్డాయి. జలరవాణా, రైలుమార్గం ఏర్పడ్డాయి. దీనితో అనేక పెద్ద గ్రామాలు, పట్టణాలు రూపం తీసుకొని, గ్రామాల నుంచి చదువుల నిమిత్తం వెళ్ళడం, గ్రామాలు స్వయంసమృద్ధి కానిచోట నుండి వలసలు పోవడం ప్రారంభం అయింది. కాకినాడ, రాజమండ్రి, భీమవరం, బెజవాడలాంటి పట్టణాలలో కళాశాలల అభివృద్ధి జరిగింది. సంపన్న రైతు, మధ్యతరగతి యువకుల కేంద్రీకరణ జరిగింది. అభ్యుదయాల భావాల గాలి తీవ్రంగా వీస్తుంది. పత్రికలలో అభ్యుదయ భావాల వార్తలు విరివిగా వస్తున్నాయి. అందరికి బెంగాల్ ఆదర్శప్రాయమైంది. ఒక ఆదర్శ పురుషుడు రాజారామమోహన్‌రాయ్, ఒక్కమాటలో చెప్పాలంటే మడి కట్టుకొని జీవించే కాలం చరమాంకానికి చేరింది.

భారతదేశం అనే ఒక భౌతిక రూప భావన ఈనాడు ఏర్పడినట్లు బ్రిటీష్‌వారు రాకముందు లేదు. వలసవాదులు తమ దోపిడి అవసరాల కోసం ఏకం చేసారు. బూర్జువా మేధావి వర్గం స్వాతంత్ర ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోయారు. వారికి నమ్మకమైన నాయకుడు గాంధీ కావడంతో ఆయన వెనకనే స్వాతంత్ర్య ఉద్యమం నడిచింది. ప్రజలు ఆయన ఇచ్చిన ప్రతీ పిలుపుకు స్పందించారు. అలాగే యువకులు స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొని గాంధీ ఆశయాలు ముందుకు తీసుకుపోయేందుకు నాయకత్వం వహించారు. అందులో అతివాదులు, మితవాదులు ఉన్నారు. టెర్రరిస్టులు ఉన్నారు.

తూర్పుగోదావరి జిల్లాలోని ముంగండ అనే గ్రామం కేంద్రంగా నవల ప్రారంభం అవుతుంది. ఒకనాటి సనాతన ధర్మాలకు, ఆచారాలకు, కులం కట్టుబాట్లకు ఆలవాలంగా ఉండేది. తేలిక భాషలో చెప్పాలంటే ఫ్యూడల్ సమాజం అంటే అర్థం అవుతుంది. వీటన్నిటిని కాదని చదువు, సంస్కారం, కట్టుబాట్లు లేని స్వేచ్ఛ, మత నియమాలు లేకపోవడం, వీటితో నిండిన సమాజాన్ని 'బూర్జువా సమాజం' అంటాము. ఈ రెండింటికి మధ్య సంఘర్షణలోంచి పుట్టుకు వచ్చిన యువకులు పాత వాసనలు విడవకపోయినా, ఆధునిక

సమాజంవైపు ప్రయాణం మొదలుపెట్టారు అంటే యుగసంధి. వీళ్ళ ప్రతినిధి 'రామనాథం'. ఈ నవలలో కథానాయకుడు.

విద్యార్థి దశలో చాలామంది ఆదర్శంగా నిలబడాలని కలల కంటారు. కాని, కొందరు మాత్రమే సాహసంతో ముందుకుపోయి ఆచరణలో విజయం సాధిస్తారు. అలాగే రామనాథం స్నేహితులు వెనక్కు లాగినప్పటికి 'దువ్వూరి సుబ్బమ్మ' విదేశీ వస్త్రదహనం యజ్ఞంలో రామనాథం కూడా పక్కబట్టలతో సహా అన్ని అగ్నికి ఆహుతి చేసి, ఖద్దరు ధరిస్తాడు.

వేళాకోలం చేసిన స్నేహితుడితో 'భిన్న కులాల మధ్య బంధుత్వాలుండవా?' అనే ప్రశ్న వేసిన రామనాథంలో ఆదర్శబలం స్థిరత్వం కనిపిస్తాయి. సత్యాగ్రహ ప్రతిజ్ఞ తీసుకున్నప్పుడు తోడు ఉన్న స్నేహితులు జారిపోతారు.

స్వగ్రామం ప్రయాణం పడవలో సాగుతుంది. రహదారి లేని గ్రామాలకు పడవలు, వంటెద్దు బళ్ళున్నాయి. గుర్రపు బళ్ళల్లో కాస్త ఉన్నవారు ప్రయాణిస్తారు. రామనాథం పడవలో బయలుదేరతాడు. అక్కడ నాయళ్ళ కుటుంబంతో పరిచయం ఏర్పడుతుంది. తల్లి మాణిక్యం, కూతురు స్వరాజ్యం. స్వరాజ్యం ఇంగ్లీషు చదువు కూడా చదివింది. రామనాథం 'తల్లిదండ్రులు అదృష్టవంతులు కాబట్టి ఇలాంటి కొడుకు పుట్టాడని' సంతోషిస్తుంది. ఐ.ఎ.యస్. కలక్టరు అవ్వాలని ఆశ లేదని, సర్కారుపై వ్యతిరేక భావాలు వ్యక్తపరుస్తాడు. ఈ కాస్త పరిచయంతో రామనాథం పుట్టు పూర్వోత్తరాలు తెలుస్తాయి. ఈ ప్రయాణంలో రామనాథం కాలుకు గాయం అయితే కట్టుకట్టిన స్వరాజ్యంతో స్నేహం గట్టిపడుతుంది.

శంకరశాస్త్రి పెంపుడుతండ్రి, భార్య రాజమ్మ, కొడుకు ఊళ్ళోకి ప్రవేశించిన వార్త వారి చెవిన పడింది. రామనాథం చదువుకుని గాంధీ ఉద్యమంలో చేరిన వార్త అతనికి తెలిసింది. జీర్ణించుకోలేకపోతాడు తండ్రి. అయినా మెతకతనం ప్రదర్శిస్తాడు. రామనాథం పైచదువులు చదువుతాడని ప్రభుత్వ ఉద్యోగి, సర్కిల్ ఇనస్పెక్టర్ పిల్లను ఇచ్చాడు. రామనాథానికి ఉన్న నాలుగు ఎకరాల పొలం శంకరశాస్త్రే చూస్తుంటాడు. ఇంగ్లీషువాళ్ళు రాకముందు ఈ ప్రజలు వారి బ్రతుకంతా వ్యసాయంపై జీవించారు. కాని ఇప్పుడు దేశాన్ని ఉద్ధరించడానికి ఈ కొత్త చదువు నెత్తిన రుద్దారనేది ఆయన వాదన.

శంకరశాస్త్రి కోడలు కాపురానికి వస్తే కొడుకు దారికి వస్తాడని ఆశించి వియ్యంకుడి దగ్గరకు వెళ్ళితాడు. రామనాథం వైఖరిని తెలిసిపోవడంతో అత్తవారి ఇంట అవమానంతో తిరిగి వస్తాడు.

ఆడపిల్లకు పదహారేళ్ళ మగవాడికి ఇరవయేళ్ళ ఉండి ఉండాలన్న సంస్కరణవాదన, మానసిక, శారీరక ఆరోగ్య సూత్రాలు బలంగా కాలేజీలో ఏర్పడ్డాయి. అందుకే భార్యని కాపరానికి తీసుకురావడం ఇష్టంలేదు. మామగారు పోలీసు ఉద్యోగి కావడంతో రామనాథంపై కక్ష పెంచుకుంటాడు. కూతురు భవిష్యత్ కూడా ఆలోచన లేకుండా భార్య మాట కూడా వినకుండా సంబంధం తెగిపోయేలా ప్రవర్తిస్తాడు.

మనకు మధ్యలో కొన్నిపాత్రలు కనిపిస్తాయి. ముఖ్యంగా చంద్రశేఖరు రామనాథం భార్యకి అన్నగారు పి.ఆర్. కాలేజీలో లెక్చరర్ ఆదర్శ భావాలుతో కుటుంబానికి దూరంగా కాకినాడకు దగ్గర గ్రామం సర్పవరంలో ఉంటారు. అనాథ శరణాలయంలో కులం గోత్రం తెలియని అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాడు. ఇది అంతా వీరేశలింగం ప్రభావం. ముంగండలాంటి ఛాందస గ్రామంలో కూడా వ్యాపించింది.

రామనాథం అనాలోచితంగా దువ్వూరి సుబ్బమ్మ ఇచ్చిన నూలుబట్టలు ప్రచారం చేస్తూ అమ్ముతూ రంగనాథం మాష్టార్ని కలుస్తాడు. తన చుట్టూ ఉన్న ప్రపంచం చాలా కొత్తగా కనిపిస్తుంది. అనేక విషయాలు తెలుస్తున్నాయి. గ్రామాల్లో కులం, అహంకారం, సాంఘిక దురాచారాలు ఎంత బలంగా ఉన్నాయో అర్థం అవుతుంది. గ్రంథాలయాలు లేకపోవడం, పరపతి సౌకర్యం లేక వడ్డీ వ్యాపారుల చేతిలో ఎన్ని కుటుంబాలు నాశనం అవుతున్నాయో గ్రహింపు వచ్చిన తరువాత, దేశానికి ఖద్దరు నెయ్యడం, సేవ ఒక్కటే కాదని గ్రహిస్తాడు.

"మీ గాంధీ దేశాన్ని కృతయుగం వైపు తిప్పాలనుకుంటున్నాడు. ఖద్దరు ఓ సింబల్ కావొచ్చు కాని దేశాన్ని పురోగతిలోకి తీసుకుపోయే మార్గం ఇదికాదు" అంటాడు. సాంఘిక ధర్మాలు సంసార లక్షణాలు, ధర్మాలు మారాలంటాడు. ప్రాక్పశ్చిమ దేశాల ఆధ్యాత్మిక భౌతికధర్మాల సమ్మేళనం నేటి 'రష్యా' అని రంగనాథం అభిప్రాయం వెళ్ళబుచ్చి, రష్యా యంత్రాలు, బ్యాంకులు, భూములు అన్ని జనం పరం చేసి, అపారధనం సంపాదించినవారిని సామాన్య కష్టజీవులవలె శ్రమించమన్నారు. యూరపులో యంత్రాల మీద ఉత్పత్తి సాగుతుందని తెలియజేస్తాడు. ఫలితంగా

పెట్టుబడుదారులు ఒకవైపు కార్మికులు మరోవైపు నిలబడి రాజ్యాంగాధికారాన్ని గూర్చి పోరాటం చేసారు. ఫ్రెంచి విప్లవం అపజయం పొందినప్పటికి, ఫ్రాన్సులో దేశానికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లభించకపోయినా ఐరోపా ఖండంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కొద్దోగొప్పో లభించాయి. రంగనాధం ఉద్బోధతో రామనాధం మనస్సు విశాలమవడానికి అతని ఆలోచన పద్ధతి విస్తృతం అవడానికి అవకాశం వచ్చింది. భారతదేశంలో బూర్జువా భావజాలానికి తన బావమరిది, చంద్రశేఖరం మాస్టారు రంగనాధం ప్రతినిధులు.

రామనాధం భార్యను కలవాలని అమలాపురం మావగారి ఇంటికి వెళ్ళేవాడు. 'బావమరిదిలాగా భార్యను పేరుపెట్టి పిలవాలని తను ఊళ్ళోవాళ్ళలాగా ఏమే, ఇదిగో, ఇలాచూడు' లాంటివి ఆమె పేరుకు పర్యాయపదాలు కావని తలచి తీరా అవకాశం వచ్చేసరికి రక్తమాంసాలు జీర్ణించుకుపోయిన ఆచారబలం అలవాటు నాలికను పట్టేసింది.

ఎలా మాట్లాడాలి, ఎలా ప్రవర్తించాలి అని, పడవలో బయలుదేరే ముందు కాగితంపైన రాసుకున్నాడు. ఎన్నో ఊహించుకున్నాడు. కాని ఇంటి వద్ద ఎవ్వరూ లేకపోవడంతో భార్యనే ఎదురొచ్చింది. కాగితంపై రాసింది, కొత్త చీర ఆమెకు ఇస్తాడు. చదివావా అని అడిగితే సమాధానం చెప్పి టిఫిన్ ఇచ్చింది.

సబ్ ఇనస్పెక్టరైన మావగారు నారాయణమూర్తి సుందరితో చనువుగా ఉన్న పురుషుణ్ణి చూసి విచక్షణ కోల్పోయి చేతిలో ఉన్న హంటరుతో వీపుపై కొడతాడు. ఎవరో తుంటరి కూతుర్ని అల్లరి చేస్తున్నాడనే తప్ప అల్లుడు అనుకోలేదు. తీవ్రంగా కొట్టి బయట ఉన్న పోలీసులకు అప్పగించాడు. బయట ప్రజలు ఖద్దరు ధరించాడు కాబట్టి అరెస్టు చేసారని కొందరు అనుకున్నారు. రంగనాధానికి విషయం తెలిసేసరికి అతని రాజభక్తి నిజాయితీకి మెప్పు వచ్చింది. కుటుంబ సంబంధాలు లెక్కలోకి రాలేదు.

ఆ రకంగా జైలు పాలై చిప్పకూడు తినడంలో అతని బ్రాహ్మణీకం దెబ్బ తింది. విడుదల అయినప్పటికి ప్రాయచిత్తం నిరాకరించడంతో 'వెలి' వేయబడ్డాడు. పొలంలో మకాం పెట్టి హరిజనలకు అంటరానివాళ్ళకు చెరువులో నీళ్ళు తీసి ఇవ్వడం తన బావిని వారికి ఇచ్చి మాలపల్లె నీటి సమస్య పరిష్కరించాడు. దీని ద్వారా కులమతబేధాలు దేశ స్వాతంత్ర్యానికి ఆటంకంగా ఉన్నాయని తలుస్తాడు. దీన్ని ప్రచారం చేయాలంటే కాశీనాధుని నాగేశ్వరరావునో, ఉన్నవ లక్ష్మీనారాయణనో పిలవాలని పెద్దఎత్తున బహిరంగ సభ ఏర్పాటు చేయాలని తలుస్తాడు.

'అస్పృశ్యత హిందూమతానికి మాయనిమచ్చ. ఒక మహానేరం'. అంటుండే గాంధీగారి వ్యాసాలు, ఉపన్యాసాలు ఉన్న పత్రికలు గ్రామంలో వచ్చేలా చేసి, వాటిని చదివి వినిపించే ఏర్పాటు చేస్తాడు. శంకరశాస్త్రి రామానందం తోటలో వేదపఠనం స్కూలు ఏర్పాటు ప్రతిపాదనలోని రాజకీయం అర్థంకాక తన తోట శాంతినికేతన్ అవుతుందని ఆశించాడు. మిత్రుడు శివకామయ్య ఆ చాణిక్యనీతి వివరిస్తే దాన్ని విరమిస్తాడు.

అత్తవారి కుటుంబంతో తెగతెంపులు చేసికొని సుందరి జీవితం కష్టాల్లో పడకూడదని తనకు ఉన్న ఆస్తిలో కొంతభాగం వ్రాసి ఇచ్చేస్తాడు. ఈ దశలో స్వరాజ్యంతో సాన్నిహిత్యం పెరుగుతుంది. ప్రేమగా మారుతుంది. నాయుడు బ్రహ్మసమాజికుడైనప్పటికి కూతురు ప్రతిపాదన మొదట తిరస్కరించాడు. అప్పటికే స్వరాజ్యంని భర్త విడిచాడు. రామనాధం చూస్తే భార్యని విడిచాడు. ఈ వివాహాన్ని సంఘం అంగీకరిస్తుందా! సంఘం ఆమోదంపై ఎలా అన్నదే ప్రశ్న.

'ఈ వివాహాన్ని సంఘం ఒప్పుకోదు, చట్టం ఒప్పుకోదు. ప్రాచీన సంప్రదాయ పద్ధతి వారి వివాహబంధాన్ని మార్చలేదు. ఆధునిక సంప్రదాయం అంటూ ఏర్పడలేదు.' అయినప్పటికి నాయుడు ఆశీర్వదించాడు. రామనాధం ఆధునిక భావజాలానికి ఆమోదముద్ర పడింది.

రామనాధం, సుందరి మరికొంతమంది బెజవాడలో గాంధి మీటింగుకు వాలంటీరుగా వెళ్ళి అక్కడ మామగారైన పోలీసు ఆఫీసరు స్వరాజ్యాన్ని అవమానిస్తే, ఎదుర్కొన్నాడు. తిరుగు ప్రయాణంలో ముంగండకు పోతూ రాజమండ్రిలో ఆగి రంగనాధం మాస్టార్ని కలుస్తాడు. 'మేము వివాహపు తంతుకి ప్రాముఖ్యం ఇవ్వం అనుకున్నాం. మా మనస్సులు కలిసాయి. మేము క్షణంలో పెళ్ళి అయినట్లే భావించుకున్నాం.'

"పెళ్ళి అనేది ఒక భావన. అది మన మనస్సులలో కొన్ని అనుబంధాలను కల్పించి వుంచింది. ఈనాడు పెళ్ళి చేసెయ్యగలం కాని అనుబంధాలను కూడా తీసివేయగలిగినప్పుడే."

"అంటే"

"ఆ అనుబంధాలు బ్రహ్మరూపం. తప్పు చేస్తున్నామని,

# వక్రరేఖ

- శ్రీదేవి సురేష్ కుసుమంచి
7032760484

తెగిన గాలిపటాన్ని పట్టుకుని
కష్టాల కడలి
నీకే సొంతమన్నట్టు
ఆ నయనాలకు
ఎంతకని కన్నీటితో
అభిషేకం చేస్తావు..

నింగిని అలరించే
జీవిత గాలిపటాలకి
అతుకులు లేవనుకున్నావా..
ఎదురైన సమస్యను ఆలింగనం
చేసుకుని
వెలుగు రేఖలే నిను
స్పర్శించలేనట్టు
నిశీధిలోనే జీవిస్తూ
కాలాన్నంతా చేతకాని చిల్లుల
చట్రముతో వడపోసేస్తున్నావు..

నువ్వనుకున్నట్టు ప్రపంచమేమి
ఆవగింజ కాదు..



నువ్వు గీసుకున్న పరిధిలోనే
చీకటి పరుచుకుని
ప్రపంచమంతా వెలుగుతో
కాంతిలీనుతుంది అనుకోవడం భ్రమ..

కష్ట సుఖాలు కావడి కుండల
వంటివి..
చరితలు తిప్పి చూడు..
లేదా నువ్వనుకున్న
కాంతి పుంజాలను చేరువుగా
వీక్షించిచూడు...
వాటికి కూడ గ్రహణపు ఛాయలు
పట్టిన జాడలు అగుపడుతుంటాయి..

ఎవరి కష్టాలు వారివి
చెప్పుకుంటే...వక్రరేఖ..
లేదంటే మలుపులను కూడ
అందంగా మలుచుకునే
ధైర్యరేఖ.. ◆

---

తప్పు చేసానన్న సంకోచాలు, సంతోషాలను మేము ప్రపంచాన్నే ధిక్కరించి, నిలబడతాము మాస్టారు! మేము చేస్తుంది తప్పు కాదు. మాకు ఏర్పడిన పరిస్థితులలో ఆ పెళ్ళిళ్ళ నుంచి విముక్తి కావాలి. అది దొరకదు. మా వివాహాన్ని గుర్తించని సమాజాన్ని మేమూ గుర్తించము." అంటాడు.

రామనాథం కాలేజీ చదువుతో ఏర్పడిన ఆధునిక భావాలకు, తాను పుట్టి పెరిగిన పూర్వపు సాంప్రదాయాలకు, ఆచరణలకు, మధ్య నలిగినవాడు. అప్పుడే గాంధీ స్వతంత్ర్య ఉద్యమం మరింత ముందుకు పోవడం గమనించాడు. ప్రభావితుడైనాడు. సంఘర్షణకు గురయ్యాడు. అక్కడ కాశీనాథ నాగేశ్వరరావు పంతులు, అయ్యదేవర కాళేశ్వరరావు ప్రస్తావన ఉంటుంది. భూస్వామిక వర్గం అప్పుడప్పుడే రాజకీయాల్లోకి ప్రవేశించిన అంశం చాలా స్పష్టంగా చూపించాడు రచయిత.

'ఒక యుగసంధితో భిన్న చారిత్రక ధర్మాల మధ్య జరిగే చారిత్ర సంఘర్షణను వ్యక్తుల వ్యక్తిత్వాలలో జరిగే అంతస్సంఘర్షణగా చిత్రించ ప్రయత్నించాను. చాలా చాలా అరుదైన ఈ కళాభిజ్ఞతను సమకూర్చినది మార్క్సు వివరించిన చారిత్రక భౌతికవాద విజ్ఞానమే' అంటాడు రచయిత.

1960లో ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ పత్రిక అయిన 'విశాలాంధ్ర'లో సబ్ ఎడిటర్‌గా పనిచేశాడు మహీధర రామమోహనరావు. మార్క్సిజాన్ని అధ్యయనం చేసినవాడు. జీవితం పరిపూర్ణంగా చూసినవాడు కాబట్టే ఈ చారిత్రక నవల వ్రాయగలిగాడు.

ఈనాడు విశ్వాసాలు, పురాణ కాలక్షేపాలు, మూఢ విశ్వాసాలు గతం కన్నా ఎక్కువగా ఉన్నాయి. వాటికి తోడు 'మీడియా' కూడా తన సంపూర్ణ సహకారాలు అందిస్తుంది. గతంలో ఏవైతే విసర్జించాము అనుకుంటున్నామో అవే కులసంఘాలు, మత సంఘాలు, అస్తిత్వ ఉద్యమాలను గమనించినప్పుడు ఈ నవల ప్రాధాన్యత పెరుగుతుంది. ఇంతకాలం నేను గమనించకుండా ఉన్న ఈ నవలకు సమీక్ష వ్రాయమని ప్రోత్సహించి అద్దేపల్లి ప్రభాకర్‌కు కృతజ్ఞతలు. ◆

# తెరవని తాళం



- డా.ఎం.హరికిషన్
9441032212

రాజ్‌విహార్ సెంటర్‌కు కుడిపక్కన వున్న ఫుట్‌పాత్ మీద ఒక మూలన చింతచెట్టుకింద ఫక్కీరప్ప కూచోనున్నాడు. వదులైన మాసిపోయిన తెల్లని జిబ్బా పైజామా, నెత్తిన తెల్లని టోపీ, బక్క చిక్కిన శరీరం, వయసు మీదపడడంతో నెరసిన జుట్టు, ముడతలు పడిన మొగంతో దిగాలుగా వున్నాడు. అతని కండ్లు ఆశగా వచ్చీపోయేటోళ్ళను పట్టి పట్టి సూస్తున్నాయి.

"ఇచ్చట తాళాలు రిపేరి చేయబడును" ఫకీరప్ప వెనుక గోడమీద రంగువెలసిన అక్షరాలు కనబడుతున్నాయి. ఎదురుగా పరిచిన చిరిగిన ప్లాస్టిక్ చాపమీద వరుసగా రకరకాల తాళాలు కొత్తవి, పాతవి ఇనుప తీగలకు గుత్తులు గుత్తులుగా తగిలించి వున్నాయి. పక్కన పాత సిలుముపట్టిన ఇనుప పెట్టె వుంది. అందులో మూడు నాలుగు రకరకాల సైజుల్లో వున్న సుత్తులు, ఒక పొడవైన ఇనుపస్కేలు. తాళం చెవులను అరగదీసి సానబెట్టె ఆకురాయి, స్క్రూడ్రైవర్లు, స్పానర్లు వున్నాయి. ఆ పాత సామానుల నడుమ అతను ఒక పాత సిలుం పట్టిన పెద్ద తాళం కప్పులా కనిపిస్తున్నాడు.

ఫకీరప్ప గోడకు ఆనుకొని కూర్చున్నాడు. కండ్లు నిరాశగా లోపలికి పోయి వున్నాయి. పైన వున్న చింతచెట్టు కొంచం నీడ నిస్తావుంది. పైటాలవుతా వుంది. పొద్దున్నుంచీ ఒక్కటి గూడా మంచి బేరం తగల్లేదు. ఒక బగ్గిమోటరోడు తాళం చెవులకోసం వచ్చి బేరమాడి యాభై రూపాయలు చేతిలో పెట్టి పోయినాడు. చాయ్‌కీ, బన్నులకీ ఇరవై పోగా చేతిలో ముప్పయి మిగిలింది.

ఎల్లుండే పీర్లపండగ. వూరికి పోవాల. వూరికాడ కొడుకూ, కోడలూ, కూతురు, అల్లుడు వుంటారు. మనవండ్లనీ, మనవరాండ్లనీ సూడక శానాళ్ళయ్యింది. సన్నపిల్లల మొగాలు ముద్దు ముద్దు మాటలు మాటి మాటికి కండ్ల ముందు మెదలుతున్నాయి.

"మీరు ముసిలోళ్ళయినారు. పనులు సాతగావడం లేదు. ఇంగ ఆ కర్నూల్లో ఏముంటారుగానీ వచ్చి ఈన్నే వుండండి" అంటాడు కొడుకు అప్పుడప్పుడు. కానీ కొడుకూ కోడలూ ఇద్దరూ దినాము పనికి పోతే గానీ వాళ్ళ కడుపు నిండదు. అట్లాంటిది అదనంగా ఇద్దరు మనుషుల్ని కూసోబెట్టి సాకడమంటే మాటలు గాదు. అందుకే వాళ్ళమీద బరువు మోపడం ఇష్టంలేక.... శాతనైన కాడికి ఇక్కన్నే తెలిసిన విద్యతో ఇగ్గుదాం. ఆపై అల్లా దయ అనుకుంటాడు ఫకీరప్ప.

కూతుర్ని గూడా సొంతూరిలోనే బంధువులకిచ్చినాడు. అల్లుడు బంగారం. రంజాన్‌కి కనీసం బట్టలు పెట్టమని గూడా

అడిగి ఎరగడు. పెద్ద పండక్కు రమ్మని పిలిస్తే "ఎందుకులే మామా అనవసరంగా నీకు ఆగసాట్లు. ఎట్లాగూ ప్రతి ఏడూ పీర్లపండక్కి మీరే వూరికి వస్తారు గదా. అప్పుడు వచ్చి ఓ నాలుగు నాళ్ళు మాయింట్లో వుండిపోండి" అంటూ దాటేస్తాడు. దినాం పొద్దున్నే నంద్యాలలో గౌండా పనికి పోయొస్తుంటాడు. కొత్త ఇండ్లు దినానికొకటి మొలుస్తా వుండడంతో పనికేం లోటు లేదు.

కొడుకు, కూతురూ, మనవండ్లు, మనవరాండ్లు గుర్తుకు రాగానే ఫకీరప్ప మొగంపై చిరునవ్వు మెరిసింది. పెద్దోళ్ళకు ఏమీ తీసుకోని పోకపోయినా పర్వాలేదు గానీ సన్న పిల్లలకు ఏదో ఒగటి తీసుకొనిపోవాల. దాదీ, దాదా అంటూ పోగానే చుట్టుకోని పిల్లలు ఆశగా, ఆత్రంగా సంచీలవంక చూస్తారు. అందుకే వున్న డబ్బంతా ఖర్చుపెట్టి చేతిలో ఛార్జీలకు గూడా మిగుల్చుకోకుండా అన్నీ కొనేశాడు. రెండు మూడు మంచి బేరాలు దొరుకుతే సాలు రాత్రికంతా వూరికి చేరుకోవచ్చు.

ఫకీరప్పది నంద్యాలను ఆనుకుని వున్న నూనెపల్లెనే. తాతముత్తాతలనుంచీ దూది ఏకి పరుపులు, దిండ్లు కుట్టేటోళ్ళు. వాళ్ళ నాయన సిద్ధప్పతో కలిసి సైకిలేసుకోని, దానికి కమాను కట్టుకోని నంద్యాల వీధుల్లో "కొత్త పరుపులు కుడతాం, పాత పరుపులు బాగుచేస్తాం" అంటూ అరుస్తా తిరిగేటోళ్ళు. దిండ్లు పరుపుల్లో దూది గట్టిపడి వుంటలు గట్టి, ఎగుడుదిగుడుగా తయారైన వాళ్ళు పిలచేటోళ్ళు. వాళ్ళ ఇంటిముందే పరుపు విప్పి, కమానుతో దూదిని మరలా ఏకి, నాలుగు వైపులా సమానంగా సర్ది, దూదిని అటూ యిటూ కదలకుండా జాగ్రత్తగా కుట్టేటోళ్ళు.

కానీ ఆ దూది ఏకేటప్పుడు పైకి ఎగిసే దుమ్ముతో ప్రాణం వుక్కిరి బిక్కిరి అయ్యేది. సిద్ధప్పుకు ఆ దుమ్ము వూపిరి తిత్తుల్లోకి చేరీ చేరీ ఉబ్బసం పెరిగింది. ఒక పక్క ఆగని దగ్గు. మరొక పక్క పని చేయకుంటే పూట గడవని స్థితి. అట్లా దగ్గుతూ దగ్గుతూనే రక్తం పడి. మంచం పట్టి యాభై ఏండ్లకే కండ్లు మూసినాడు.

దాంతో ఫకీరప్ప పెండ్లాం మస్తానమ్మ భయపడి "ఇంగ ఆ పని మానెయ్యి. ఈన్నే కూలోనాలో సేసుకోని బదుకుదాం" అంటూ పట్టినపట్టు వదల్లేదు. మిల్లుల నుంచి వస్తున్న మెత్తని స్పాంజి పరుపులకు అలవాటు పడుతున్న జనం నెమ్మదిగా దూది పరుపులకు దూరం అవుతున్నారు. ఇంతకు ముందులా పనికూడా దొరకడం లేదు. ఫకీరప్పకి వూర్లో రెండెకరాల బైలు పొలం వుంది. వానొస్తే పంట లేదంటే లేదు. దాంతో పెండ్లాంతో కలసి ఒకపక్క పొలం చూసుకుంటా మరొక పక్క కూలీకి పోవడం మొదలు పెట్టినాడు.

ఒకసారి వాళ్ళ వూరికి కర్నూలు నుంచి దూరపు బంధువు ఒక పెండ్లికి వచ్చినాడు. ఆయన మాటల్లో ఫకీరప్పతో 'రేయ్... నాయెంబడి కర్నూలుకి రారా... నగరం రోజురోజుకీ పెరిగిపోతా వుంది. బండ్లు, కార్లు, ఇండ్లు, అంగళ్ళు ఎక్కువయిపోతా వున్నాయి. కానీ అక్కడ తాళాలు రిపేరీ చేసే అంగళ్ళు గడియారం ఆస్పత్రి దగ్గర నాలుగైదు తప్ప ఇంకెక్కడా లేవు. చేతినిండా పని. నువ్వు వస్తానంటే చెప్పు నేను నేర్పుతా. మా ఇంట్లోనే చిన్న గదుంది. సొంతంగా అంగడి పెట్టుకునే వరకు అందులో వుందువుగానీ. అట్లాగే నీ పెండ్లాం గూడా బైట యాడపడితే ఆడ కూలీకి పోకుండా ఇంటిపట్టునే వుండి మా ఇంటోళ్ళతో కలిసి బీడీలు సుట్టడం నేర్చుకుంటాది. ఏం చెప్పు... వస్తావా" అన్నాడు.

ఫకీరప్ప ధైర్యం చేసి కర్నూల్లో అడుగుపెట్టినాడు. రెండేండ్లలోనే పనంతా నేర్చుకొని సీక్యాంప్ సెంటర్లో బంకు పెట్టుకున్నాడు. బాగానే జరిగేది. ఫకీరప్ప పండగలప్పుడు నమాజు చేయడానికి మసీదుకు పోతుంటాడు కానీ ఆడ సెప్పేది ఒక్క ముక్కా అర్థమయ్యేది కాదు. ముందు వాళ్ళను చూస్తూ వాళ్ళు ఏమి చేస్తే అది చెయ్యడమే. దాంతో తన కొడుక్కన్నా పెద్ద బుక్కు సదవడం నేర్పిద్దామని ఇంటి పక్కనే వున్న వుర్దూ బడిలో ఏడవ తరగతి వరకు చదివించినాడు. కానీ వానికి సదువబ్బక పోగా చెడుతిరుగుళ్ళు ఎక్కువయినాయి. దాంతో వాన్ని తీసుకొనిపోయి సొంతూరిలో తమ్ముని దగ్గర వదిలినాడు. వాడు అన్నే పెరిగి పెద్దోడయి అదే వూరిలో నిఖా చేసుకుని పొలం పని, కూలీపని చేసుకుంటున్నాడు.

ఫకీరప్పది ఎదుగూ బొదుగూ లేని సంసారం. అప్పులూ లేవు. ఆస్తులూ లేవు. కాలం అట్లా గాలివాటంగా దొర్లిపోతావుంది. కానీ ఇటీవలే నాలుగేళ్ళ కిందట రోడ్ల విస్తరణలో భాగంగా సీక్యాంపు దగ్గరున్న అంగళ్ళన్నీ పీకేసినారు. దాంతో ఫకీరప్ప వీధిలో పడినాడు. యాడా సోటు దొరక్క, అద్దెలు కట్టలేక రాజ్‌విహార్ సెంటర్‌లో సింతసెట్టు కిందికి చేరినాడు. అప్పటినుంచీ గిరాకీలు బాగా తగ్గిపోయినాయి. దానికి తోడు వయసుమీద పడింది. ఇంతకు ముందులా చురుగ్గా పనిచేయలేక పోతున్నాడు.

ఫకీరప్ప కండ్లు వచ్చీపోయే వాహనాల వెంటే పరుగులు

దీస్తున్నాయి. ఎవరైనా ఫుట్‌పాత్‌మీద నడుస్తూ వచ్చినా, ఏదయినా బండి కొంచం అటూ యిటూగా ఆగినా తనకోసమేనేమో అని ఆత్రపడుతున్నాడు. వాళ్ళు దాటిపోగానే నీరసపడి పోతున్నాడు. ఎప్పుడు ఎవరొస్తారో తెలీదు, ఏ బేరం జారిపోతాదో అర్థంగాదు. అందుకే ఆ సోటు వదిలి ఎక్కడికీ కదలడం లేదు. దానికితోడు ఇటీవలే పోటీ గూడా పెరిగింది. మరో ఐదారు మంది ఈ వృత్తిలోకి దిగినారు. ఫకీరప్ప పనిలో పనిగా టార్చిలైట్లు, గొడుగులు, కూడా రిపేరీ చేసేటోడు. కానీ ఇప్పుడు అవి ఎవరూ తీసుకొని రావడం లేదు. వుత్త తాళాలు మాత్రమే.

కొందరు కారు తాళాలు లోపల్నే మర్చిపోయి డోర్ వేస్తుంటారు. అది ఆటోమ్యాటిక్‌గా పడిపోతుంటాది. ఫకీరప్ప కారుకి చిన్న గీతకూడా పడకుండా చానా అవలీలగా, పొడవైన స్కేలు సాయంతో ఒక్క నిమిషంలో తీసేటోడు. చానా మంది ఇంటి తాళాలు, బైకు తాళాలు పోగొట్టుకొని వచ్చేటోళ్ళు. కొంతమంది ముందు జాగ్రత్తగా డూప్లికేట్ తాళాలు, దొంగ తాళాలు చేయించుకునేటోళ్ళు.

కొన్ని సార్లు వూహించనివి జరుగుతూంటాయి. ఒకసారి అర్థరాత్రి మొగుడూ పెండ్లాలు ఇద్దరు బండిమీద ఇంటికొచ్చి పడుకున్న ఫకీరప్పని నిద్రలేపినారు. సెకండ్‌షో చూసి వస్తావుంటే తాళాలు ఎక్కడో పడిపోయినాయని బ్రతిమలాడుకున్నారు. పాపం... పక్కనే ఆడామె వుంది గదా అని జాలిపడి ఆ అర్థరాత్రి సైకిల్ తొక్కుకుంటూ వాళ్ళెంబడి పోయినాడు.

వెంకటరమణకాలనీలో చివరన పెద్ద ఇండ్లు. లోపల మూడు నాలుగు గదులు అన్నిటికి తాళాలు వేసివున్నాయి. దొంగల భయం గదా అందుకని అన్నీ వేశామని చెప్పినారు. ఫకీరప్పకు బీగం చూడగానే తెలిసిపోతుంది. అది ఏ కంపెనీది. ఒక్క క్షణంలో వచ్చేదా సతాయించేదా అని. కానీ ఏదయినా సరే చివరికి లొంగాల్సిందే. ఒక్కొక్క తాళాన్నే తీస్తూ గంటలో అన్నీ తెరిచినాడు. వాళ్ళు ఐదువందలు చేతిలో పెట్టినారు. సంబరంగా ఇంటికి చేరుకున్నాడు. పొద్దున్నే ఎవరో తలుపులు కొడుతుంటే కండ్లు నులుపుకుంటూ తెరిచినాడు. ఎదురుగా పోలీసులు. "నిన్న రాత్రి వెంకటరమణ కాలనీలో తలుపులు తెరిచింది నువ్వేనా" అన్నాడు పోలీసు. "అవును సార్" అన్నాడు భయంభయంగా బెదపడుతూ.

"ఎప్పన్నించి మొదలు పెట్టినావురా దొంగలకు సాయం సేయడం. నీ తోడు దొంగలు యాడున్నారు సెప్పు" అంటూ స్టేషన్‌కు లాక్కొని పోయినారు. ఆ కేసునుంచి బైట పడటానికి తలప్రాణం తోకకొచ్చింది. ఫకీరప్ప అవన్నీ తలచుకుంటూ దారినపోయే వాళ్ళని ఆశగా చూస్తున్నాడు.



వినోద్ బస్సు ఎక్కబోతున్నంతలో ఫోన్ మోగింది. ఎవరా అని చూస్తే తన పెండ్లాం సునంద.

ఫోన్ ఎత్తగానే "ఏమండీ బస్సెక్కేసినారా" అంటూ ఆదుర్దాగా అడిగింది. ఆమె గొంతులో కంగారును కనిపెట్టి "ఇంకా లేదే... ఏమిటి విషయం" అన్నాడు.

సునంద హమ్మయ్య అని నిట్టూరుస్తూ "ఏమీ లేదండీ... వూరికి వచ్చేటప్పుడు నా నగలన్నీ తీసుకొని వచ్చినాగానీ, పోయిన్నెల కొన్న నెక్లెస్ మాత్రం బీరువాలోనే పట్టుచీరలకింద పెట్టి మరిచిపోయినట్లున్నా. ఇందాకే మా అమ్మకు ఆ కొత్త నగ చూపిద్దామని సూట్‌కేస్ తెరిస్తే కనబడలేదు. మీరు వచ్చేటప్పుడు పట్టుకోని రండి. అసలే వూర్లో దొంగలు ఎక్కువగా తిరుగుతా వున్నారు. ఇంటికి వరుసగా రెండు దినాలు తాళం కనబడితే సాలు మీదపడి దోచేస్తున్నారు" అనింది.

ఆ మాటినగానే వినోద్ అదిరిపడినాడు. ఆ నెక్లెస్ కొత్తది. ఇటీవలే పెండ్లాం పుట్టినరోజుకి కొన్నాడు. కనీసం మూడు తులాలు వుంటాది. ఎంత కాదన్నా లక్షపైన్నే.

"సరే... సరే... సమయానికి చెప్పినావు తీసుకోనొస్తాలే." అంటూ బస్టాండ్ నుంచి ఆటోలో తిరిగి ఇంటికి బైలుదేరినాడు.

చెల్లెలికి నిశ్చితార్థం వుండడంతో నాలుగు దినాలు ముందుగానే సునంద పిల్లలను తీసుకొని పుట్టింటికి వెళ్ళిపోయింది. వినోద్ ముందురోజు బాస్‌ను బతిమలాడి పర్మిషన్ తీసుకొని మధ్యాహ్నం బైలుదేరినాడు. కానీ... అంతలో ఈ విషయం.

వినోద్ ఇంటి కాంపౌండ్ గేట్ తీసి లోపలికి వచ్చినాడు. తలుపు మెట్లమీద బ్యాగ్ వుంచి తాళం చెవులకోసం ప్యాంట్ ఎడమ జేబులో చేయి పెట్టినాడు. పర్సు లేదు. గుండె గుబేలుమనింది. పొరపాటున కుడివైపు పెట్టానేమో అని కుడి జేబులో చేయి పెట్టినాడు. కర్చీఫ్, దువ్వెన తప్ప ఏమీ లేవు. వెనుక జేబుల్లో కంగారుగా వెదికినాడు. నుదుటిమీద చిన్నగా చెమటలు పట్టసాగినాయి. పొద్దునే [illegible]నుంచి యాభైవేలు తీసుకొచ్చినాడు. పర్సు, దా[illegible]టు తాళాలు కనబడ్డం లేదు. పై జేబులో సెల్‌ఫోన్ మాత్రమే వుంది. పొరపాటున

బ్యాగులో ఏమన్నా పెట్టుకున్నానా అని అనుమానమొచ్చి బట్టలన్నీ బైటకు తీసినాడు. యాడా లేవు. నీరసంగా మెట్లమీదే చతికిలబడినాడు. బస్టాండ్‌కు పోయేటప్పుడో, వచ్చేటప్పుడో... ఆటోలోనో, దారిలోనో పడిపోయినట్టున్నాయి. ఏం చేయాల్నో తోచలేదు. విషయం చెబితే పెండ్లాం కంగారు పడుతుంది. డబ్బులు తిరిగి రాకపోగా చెల్లెలి నిశ్చితార్థం అనే ఆనందం గూడా అందరికీ ఆవిరయిపోతుంది.

కాసేపాగి ఆలోచించి ఎవరికీ ఏమీ చెప్పకుండా లోపల హారం తీసుకొని పోదాం అనుకున్నాడు. పక్కింటిలో స్నేహితున్ని పిలిచి తాళాలు మాత్రం పడిపోయినాయని చెప్పి "కొంచం బండివ్వరా, ఎవరినన్నా తాళాలు తీసేటోన్ని పిలుచుకోని వస్తా" అన్నాడు. వాడు సరేనని తాళం చెవి ఇస్తూ "జాగ్రత్తరా... ఇదిగూడా యాడన్నా పాడేశేవు. వున్నది ఒక్కటే తాళం అన్నాడు నవ్వుతా.

వాని ఎగతాళికి సురుక్కుమన్నా దాన్ని బైటకు కనబడనీయకుండా బండి తీసుకొని బైలుదేర్నాడు. పీర్ల పండుగకు ముందురోజు కావడంతో గడియారం అస్పత్రి, సీక్యాంప్ దగ్గర ఎప్పుడు వుండేటోళ్ళు లేరు. వెదుకుతూ పోతావుంటే రాజ్‌విహార్ దగ్గర ఫుట్‌పాత్‌మీద ఫకీరప్ప కనిపించినాడు.

"ఈ ముసలోనికి చేతనవుతుందా" అని అనుమానంగానే దిగినాడు. విషయం వివరించి "ఎంత తీసుకుంటావు" అని అడిగినాడు.

ఫకీరప్ప తాళం మామూలుదేనా లేక ఏదయినా కంపెనీదా అని వివరాలు అడిగినాడు. తాళం ఏ కంపెనీదో చెప్పగానే "యా అల్లా.. ఆ తాళమా... లోపల శానా లివర్లు వుంటాయి సార్. అదీ గాక డబల్ లాక్. అంత తొందరగా రాదు. మూడొందలు ఇప్పించండి అన్నాడు.

మూడొందలా... కొత్త తాళం వస్తాది దాని బదులు" అన్నాడు వినోద్. ఫకీరప్ప నవ్వి "తాళం పగలగొట్టడానికయితే వంద రూపాయలు చాలు సార్. కానీ తాళంగానీ, చెక్కతలుపులు గానీ కొంచం గూడా దెబ్బ తినగూడదు అంటున్నారు. శానా పనుంటాది" అన్నాడు నసుగుతూ.

వినోద్ రెండు వందలకు బేరమాడి ఫకీరప్పను బండిమీద ఇంటికి తీసుకోని వచ్చినాడు.

ఫకీరప్ప ఆ తాళం అటూ యిటూ తిప్ప చూసి "అబ్బో... ఇది మామూలు తాళం కాదు సార్. పెద్ద పెద్ద అంగళ్ళకు దొంగలు షట్టర్లు తెరవకుండా బైట వేస్తుంటారు. ఈ నడమనే వచ్చింది. నేను గూడా ఎప్పుడూ తియ్యలా" అంటూ సంచీలోంచి పాత తాళాల గుత్తి తీసినాడు. అనేక తాళం చెవులు పెడుతున్నాడు, తీస్తున్నాడు. లివర్లు తిరగడానికి వీలుగా ఆకురాయితో చిన్నగా అరగదీస్తున్నాడు. నెమ్మదిగా గంట అయ్యింది. తాళం తెరుచుకోలేదు.

ఫకీరప్ప జీవితంలో అటువంటి మొండి తాళం ఎప్పుడూ ఎదురు పడలేదు. "యాడకొన్నారు సార్ దీన్ని" అన్నాడు నుదుటికి పట్టిన చెమటను తుడుచుకుంటూ.

"వూర్లో దొంగతనాలు ఎక్కువైనాయి గదా... నాది ఎప్పుడూ వూర్లు తిరిగే వుద్యోగం... అందుకే మూడు వేలు పెట్టి హైదరాబాదులో కొన్నా" అన్నాడు. అది అంత త్వరగా రానందుకు ఒకపక్క గర్వంగానూ, మరొక పక్క విచారంగానూ వుంది వినోద్‌కు.

ఇంకో అరగంట గడిచింది. ఐనా తాళం తెరచుకోలేదు. ఫకీరప్ప సిగ్గుతో తలొంచుకొని "సార్... లాభం లేదు సార్. నా జీవితంలో ఏదయినా సరే పదినిముషాలు లేదా అరగంట. కానీ ఇది వచ్చేటట్టు లేదు సర్. పగలగొట్టమంటే చెప్పండి. కానీ తాళం ఇక పనికిరాదు" అన్నాడు సంచీలోంచి సుత్తి తీస్తూ.

వినోద్ ఆలోచనలో పడినాడు. అదంతా చూస్తున్న పక్కింటి స్నేహితుడు "వద్దొద్దు. ఆ తాళం తలుపుకు ఆనుకొని చానా దగ్గరగా వుంది. నువ్వు గట్టిగా కొడితే సుత్తి దెబ్బ తలుపుమీద పడి చెక్క దెబ్బతింటాది" అంటూ వినోద్ వైపు తిరిగి "ఇతన్ని వదిలేసి రాపో... మా స్నేహితుని వెల్డింగ్ షాప్ దగ్గర్లోనే వుంది. వాన్ని పిలిపిద్దాం. మిషన్‌తో నిమిషాల్లో కోసి పాడేస్తాడు" అన్నాడు.

ఫకీరప్పకు నోట మాట రాలేదు. ఇంకొంత సేపు ప్రయత్నించినాడు. వూహూ రాలేదు. నిరాశ మొగమంతా కమ్మేసింది.

"సరేలే... రాకపోతే నువ్వేం చేస్తావు గానీ... పోదాం పద. దించొస్తాను" అన్నాడు వినోద్.

ఫకీరప్ప నీరసంగా అన్నీ సంచీలోకి సర్దుకోని పైకి లేచినాడు. పొద్దున తిన్న రెండు బన్నులు ఎప్పుడో అరిగిపోయినాయి. నెమ్మదిగా దిగులుగా మాట మాట్లాడకుండా

# పనీ పాటా లేకుండా...

- డా.విజయ్ కోగంటి
8309596606

విసుగూ విరామం లేకుండా
కొమ్మలను రెమ్మలనూ కదిలిస్తూ
గాలిని పంచుతుంది
పనీ పాటా లేని చెట్టు

ఎవరూ అడక్కుండానే
వూరికే విరబూసి
పరిమళాన్నిస్తుంది
పనీపాటా లేని పువ్వు

ఎవరూ పలకరించకుండానే
వూరికే అరుస్తూ
నడిచేసే జీవితముందని గుర్తు చేస్తుంది
పనీ పాటా లేని కాకి



అవసరానికి మించిన తిండి తింటూ
అతిగా నిద్రపోతూ
తీరిక లేనట్లు నటిస్తూ
దుమ్మెత్తి పోస్తూ
చాడీలు చెప్తూ
కాలాన్ని గడిపేస్తూ
పనీ పాటా వదిలేసిన మనిషి! ◆

---

వచ్చి బైకుమీద కూచున్నాడు. చానా అవమానంగా వుంది. వినోద్ రాజ్‌విహార్ దగ్గర ఫకీరప్ప షాప్ వద్ద బండి ఆపినాడు. ఫకీరప్ప వంచిన తల ఎత్తకుండా మౌనంగా బండి దిగినాడు. వినోద్ బండి తిప్పుకోని స్టార్ట్ చేసి ముందుకు కదిలిస్తుంటే....

"సార్... సార్" అంటూ గట్టిగా అరుపు వినిపించింది.

వినోద్ వెనక్కి తిరిగి చూసినాడు.

ఎదురుగా పొద్దున తాను బస్టాండ్ పోయేటప్పుడు ఎక్కిన ఆటో డ్రయివర్. అతని మొగం ఆనందంతో వెలిగిపోతోంది.

"సార్... పొద్దున మువ్వే గదా... బీక్యాంప్‌లో నా ఆటో ఎక్కి బస్టాండ్ దగ్గర దిగింది" అన్నాడు.

"అవును నేనే" అన్నాడు వినోద్ అతన్ని పోల్చుకుంటూ.

"సార్... నువ్వు దిగిన కాసేపటికి చూస్తే నీ పర్సు, దాని పక్కనే తాళాలు కనబన్నాయి. తెరిచి చూస్తే అందులో చానా డబ్బులు వున్నాయి. ఎంత అవసరం వుండి అన్ని డబ్బులు తీసుకోని పోతున్నావో... వెంటనే బస్టాండంతా నీకోసం చానా సేపు వెదికినా. యాడా కనబల్లేదు. ఇంకాసేపుంటే పోలీస్ స్టేషన్‌లో ఇచ్చేద్దామనుకున్నా" అంటూ పర్సు తాళాలు చేతిలో పెట్టినాడు. వినోద్ లెక్కంతా ఎంచుకున్నాడు. భద్రంగా వుంది.

"ఎట్లా గుర్తు పట్టినావు నన్ను" అన్నాడు ఆనందంగా వినోద్.

"నీవు నల్లరంగు షర్టు వేసుకున్నావు గదా. ఆ రంగంటే నాకు చానా ఇష్టం సార్. నీవు ఎక్కేటప్పుడు అబ్బ... ఎంత బాగుంది షర్ట్ అనుకున్నా. అందుకే మరిచిపోలేక పోయినా సార్" అన్నాడు.

వినోద్ ఆటో డ్రయివర్‌కి థ్యాంక్స్ చెప్పి రెండు అయిదు వందల నోట్లు తీసి "తీసుకో" అన్నాడు.

"వద్దు సార్. ఇందులో నేను చేసిందేమీ లేదు. నా ధర్మం నేను చేసినానంతే" అన్నాడు వెనడుగు వేస్తూ.

వినోద్ అతని భుజంపై చేయివేసి "నీకు నల్లరంగు షర్ట్ అంటే చానా ఇష్టం అన్నావు గదా. నువ్వు చేసిన మంచిపనికి గుర్తుగా కొనుక్కో" అంటూ బలవంతంగా అతని జేబులో పెట్టి బైకు స్టార్ట్ చేసినాడు.

ఫకీరప్ప ఇద్దరినీ మార్చి మార్చి చూస్తూ ఒంటి పీరులాగా దిగులుగా సింతసెట్టు కిందే కూలబడి పోయినాడు. నోటికాడి కూడు జారిపోయినట్టనిపించింది. కండ్లలో నీళ్ళు దిరిగినాయి.

అతని కండ్లు మరలా రోడ్డుమీద వచ్చీపోయే జనాలవంక ఆశగా చూడసాగినాయి.

ఇంటి దగ్గర మస్తానమ్మ సంబరంగా సామానులు సర్దుతూ వుంది. కూతురిని, కొడుకును, మనవండ్లను, మనవరాండ్లను తలచుకుంటూ.... ◆

# సాహితీ విమర్శకులకు ఒక కరదీపిక 'మమనార్ట్'




- పిల్లా కుమారస్వామి
9490122229

సాహిత్యమంతా ప్రచారమేనని నమ్మిన ఆప్టన్‌సింక్లేర్ అమెరికాలో సోషలిస్టు సాహిత్యోద్యమాన్ని 20వ శతాబ్దంలో ప్రథమార్థంలో నిర్మించారు. ఆయన రచయితలు డబ్బుకు ఎలా దాసోహం అవుతారో, అప్పుడువాళ్ళు తమ రచనల్లో ఎవరిని పొగుడుతారో, ఎవరిని తెగనాడుతారో సోదాహరణంగా వివరిస్తూ రచయితల వర్గ దృక్పథాన్ని వివరిస్తూ మమనార్ట్ **(Mammon Art)** ను 1927లో రచించాడు. ఆ గ్రంధాన్ని ముక్తవరం పార్థసారధి తన స్వేచ్ఛానువాదంతో పాటు తన వ్యాఖ్యానాన్ని కూడా రాసి మన అవగాహనను పెంచినారు. దీనిని 'కాసుల కబంద హస్తాలలో కళల సాహిత్యం' పేరుతో జన సాహితి ప్రచురించి కొత్తతరం సాహిత్యకారులకు ఒక పాఠ్యగ్రంథంలాగా అందరికీ అందుబాటులోకి తెచ్చింది. ప్రతి ఒక్కరూ చదవాల్సిన గ్రంథమిది.

క్రీ.పూ. 800నుండి క్రీ.శ.1924వరకు వున్న మధ్యకాలంలో వచ్చిన వివిధ రచనలపై ఆయారచయితల రచనలను విశ్లేషిస్తూ వారి జీవిత విశేషాలను కూడా ఒకవైపు వివరిస్తూ వారి సాహిత్యంలోనూ, జీవితంలోనూ ఉన్న వైరుధ్యాలను విపులంగా వివరించాడు. అదే సందర్భంలో వారి సాహిత్యం ఎవరివైపు నిలబడిందో స్పష్టం చేస్తూ తన సొంత వ్యాఖ్యనాలను చెప్తూ వివరిస్తాడు మమనార్ట్. సాహిత్యరంగంలో వర్గపోరాటాన్ని సాగించే సాహిత్యోద్యమ కారులందరికీ ఒక కరదీపికగా 'మమనార్ట్' ఉపయోగపడే విధంగా తీర్చిదిద్దినాడు. సాహిత్యం సమాజాన్ని మార్చడానికి ఉపయోగపడే ఒకసాధనం. ఇది సమాజంలోని సంఘటనలతో ప్రభావితమవుతూ సమాజాన్ని ప్రభావితం చేస్తూ ఉంటుంది. దీన్ని గుర్తించిన సాహిత్య కారులు సమాజ చైతన్యం కోసం రచనలు చేయాల్సి ఉంటుంది.

సాహిత్యకారుడు కష్టజీవులకు కుడి ఎడమల నిలబడతారని శ్రీశ్రీ చెప్పినాడు. అయితే పీడితులు విజయం సాధిస్తూ నింగికెగిరినప్పుడు నిబిడాశ్చర్యంగా చూస్తూ వారివైపు నిలబడిన రచయితలను గొప్పగా కీర్తిస్తారని, అదే పీడితులు పరాజితులై నిప్పులు చిమ్ముకుంటూ నేలకు రాలిపోతే వారిని నిర్దాక్షిణ్యంగా కాలరాస్తారని, వారిని కీర్తించిన రచయితలను మక్‌రేకర్స్‌లని, ప్రాపగాండిస్టులని, సోమరిపోతులని హేళన చేస్తారని సింక్లేర్ చెపుతారు.

రచయితకు సామాజిక దృక్పథం ఉండటం లేదంటే ఆ రచయిత సమాజాన్ని పరిశీలించకుండా తన ఊహాలోకంలో ఉండి ఉండాలి. సమాజంలో దోపిడీ ఉంది. సమాజంలో అవినీతి ఉంది. సామాన్య ప్రజలు పెట్టుబడీదారీ విషవలయంలో చిక్కుకుని విలవిలలాడుతున్నారు. ఎంతో సంక్లిష్టంగా ఉన్న సమాజాన్ని విశ్లేషించడానికి సమస్య మూలాన్ని పట్టుకోవడానికి మార్క్సిస్టు దృక్పథం బాగా

ఉపయోగపడుతుంది. ఇలాంటి దృక్పథాన్ని అర్థం చేసుకోకుండా రచనలు చేసే నేటి సమాజపు రచయితలను ఏమనాలో అర్థం కావడంలేదని అప్టన్ సింక్లేర్ చెపుతాడు.

రచయితలు ద్వంద్వ స్వభావం గలవారై ఉంటే దాన్ని ప్రజలు అసహ్యించుకుంటారు. తాను చెపుతున్నదానికి, ఆచరణకు పొంతన లేనపుడు ప్రజలు రచయితలంతా ఇంతేనా అని రచయితలపట్ల చులకన భావం పెంచుకుంటారు. దీన్నే నిబద్ధత లేకపోవడం అంటారు. ఆ రోజుల్లో కూడా రచయితల్లో నిబద్ధత లేకపోవడాన్ని సింక్లేర్ తప్పుపట్టాడు. చెప్పేందుకే మేమున్నాం. మేం మాత్రం ఆచరించం. మీరు ఆచరిస్తారో లేదో మీ ఇష్టం అన్నట్లున్నమాట. ఆయన మార్క్‌ట్వేన్ గురించి చెపుతూ పెట్టుబడీదారీ సమాజంలో ఉన్న కుహనా సంస్కృతిని ఒకవైపు విమర్శిస్తూనే మరోవైపు అదే సమాజం అందించే సుఖలాలసతకు ఉదాహరణగా మార్క్‌ట్వేన్ లొంగిపోవటాన్ని ప్రస్తావించాడు.

ఇలాంటి నిబద్ధతలేని రచయితల చిత్తశుద్ధిని ఆయన తప్పుపట్టాడు. రచయితలు ఇలాంటి ద్వంద్వ ప్రమాణాలతో ఉండరాదని ఆయన కోరుకున్నాడు.

నేడుమన సమాజంలో కూడా ఇలాంటి రచయితలను చాలామందిని చూస్తుంటాం. ఒకవైపు పాలకులను విమర్శిస్తూ వాళ్ళిచ్చే అవార్డులకు, బహుమతులకు ఆకర్షణకు లొంగిపోతుంటారు.

డబ్బుకు అమ్ముడుబోయిన వాడు నిజాయితీగా ఉండలేడు. నిజాయితీగా బతకలేనివాడు సంతోషంగా ఉండడనే సత్యాన్ని మనకు ఎరుక పరుస్తాడు. వ్యక్తి సమస్యలన్ని సామాజిక సమస్యలేనని టాల్‌స్టాయ్ చెప్పిన విషయాన్ని చెపుతూ నిజాయితీగా బతికి నిజాయితీగా రాసి నిబద్ధత కలిగినవాడు మంచి రచయితగా ప్రకటిస్తాడు సింక్లేర్. ఇలాంటి కోవలోకి వచ్చే ప్రేమ్‌చంద్, శ్రీశ్రీ, చెరబండరాజు, అలిశెట్టి ప్రభాకర్ వంటి కవులు రచయితలు మరెందరో మనదేశంలో ఉన్నారు.

ధనస్వామ్యానికి, ధనార్జనకు నిలయం అమెరికా. ఆ దేశం ఆర్థికంగా, సాంకేతికంగా ఎంతో ఎత్తుకు ఎదిగింది. ఇలాంటి సమాజంలో కళాకారుడు ఒక విదూషకునిగా మారిపోయి కాసుల కబంధహస్తాలలో నలిగిపోతాడన్నారు సింక్లేర్. అంతేగాక కొన్ని వృత్తులకు ఇండియాలో మాదిరి అమెరికాలో కూడా గౌరవమైన స్థానం ఇవ్వటంలేదు. ఆ వృత్తుల నుంచి వచ్చిన వాళ్ళు ఎంత ప్రతిభావంతులైనా అమెరికన్ సమాజం తక్కువగా చూస్తుంది. ఈ సమస్య మనదేశంలో దళితులకు ఎక్కువగా ఎదురవుతుంటుంది. ఇవన్నీ భూస్వామ్య అవశేషాలు. ఆనాటి భావజాలం పెట్టుబడీదారీ వ్యవస్థ పరిపక్వమవుతున్నా ఇంకా పోలేదన్నమాట. మనదేశంలోనైతే భూస్వామిక భావజాలం అడుగడుగునా పాలక వర్గంలోను సమాజంలోనూ నిత్యం చూస్తూనే ఉన్నాం.

సమాజంలో అసమానతలపై, దుర్లక్షణాలపై ఎక్కుపెట్టిన రచనలు పెరగాలి. అయితే వాటిని ప్రజలకు చేర్చాలంటే చైతన్యపూరిత సంఘాలు ప్రత్యేక శ్రద్ధతో సాహిత్యోద్యమాన్ని నిర్మించాలి. అప్పుడేసామాజిక వికాసం సాధ్యమవుతుంది.

కవి ప్రజల పక్షం వహించాలని పి.బి.షెల్లీ చెపితే, ప్రపంచబాధను తన బాధగా చూడగలిగిన వాడే కవి అని, కీట్స్ ఏనాడో చెప్పినాడు. కొంతమంది కవులు అలా చూడగలిగారని మరికొంతమంది తమ బాధను మాత్రమే వెల్లడించారని సింక్లేర్ గుర్తించాడు. ఫ్రెంచి విప్లవం సందర్భంలో విప్లవాన్ని చూసి వర్డ్స్‌వర్త్ బెదిరిపోతే బైరన్ పోరాటవాదుల వైపు నిలిచాడని పేర్కొన్నారు. విక్టర్ హ్యూగో తన రచనల ద్వారా ఫ్రెంచి సమాజంలో విప్లవాత్మక మార్పులకు నాందివలికినాడు. ఇవన్నీ వివరిస్తూ మానవీయ విలువలకోసం తమజీవితాన్ని అర్పించిన మహనీయులైన రచయితలే చరిత్రలో నిలుస్తారని ఆయన చెపుతారు.

"నువ్వు బలప్రయోగం చేయకు. నీనైతిక బలంతో అతడి మనస్సును మార్చు. తన హింసకు తానే సిగ్గుపడేలా చెయ్యి" ఇది టాల్‌స్టాయ్ తన రచనల ద్వారా సందేశం ఇచ్చినట్లుగా చెపుతాడు సింక్లేర్. కళకు నైతికతను జోడించిన గొప్పరచయితగా ఆయన్ను కీర్తించాడు. అతనిలాగే ఎస్కీలస్, సోఫాక్లీస్, వర్జిల్, డాంటే, సెర్వాంటిస్, విక్టర్‌హ్యూగో, దోస్తొయెవిస్కీ, ఇబ్సన్ మొదలైనవారి రచనలు నైతికతకు ప్రాధాన్యత నిచ్చాయి. మనదేశంలో ఠాగూర్, ప్రేమ్‌చంద్ సాహిత్యంలో నైతికతను నొక్కిచెప్పినారు.

"పాత్రల జీవనసరళి గురించి వ్యాఖ్యానించకుండా కష్టాల్లో ఉన్నవాళ్ళు ఏంచేసి బయటపడాలో చెప్పకుండా యథాతథ చిత్రణకే ప్రాధాన్యత నిచ్చే రచయితలు పలాయన వాదులు" అని అప్టన్ సింక్లేర్ అభిప్రాయపడినాడు. ఈ

# ఎడారి వనం

- స్వప్న మేకల
9052221870

కాలపు నీడకు పుట్టిన నిర్మానుష్య దేహమిది
దేహం నిండా దాహపు గుర్తులతో
వెలిసిపోయిన రూపు రేఖల ఆనవాళ్లే ..!!

ఎముకల గూడుపై వాలే పిట్టలు
తల వాల్చే జాడ మరిచి నేలకొరిగాయి ..
కోటి రాగాల కోయిల
మనిషి మాయలో కూరుకొని
అపశృతులుగా పాడుతుంది ..!!

వసంతం లేని వెన్నెల పుడుతుంది
శిశిరపు దేహపు నీడల్లో
ఎండు టాకులై నేల రాలి పోతున్నాయి
పచ్చని చెట్టు వేసిన ముద్రల్లో
వేర్లు వేరుగా చీలిపోతున్నాయి ..!!

ఆకాశం పరచిన గొడుగుకు
చిల్లులు పడి రాలిన చినుకుల్లో
మొలిచిన విత్తులు
ఎదగనివ్వని మనిషి నైజానికి తలొంచి
మౌనంగా ముడుచుకుంటున్నాయి ..!!

కాలుష్యపు కోరలు
జన జీవనాన్ని చుట్టేస్తుంటే



మానవ మనుగడ నత్త నడకన సాగుతుంటే
అవని ఉగ్ర రూపంతో కళ్ళెర్రజేస్తోంది..!!

మూసుకున్న దారులే అన్నీ...
మంత్ర మేసే మాయాజాలానికి
అడవి కాచే వెన్నెలకి
ఎడారి వనం కాపు కాసుకుంటూ
కాలం వెళ్ళదీస్తోంది..!! ◆

---

అంశం మీద చాలా మంది రచయితలు రకరకాలుగా వ్యాఖ్యానించారు మన తెలుగు సాహిత్యంలో. రచయిత పాఠకునికి పరిష్కారం చూపాలని, కొంతమంది ఆదేమీ చెప్పకుండా పాఠకుని నిర్ణయానికే వదిలేయాలని వాదన చేసినారు. కాకపోతే రచయిత ఒక పరిష్కారం సూచించినప్పుడు అది పాఠకునికి నచ్చకపోతే ఇంకో పరిష్కారాన్ని తనే వెదుక్కుంటాడు. అసలు చెప్పకపోతే పాఠకుడు పరిష్కారం దిశగా ఆలోచించే మార్గం అతనికి కలుగకపోయే అవకాశం ఉంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని సింక్లేర్ చెప్పినట్లు రచయిత పలాయనవాది కారాదు.

అమెరికా, యూరవ్ రచయితల రచనలను పరిశీలించి విశ్లేషించి వారి రచనలు ఎవరికోసం ఉపయోగపడతామో మనకు ఎరుకపరుస్తాడు సింక్లేర్ ఈ గ్రంథంలో. పైగా అనువాదకుడు ముక్తవరం పార్థసారథి రచయితల గురించి ఇచ్చిన అదనపు సమాచారం మన అవగాహనను విస్తృత పరుస్తుంది. ఈ విశ్లేణాత్మ విధానం మనదేశంలోని రచయితల రచనలు ఏ వర్గానికి సహాయపడుతున్నాయో మనం అర్థం చేసుకోవడానికి ఉపకరిస్తుంది. జాషువారచనలు అట్టడుగువర్గాలైన దళిత జీవుల గురించి మాట్లాడితే విశ్వనాథ సాహిత్యం వర్ణవ్యవస్థను కీర్తించటానికి, సమాజం మారకుండా ఉండటానికి దోహదం చేస్తాయని నిస్సంకోచంగా చెప్పగలం. ఇలా సాహిత్యవిమర్శా రంగంలో కృషిచేయాలనుకునేవారికి ఒక కరదీపికగా, ఉపయోగపడుతుందనడంలో ఎలాంటి సందేహం లేదు. ◆

# మలయాళ జానపద గేయాలు - స్త్రీ



- డా. జి. శైలమ్మ
9618361905

సమాజంలో అనేక రకాల భాషా సమూహాలు, ప్రాంతాన్ని బట్టి పరిసర వాతావరణాన్ని బట్టి భిన్న భావజాలం మనుషుల మధ్య నెలకొంటుంది. మనిషి నిరంతర కష్టజీవి. కష్టం నుండి పుట్టింది పాట. పని భారం తెలియకుండా పాడుకొనే పాటలు సంతోషకరమైన గేయాలు, దుఃఖకరమైన గేయాలు. గేయాలను పరిశీలించినప్పుడు మానవ జీవన విధానం అర్థమవుతుంది. స్త్రీని గేయాలలో అందమైనదిగానే వర్ణిస్తుండగా, అదే సమయంలో ఆమె పడిన వేదన, ఆ కారణంగా మృత్యురూపాన్ని పొందిన సంఘటనలు విషాద గీతాలుగా రూపొందాయి. ఎల్.ఆర్. స్వామి తెలుగులోకి అనువదించిన మలయాళ జానపద గేయాలననుసరించి నాటి స్త్రీ జీవన విధానం గేయాల్లో ప్రతిఫలించిన తీరు విషాదంగానూ, ఆలోచింపచేసేవిగానూ ఉన్నాయి.

'మారన్ పాట' అన్న గేయంలో వివాహం అయిన స్త్రీని, భర్త వదలి వెళ్లిపోతాడు. పెళ్లికుమారుడు ఎక్కడికెళ్లాడో తెలీదు. ఆమె, ఆమెతోపాటు ఆమె కుటుంబ సభ్యులు ఇల్లువాకిలి అలంకరించి అతనికోసం ఎదురు చూస్తారు. ఇరుగు పొరుగు పెళ్లికూమారుడు రాలేదని ఎంత కాలం ఎదురు చూశారో గేయంలో స్పష్టంగా లేదు. చివరికి ఆమె ప్రాణత్యాగం చేసుకోబోయి నీరసమొచ్చి పడిపోతుంది. ఆమె ఆత్మహత్య చేసుకోబోయే సమయంలో పెళ్లికుమారుడు ఆమెకు కనిపిస్తాడు. నేటి సమాజంలో వివాహం చేసుకొన్న పురుషులు వ్యవహరించే తీరుకి ఇదొక నిదర్శనం.

"చెప్తాను చక్కనీ మాటలు వినండి / చెవులప్పగించీ చక్కగా వినండి / ఆ రోజు అమ్మాయి చేతులందుకున్నాడే / ఈ రోజు పిల్లకూ చేతులిచ్చాడే". వివాహం చేసుకొన్న తరువాత ఆమెను వదిలేశాడు ఎందుకు అన్నది కారణాలు అనేకం.

"పెళ్ళి చేసుకున్నాక కనబడలేదే / మెడలోన వేలాడె తాళిబొట్టు మాత్రము." అమ్మాయిని సొంతం చేసుకున్నట్టు తాళిబొట్టు కట్టాడు. ఎక్కడికెళ్లాడో యవ్వరికి తెలియదు. వివాహిత మాత్రం భర్త తిరిగొస్తాడని ఎదురుచూసింది చకోర పక్షిలా. మందారపూలతో పందిరిని అలంకరించి కొబ్బరాకులతో పందిరివేసి, మారన్ రూపు (పెళ్లికొడుకు కనిపించేలా పూలతో అలంకరించి చుట్టూ తిరుగుతూ ముత్తైదువులు పాటలు పాడారు.

"మందారమే కాదు పువ్వులాదినుసులు / మంచివీ పందిరీలోన చేర్చి / పంచరంగుల రంగవల్లులే, అల్లేసి / పందిరిలోన 'మారన్' రూపుదిద్దీ / చేతిలో కుంకుమ పూగుత్తి ఏలిన / నారీ మణులు చుట్టూర తిరగసాగిరి / కన్నెలు, వృద్ధులూ పాడారు ఏకంగా / కంపించిపోయింది నారీమణి" వివాహం సంఘంలో గౌరవాన్ని తెచ్చిపెడుతుంది. భర్త దగ్గర లేని కొరత ఆమెలో స్పష్టంగా కనిపిస్తుంది.

భర్త చెంత లేనికారణంగా ఆమెకు మనశ్శాంతి లేదు స్పృహకోల్పోయింది. పెళ్ళికుమారుడు చివరికి వచ్చాడు అని

గేయం సుఖాంతమవుతుంది.

స్త్రీలు చేతికి గాజులు, బొట్టు, కాటుక, మంచి చీరలు వుండాలని కోరుకుంటారు. ఆ పద్ధతిలో పాడుకొనే పాట 'ఆడబిడ్డ' ఆడబిడ్డను అన్నవదినలు బాగా చూసుకొంటున్నట్టు, ఆమెకు కావాల్సిన వస్తువులన్ని ఇస్తున్నట్టు ఈ గేయం ద్వారా తెలుస్తుంది.

పుల్లగుమ్మడి తీగకోసి / పాలకడలి కుయ్యాలేసి / ఊయాలేసి నారన్నలమ్మా / అన్నలకేమిటి యివ్వాలమ్మా. తల్లిదండ్రులు లేని తోబుట్టువుని అల్లారు ముద్దుగా చూసుకుంటారు. అన్న ప్రేమకు యేదో వకటి బహుకరించాలనుకొంటుంది.

వదిన ఆడబిడ్డను ఆహ్వానిస్తుంది. ఆమెకు వారితోపోవాలంటే తగిన ఆభరణాలు దుస్తులు లేవనంటుంది. అవన్నీ ఇస్తాను రా అని వదిన పిలుస్తున్నట్టు గేయం సాగుతుంది.

మంచి చీరైనా లేదాయె ఒదినమ్మా / మొన్ననే కొన్నా నా పట్టు చీర / ముందుగా యిస్తా, నా ఎర్రచీర / మంచి పిల్లానీవుయిటురావె". ఆడబిడ్డ వదినతోపాటు పని కెళ్ళాలంటే కావాల్సిన దుస్తులు లేవంటే వదిన తనకున్న చీరలు యిస్తానంటుంది.

ఇలా పాటంతా వదినిస్తానని ఆడబిడ్డకు హామీ ఇస్తుంది. ఆడవాళ్లకు ఏవో మాటలు చెప్పి వారిని మోసం చేయడం అనాదిగా వస్తున్నది. కడలి చూసి వద్దామా' అన్న గేయంలో అప్పారావు సముద్రం చూసొద్దామని అప్పాయమ్మని పిలుస్తాడు. ఆమె ఎన్ని ఆశలు చూపించినా ఆమె అతనితో పోవడానికి వెనకాడుతుంది. చివరికి ఆడవారి మనస్సు తెలుసుకోమని అంటుంది.

కడలి చూసి వద్దామా అప్పాయమ్మా / మంచి చీర లేదాయె అప్పారావూ / మంచి చీర నేనిస్తా అప్పాయమ్మా. చీరలు ఇస్తాడని చెప్పినా, అన్నం పెడతాడని చెప్పినా ఆమె ససేమిరా అంటుంది.

పెద్దపిల్లనైనాను అప్పారావూ / నీతో ఎట్లా వచ్చేదీ అప్పారావూ / ఎద్దుబండి ఎక్కిస్తా అప్పాయమ్మా. నడవాల్సిన పని లేకుండా తీసుకెళతాడని చెప్పినా అప్పాయమ్మ వద్దని చెప్తుంది. పునరుత్పత్తి చేయగల వయస్సొచ్చిన స్త్రీ పరపురుషునితో తిరగడం వల్ల అనర్థాలున్నాయని సమాజానికి తెలియజేసేదిగా ఈ గేయం ఉంది.

స్త్రీ వర్ణన సాహిత్యంలో కాలాన్ని బట్టి మారుతూ వస్తుంది. జానపదులు సైతం స్త్రీ వర్ణనకు అతీతులేమి కాదు. స్త్రీ ఒక్కో శరీరవయాన్ని తమ చుట్టూ ఉన్న పరికరాలతో పోలుస్తారు.

"ఏమిటేమిటిది తుమ్మెదా / ఈ వింత ఏమిటమ్మా తుమ్మెదా / అటూ దక్షిణాన తుమ్మెదా / ఓ పిల్లనీ చూసాను తుమ్మెదా". స్త్రీల శారీరక అందాన్ని పరిసరాల్లో ఏదో ఒక వస్తువుతోను, జీవితోనో సరిపోల్చి ఆనందించడం కావ్యాల్లో చూస్తాము. కావ్యాలకంటే ముందున్న జానపద సాహిత్యంలో ఈ వర్ణనలు దర్శనమిస్తాయి. నడుముని కందిరీగతోను, పెదాలను దొండకాయతోను, చేతులను తామర తూడలతో పోల్చిన పోలికలున్నాయి. జానపదులు వస్తువులు వాస్తవికతను, స్త్రీ ధృడకాయతను తెలియజేస్తుంది. ముక్కు సంపంగి పువ్వు, నుదురువిల్లులా, పిల్ల పుల్లగుమ్మడి గింజ, మెడ కంచు శంఖము, పొట్ట మర్రిచెట్టు ఆకు, కాళ్లు మంచం కోళ్ళులా వున్న స్త్రీని చూసినప్పుడు గుండెగుబులై ఉన్న మతిపోయిందని చెప్పేపాట.

అందానికి ప్రతీకగా చెప్పుకొనే స్త్రీ అలంకార ప్రియురాలని సమాజంలో ఒక భావన ఉంది. దాని ఆధారంగా జమీందారుల పొలం పనులు చూసుకొనే పాలేరు, బానిస స్త్రీ, పని చేయడానికి పొలంకి వెళుతుంది. గట్టు మీద నడుస్తూపోతున్న ఆమెను చూసి జమీందారు పాడేపాట. పాలేర్లు పని చేస్తుంటే జమీందార్లు ఎండదెబ్బ తగలకుండా పొలం గట్టున గొడుగేసుకొని పర్యవేక్షిస్తుంటారు.

తను ధరించిన వస్తువులు గాజులు, కమ్మలు పట్టీలు వదిలి గొడుగు కిందకి రమ్మని పిలవడం దానికి బదులుగా, ఆమె ఇవి నాతో ఎప్పుడూ ఉండేవని గొడుగు నీడ అశాశ్వతమని జమిందారు దుర్బుద్ధిని బట్టి అతనికి బదులిస్తూ అతన్ని సున్నితంగా తిరస్కరిస్తుంది.

చేతికి నిండుగ గాజులు తొడిగి / చేను గట్టు మీద పోయేదెవరమ్మా / అని అతను అడిగితే ఆమె ఎవరో చెప్తుంది. రైతుకి రాజు జమీందారీ / బానిస కాపుల పిల్లనోయి" అంటుంది. తను ధరించిన గాజులు తీసి తన గొడుగులోకి రమ్మని పిలుస్తాడు.

"గాజులు గట్టున వదిలివేసి / గొడుగూ కిందకి వచ్చేయి పిల్లా" అంటాడు. గొడుగూ నాకు యిప్పటికీ / గాజులు నాకు ఎప్పటికీ". ఈ ఓణంలో దొరికే సుఖం, గొడుగు కింద నీడ స్వల్పం నాతో వుండేవి ఈ గాజులే అని పల్లెటూరి స్త్రీ విజ్ఞతగా బదులిస్తుంది.

స్త్రీలపై హత్యలు ఎప్పటి నుండో వున్నాయనడానికి

నిదర్శనం 'ఒక కోత కథ' గేయం. స్త్రీపై ఏర్పడ్డ అనుమానం రక్తం కళ్లు చూసేదాక ఆగడం లేదు. మద్యానికి బానిసైన భర్త కుటుంబం కోసం కష్టపడి పని చేస్తున్న స్త్రీలపై లైంగిక దాడులు జరుగుతుంటాయి. తనకు ఇష్టం లేకుండా జరిగిన దాడిలో అవమానం మిగులుతుంది. ఆమె భర్తకి ఈ విషయం తెలుస్తుంది. అతను ఆమెను చంపేస్తాడు. స్త్రీలపై జరిగే హింసకు ఈ గేయం సాక్ష్యం.

"బంగరులచ్చిమి ఏమెా / బందరులడ్డమ్మ / బంగరులచ్చిమినాడు / కోతకి కదిలింది" కోతలు కోసేవారితో తాటాకు బుట్ట తగిలించుకొనిపోతుంది. అనుకోని ప్రమాదం వచ్చి పడింది. అంతే ఆమె అందానికి ముగ్ధుడైన చెన్నిల్లకోయ ఆమెపై లైంగిక దాడి చేస్తాడు. అది చూసిన పిల్లవాడు ఊళ్లో దండోరా వేస్తాడు.

"బుట్టను తీసారే లచ్చిని తాకారే / అడిగింది లచ్చిమి అక్కడనే ఆగి / గొప్పించి వారికి తగునా కోయా" లచ్చిమి జీవితం పువ్వులా నలిగిపోయింది ఊరు ఊరంతా గుప్పుమంది.

కోత పనికి ఎవర్నడిగి వెళ్ళావు. ఎందుకు వెళ్లావు. భర్త పలురకాల ప్రశ్నలు వేస్తాడు. ఆమె నోటి వెంట ఏ సమాధానం రాకుండటాన్ని బట్టి కావాలని వెళ్లిందనే నిర్ధారించుకొని లచ్చిమిని చెయ్య, కాలుతో కొట్టడంవల్ల శరీరంరక్తపు ముద్దగా మారిపోతుంది. చంపొద్దని వారించినా ఆమె భర్త ఆమెను చంపి ఏట్లో పడేస్తాడు. నీటిలో పడిపోయిన లచ్చిమి చేపలకు ఆహారమైంది. తల్లికీ విషయం తెలిసి పరిగెత్తుకు వస్తుంది. తల్లి తన కుమార్తెను సుగుణాలరాశిగా చెప్తుంది.

"నా మాట దాటనిలచ్చి ఏదయ్యా / నా యింట వెలసిన లచ్చి ఏది / ఏటిలో నీటిలో ఊరుతు చేపలు / పీకుతువున్నయట ఏమిటయ్యా"

తల్లి, లచ్చిమి గుణాలను వర్ణిస్తూ అల్లుడ్ని అడుగుతుంది. మంచి ఆహారం చేసిపెడితే తిన్నావు. లచ్చిమిని చంపేటప్పుడు అవన్నీ గుర్తుకురాలేదా అని అడుగుతుంది. స్త్రీ నిస్సహాయత పురుషుని చేతిలో బానిసలా మెలుగుతున్నట్లు, ఆమెపై జరిగిన దాడులే యిందుకు నిదర్శనం.

స్త్రీలు శారీరకంగా బలవంతులుగా ఉంటారు. వారిని లొంగదీసుకోడం కోసం పురుషులు కొన్ని సాహసోపేతమైన కార్యాలు చేస్తుంటారు. స్త్రీలు పురుషులకు భయపడాలని వారికి సేవ చేయాలని, ఎక్కువ మంది పురుషుల కాంక్ష. 'కుదర్ మలకుక్కి' గేయంలో ఇద్దరు స్నేహితులు ఉదయగిరి కోటను గెలుస్తారు. ఒకరోజు అందులో ఉన్న సొమ్ముని సొంతం చేసుకోడానికి బయలుదేరతారు. దాన్ని సొంతం చేసుకోడానికి పోయే మార్గంలో ఉన్న 'కుదర్ యలకుక్కి' అనే అందగత్తెను కలుస్తారు. ఆమెపై మోహాన్ని తీర్చుకొంటారు. కుదర్‌యలకుక్కి ధైర్యాన్ని చాపుడు ఉదయునికి చెప్తాడు.

"కుదర్ మలకుక్కి దారిలో వుంది / ఎదురులేని ఆదది ఆమె / ఎవరికీ గౌరవం ఇవ్వదు ఆమె / జాపినకాలు మడవదాయె / గుమ్మము దాటి వెళ్ళటమెలా" అని చాపుడు ఉదయునితో అంటే ఆడదాని పౌరుషాన్ని క్రూరత్వాన్ని ఎవరు సహిస్తారు. అణచివేయాలి అని బదులిస్తాడు.

ఆదది చూపే క్రూరత్వాన్ని / ఆమోదించుట న్యాయమామనకు / వెళ్ళటమన్నదే నా మాట. నీ / వన్నది భీరులమాటే కదా?" పిరికివాడిలా మాట్లాడుతున్న చాపుడ్ని మందలించి, ఆమెను జయించాలని ఉదయుడంటాడు. ఇద్దరు ఆమె ఇంటికి చేరుకుంటారు. వారిని చూస్తుంది. అయినా పట్టించుకోదు ఉదయునికి కోపం వచ్చి పక్కనే ఉన్న స్తంబాన్ని పడగొడతాడు. అప్పుడు మలకుక్కి వచ్చిన వ్యక్తులను పలకరిస్తుంది. ఆమె ధైర్యాన్ని గోడ పగల గొట్టి బలహీన పరిచే ప్రయత్నం చేశారు.

నించొని, నించొని కోపం వచ్చి / ఒణుకులొచ్చిన ఉదయుడేమో / దాలుని పట్టి కత్తితోన / స్తంభాన్ని కొట్టేడది విరిగిపోయే. ఇంత బలాన్ని ప్రయోగించడం వెనుక కుక్కియమ్మను లొంగదీసుకోడం కోసమేనన్నది స్పష్టం. వారి బలం తెలుసుకున్న ఆమె వారిని 'బావ' అని సంబోధిస్తుంది.

"లేడిలా బెదిరిన కుక్కియమ్మ / నాకు తెలియదు లేదు బావల్లారా / మీరెవరేమో యిట్లా రండి / కూర్చొండి ఆదది నా పొరపాటు / బావల్లారా మీరు మన్నించండి. ఎంతో ధైర్యంగా ఉన్న ఆమె 'ఆడదాన్ని' అని తెలియక తప్పు చేశాను అనడంలో స్త్రీ బలహీనురాలని చెప్పకనే చెప్తున్నట్టు కుక్కియమ్మ అంటుంది.

కుక్కియమ్మ వారికి సకల పరిచర్యలు చేసి శారీరక సుఖాన్ని వంచుతుంది. కుక్కియమ్మ ఉదయగిరి కోటలో బంగారురోకలుందని దాన్ని తెచ్చీమని వారిని కోరుతుంది. స్త్రీలు బలవంతంగా ఉన్నా వారిని పలురకాల ఆశలు చూపి, భయాన్ని కలిగించి వంచన చేస్తున్న సంఘటనలు అనాది నుండి వున్నాయి.

అనేక మతాలున్న మనదేశంలో హిందూమతంలో స్త్రీలు కొన్ని దేవతలను ఆరాధించవచ్చని, కొన్ని దేవతలను

ఆరాధించకూడదని నియమం ఉంది. 'ఉణ్ణి యార్చ' అనే స్త్రీ పురుషులకు మాత్రమే ప్రవేశం ఉన్న అయ్యప్పస్వామిని కొలవాలని ఆశ పడుతుంది. ఇదే విషయాన్ని ఇంట్లో తెలియజేస్తుంది. సంఘనియమాలను కట్టుబాట్లను ఎదిరిస్తే శిక్షలు భయంకరంగా ఉంటాయని, స్త్రీలను వివస్త్రను చేసి అవమానించేవారని మహాభారతంలో ద్రౌపది పాత్ర ఇందుకొక ఉదాహరణ. స్త్రీలపై జరిగే శిక్ష ఎంత భయంకరంగా ఉంటుందో ఆప్తులు, తల్లిదండ్రులు ఆమెకు వివరిస్తారు.

"పట్టాడ విప్పేసి పంపుతారు / అందముచిందేటి - ఆడోళ్లయితే / అందరూ చేతులుదేసి పిల్లా / దస్తులు మెల్లగా ఊడదీసి / నగ్నరూపము చేసి పంపుతారు". ఈ విధంగా చేసినప్పుడు స్త్రీలు సంఘాన్ని ఎదిరించకుండా అణుకువగా ఉంటారని భావించే వారని తెలుస్తుంది.

దేవాలయాలు భక్తికి, భక్తుల పూజార్థం వెలసినవి. జనులందరు కలసి ఉండటానికి సాంస్కృతిక జీవనంలో ఒక భాగం దేవాలయాలు. పవిత్రస్థలమైన అపవిత్ర స్థలమైనా ఏదో ఒక వస్తువును దొంగలించి కొంతమంది జీవిస్తుంటారు. దొంగిలించిన సొమ్ముతో పలురకాల వ్యసనాలకు ఉపయోగిస్తుంటారు.

"అత్తియూరు" ఆలత్తూరు / ఎన్నో వూళ్ళముని సీపులు / డెబ్బది రెండు దుర్మార్గులని / దెబ్బకొట్టి చంపిన దేవి"

దేవత గురించి చెప్తున్న ఈ శక్తి సామార్థ్యాలు స్త్రీలకి ఉన్నాయని సూచాయగా తెలియజేస్తున్నట్టుగా సాగుతున్న క్రమంలో దొంగిలించిన సొమ్ముతో ఉన్న వ్యక్తికి ఆకు పసర్లు వేసి ఇద్దరు స్త్రీలు వశీకరణ చేసుకొంటారు.

అందమయిన పిల్లవాడు / ఎంతో డబ్బులు వున్నాడు / చేతికి ఎంతో యివ్వచ్చు డబ్బులెంతో యివ్వవచ్చు / నువ్వంటే తనకిష్టమువుంటే" పిల్ల అవ్వ పాటపాడుతుంది. అతని దగ్గర చాలా ధనం ఉంటుంది. దానికే అతన్ని వంచిస్తారు.

మందగించాలతని బుద్ధి / మందులివ్వాలతనికి / నీ వెంటే అతనుండేందుకు / మందులివ్వాలతనికి / మందులున్నాయడవిలో వెంట రారండీ అడవిలోనికి". అడవికెళ్లి ఆకులు తెచ్చి మందులు చేసి అతనికిస్తారు. అతను ధనాన్ని ఆమెకిచ్చేస్తాడు. మరునాడు అతని దగ్గర ఏమిలేదని తిరిగి పంపేస్తుంది పిల్ల అమ్మ పెద్దావిడ. అతను వెళ్లిపోతాడు. కుమార్తెకీ విషయం తెలిసి తల్లిని నిందించి అతను వెళ్లిపోయిన దారి వెంట నడచి వెళ్లి అతని కలుసుకొంటుంది. అతనే జీవితం అనుకొంటుంది. అడవిలో ఆనందంగా ఉంటుంది. అతను కలిపిచ్చిన పసరు తినడంతో కళ్లు తిరిగి కిందపడిపోతుంది. అతనికి ఆమె తల్లి చేసిన మోసానికి బదులుగా ఆమెను కూడా తిరిగి మోసం చేస్తాడు. ఈమె తల్లి చేసిన మోసానికి బలైన నీలినే చంపేస్తాడు. "ఒట్టు దేవానీకు, చేత/ పట్టలేదు మోసమయ్యా / దేవునికి తెలుసులే / ఇట్లా చేసావెందుకయ్యా" ఆమె చావుబ్రతుకుల మధ్య కొనవూపిరితో అంటుంది. చనిపోయేదాక చంపుతాడు.

"బండరాయి మరోటి తీసి / మగువ తలపై వదిలివేసి / పరుగు తీసిపోయినాడు.

అన్యాయంగా స్త్రీ బలైపోయింది. అతను ఆమెకు ఆకుపసరుపెట్టి మైకం కమ్మిన తరువాత కొండకేసి ఆమె తలను బాదుతాడు, యంతకీ చనిపోకపోతే బండరాయివేసి చంపి ఆమె మెడలోని నగలను తీసుకొని పారిపోతాడు. అతను పారిపోవడంతో గేయం ముగుస్తుంది. ఇలాంటి దారుణాలు ఎప్పటి నుండో వాడుకల్లో ఉన్నాయనటానికి 'నీలికథ' గేయం మంచి ఉదాహరణ.

స్త్రీ ఒంటరిగా ఎక్కడికిపోకూడదు. పోతే అనుకోని ప్రమాదాలు వస్తాయని కుటుంబ పెద్దలు భావిస్తారు. 'చెంగనూరు నాణీ' అన్న గేయంలో భంగానూరు నాణికి మొగపిల్లలు ఎనిమిది మంది, ఆడపిల్లలు ఐదు మంది పుడతారు. వారిని అదుపులో వుంచడానికి వారిని హింసించే శక్తులు పలుచోట్ల ఉన్నాయని ఒంటరిగా బయటకు పోవద్దని చెప్పేపాట.

పోండీలోళ్లు అందరు కలిసి కట్టేస్తారే పిల్లా
సెట్టీలోళ్ళ వీధిలో నుంచి వెళ్ళక పిల్లా
సెట్టిలు ఎనిమిది కలసి నిన్ను కట్టేస్తారే పిల్లా"

ఆ కాలంలో స్త్రీలపై అఘాయిత్యాలు జరుగుతున్న తీరుని వివరించి చెప్పడమేకాక ఆమెకు స్వేచ్ఛ లేకుండా చేయడానికి ఇంట్లోనే బంధించడానికి అయివుండవచ్చు. పోండీతోళ్లు (పోర్చుగీసు) మనదేశాన్ని పాలించే కాలానికి సంబంధించినదీ గేయం.

'మలయాళ జానపద గేయాలు' నాటి సమాజంలో స్త్రీ జీవన విధానం తీరుతెన్నులను, స్త్రీలపై జరిగే అఘాయిత్యాలు, బలవంతంగా భర్త చేతుల్లో ప్రాణాలు కోల్పోవడం వంటి సంఘటనలు హృదయాన్ని ద్రవింపచేస్తాయి. ఆకాశంలో సగం అనుభవించకనే అసువులు బాసే అబలలెందరో.... ◆

# జ్ఞాన మందిరం



పుష్పాల సూర్యకుమారి
9701973843

ఆ ఊరికి కిలోమీటరు దూరంలో చివర ఇరవై ఎకరాల స్థలంలో మామిడి తోటుంది. ఆ తోటలో సచ్చిదానందస్వామి ఆశ్రమం నిత్యం ఆధ్యాత్మిక శోభలతో కళకళలాడుతూ ఉంటుంది. ఆశ్రమం వెలసి దాదాపు పదిహేను సంవత్సరాలవుతుంది. ఆ ఆశ్రమానికి భక్తులు ఎక్కడెక్కడి నుండో దూర తీరాలనుండి స్వామిజీ మీద నమ్మకంతో, అపారమైన భక్తి ప్రపత్తులతో వచ్చి, తమకున్న సమస్యలు ఆయనకు విన్నవించుకుంటారు. స్వామిజీ వెంటనే వారికి మంత్రించిన విభూతి ఇచ్చి చిటికెడు నోట్లో వేసుకోమని ఆదేశిస్తారు. తన వద్దకొచ్చిన భక్తులకు గ్రహశాంతి హోమాలు చేయించుకోవాలని కొందరికి సలహాలిస్తుంటారు. కొందరికి వ్రతాలు చేయించుకోమని దాని యొక్క ఫలితాలు నివృత్తి చేస్తుంటారు.

స్వామిజీ పేరు ప్రఖ్యాతులు ఇతర రాష్ట్రాల్లో కూడా వ్యాపించాయి. ఇతర రాష్ట్రాల నుంచి పెద్ద పెద్ద పారిశ్రామికవేత్తలు ఆయన మీద భక్తీ, నమ్మకంతో రావడమే కాకుండా ఆశ్రమానికి పెద్ద మొత్తంలో ఫండ్స్ ఇస్తుంటారు. ఆశ్రమంలో నిత్యం వెయ్యి మందికి పైగా అన్నదానం జరుగుతుంది. ఆశ్రమ బాధ్యతలు స్వామిజీ అనుచరులు చూసుకుంటారు. ఆశ్రమానికి సంబంధించిన వివిధ రకాల పనులు ఎందరో కార్యకర్తలు చూస్తూ ఉంటారు. ఆ విధంగా స్వామిజీ సేవ చేసుకోవడం తమ పుణ్యంగా భావించి నిత్యం ఆశ్రమ కార్యక్రమాల్లో మునిగి తేలుతుంటారు.

ఆశ్రమంలో జ్ఞానమందిరం ఉంటుంది. స్వామిజీ రోజూ జ్ఞానమందిరంలో ఆధ్యాత్మిక ప్రవచనాలు చెబుతుంటారు. ఆ ఊరి స్త్రీలు భక్తి శ్రద్ధలతో ప్రవచనం వినడాన్కి రోజూ వస్తుంటారు. ప్రవచనం అయిన తరువాత ఆయన స్త్రీల చేత లలిత, విష్ణు సహస్రం చదివిస్తారు. స్త్రీలందరూ స్వామిజీని నడిచే దేవుడు అని భావించుకుంటూ ఆయన పాదాలు కడిగి నీళ్ళు శిరస్సుల మీద చల్లుకొని, పువ్వులతో పాద పూజ చేస్తారు. ఆ అవకాశం తమకెప్పుడొస్తుందాని తహతహలాడిపోతుంటారు కొందరు మహిళలు. ఆయన స్త్రీలపై అపారమైన ప్రేమ, దయ కురిపిస్తూ చిరునవ్వులు చిందిస్తూ ఆశీర్వచనాలందిస్తారు. ఆ జ్ఞాన మందిరంలోకి పురుషులకి ప్రవేశం లేదు. ఒక్క స్త్రీలు, స్వామిజీయే ప్రవేశించటానికి అర్హులు. ఆ మందిరంలో లలితాభట్టారికా అమ్మవారు కొలువై ఉంటుంది. ఆ మందిరంలో ఉన్న హాలు ఓ వంద మంది జనం కూర్చోవడానికి సరిపోతుంది.

శరన్నవరాత్రుల్లో అక్కడ చాలా వైభవోపేతంగా పూజా కార్యక్రమాలు జరుగుతాయి. ఆ పది రోజులు స్త్రీల చేత లలితా సహస్ర నామాలతో కుంకుమార్చనలు జరుపబడతాయి.

ప్రతి పౌర్ణమికి అక్కడ అమ్మవారికి పాలాభిషేకం,

కుంకుమ పూజలు జరుగుతాయి. ప్రతి పౌర్ణమినాడు కన్నెపిల్లను అందంగా అలంకరించి అమ్మవారి ఎదుట కూర్చోబెట్టి పూజలు చేస్తారు స్వామిజీ. ఆ సమయంలో కన్నెపిల్లా స్వామిజీ తప్పితే లోపల ఎవ్వరూ ఉండరాదని ఆయన ఆజ్ఞ. ఆ సమయంలో ఆ నియమాన్ని ఎవ్వరూ భంగం కలిగించరు. ఆ మందిరంలో ఒక ప్రక్కగా ఒక గది ఉంటుంది. కన్నెపిల్లను తీసుకెళ్ళి స్వామిజీ ఆ గదిలో జ్ఞానోపదేశం చేస్తారు.

* * *

ఆ ఊళ్ళో దేవకీ, ఓ పది మంది మహిళలు నిత్యం ఆశ్రమానికి స్వామిజీ ప్రవచనాలు వినడానికి వెళుతుంటారు. ప్రవచనం అయిన తరువాత ఎంతో భక్తి ప్రపత్తులతో విష్ణు, లలిత సహస్రం చదువుతారు. అన్నదానం జరుగుతున్నప్పుడు వడ్డనలో సహాయపడుతుంటారు. ఆ సేవ చేయడం గొప్ప పుణ్యంగా భావిస్తారు.

ఆ రోజు పౌర్ణమి! దేవకి తన పదహారేళ్ళ కూతురు రమ్యను అందంగా అలంకరించి ఆశ్రమానికి తీసుకొచ్చింది.

“దేవకీ! ఈ రోజు పౌర్ణమికి స్వామిజీ మీ అమ్మాయిని పూజకి తీసుకురమ్మన్నారటగా?!” అడిగింది తోటి స్త్రీ.

“అవును! మొన్న స్వామిజీ మా అమ్మాయిని చూసారట ...జ్ఞానాన్ని బోధిస్తాను పౌర్ణమికి తీసుకురమ్మని ఆజ్ఞాపించారు!” చెప్పింది.

“అదృష్టవంతురాలు మీ అమ్మాయి. స్వామిజీ చల్లని అనుగ్రహ వీక్షణాలు లభించబోతున్నాయి”! ఎంతో నమ్మకంతో అంది.

దేవకి మనసులో మురిసిపోతూ జ్ఞాన మందిరంలోకి రమ్యను తీసుకెళ్ళి అమ్మవారి ఎదుట కూర్చోబెట్టింది. స్వామిజీకి వినమ్రంగా నమస్కరించింది.

స్వామిజీ కళ్ళతో సైగ చేసారు ఆమెను బయటికి వెళ్ళమన్నట్టుగా.

రమ్యకు ఆశ్రమానికి రావడం ఇష్టంలేదు. తన తల్లి “నీకు చదువు సరిగా అబ్బడం లేదు, ఈ రోజు పౌర్ణమి, స్వామిజీ నిన్ను అమ్మవారి ఎదుట కూర్చోబెట్టి పూజించి, జ్ఞానాన్ని ప్రసాదిస్తారు! నీకు ఎనలేని జ్ఞానం వస్తుంది. ఈ అవకాశం అందరికీ రాదు. ఈ రోజు నుంచి నీకు మంచి కలుగుతుంది!” అని బలవంతం పెట్టి తీసుకొచ్చింది.

స్వామిజీ రమ్య వైపు ఒక్క క్షణం రెప్ప వేయకుండా చూసారు. పూజ ఆరంభించారు. రమ్య ముఖం గంటు పెట్టుకుని, చాలా ఇబ్బందిగా కూర్చుంది. ఈ తతంగం ఎప్పటికి ముగుస్తుందాని విసుగ్గా క్షణాలు లెక్కపెడుతోంది.

* * *

ఆ రోజు దేవకి చెల్లెలు పూర్ణ తన కూతురు లావణ్య, భర్త మోహన్‌తో వచ్చింది.

దేవకి వారికి అన్ని మర్యాదలు చేసి, ఆదరాబాదరాగా ఆశ్రమానికి బయలుదేరుతోంది.

“అక్కా! ఇంత హడావుడిగా ఎక్కడికి బయలుదేరుతున్నావు?” ప్రశ్నించింది పూర్ణ.

“ఆశ్రమానికి!” చెప్పింది.

చంద్రం “ఈ ఒక్క రోజుకీ నువ్వు ఆశ్రమానికి వెళ్ళకపోతే అక్కడ కొంపలేమీ అంటుకుపోవు...రాకరాక చెల్లెలు వచ్చిందనీ, మంచీ చెడూ మాట్లాడదామని ఇంగిత జ్ఞానం ఉందా?” చిరాగ్గా ముఖం పెట్టి అన్నాడు భార్యని.

“నా చెల్లెలు ఇంకా నాలుగు రోజులుంటుంది కదా... ఈ రోజు స్వామిజీ భాగవతంలోని గజేంద్ర మోక్షం ఘట్టం గూర్చి చెబుతారు!” అంది దేవకి.

“పూర్ణా! మీ అక్కకి మొగుడు, పిల్లలు, ఇల్లూ అక్కర్లేదు. ఆశ్రమంలోని స్వామిజీయే బ్రతుకయిపోయింది. ఒక్క రోజు స్వామిజీని చూడకుండా ఉండలేదు. మీ అక్కలాంటి ఆడాళ్ళు ఈ ఊళ్ళో చాలా మంది ఉన్నారు. వాళ్ళందరూ వంటా వార్పులు ఎప్పుడు చేస్తున్నారో తెలియదు, తెల్లవారకముందే ఆశ్రమంలోకి వాలిపోతున్నారు. ఆ స్వామిజీ మన ఊరి ఆడవాళ్ళకి ఏ మందు పామాడో తెలియదు... పడిపడి సపర్యలు చేసేస్తున్నారు!” వెటకారంగా అన్నాడు.

“బావా! అక్కని వెళ్ళనీ ...ఎవరి పిచ్చి వాళ్ళకానందం!” అంది పూర్ణ.

“అదికాదు పూర్ణా! మా చెల్లెలు కూడా ఇలాగే తయారయింది. అది కొడుకుని కూడా వెంటబెట్టుకుని ఆశ్రమానికి వెళ్ళటం మొదలుపెట్టింది. ఇప్పుడు వాడు చదువు ఎగ్గొటి స్వామిజీ సేవే పరమానందం అని అక్కడే ఉండిపోతున్నాడు ... నా బ్రతుకే స్వామిజీ అంటున్నాడు. నా చెల్లెలు భర్త ఆర్థికంగా వీక్. వీడయినా చదువుకొని ఏ ఉద్యోగమైనా చేస్తే వారి కుటుంబాన్ని ఆదుకుంటాడంటే వాడు అలా తయారయ్యాడు. నీ కొడుకు గూర్చి ఏం బాధపడకు జ్ఞానోదయాన్ని కలిగిస్తానంటున్నాడట. ఇంకేం కలిగిస్తాడు వాడికిప్పుడు ముప్పయి దాటిపోయాయి!” అక్కసుగా అన్నాడు చంద్రం.

“మీకు మొదట్నుండీ స్వామిజీ అంటే ఇష్టం లేదు!” అంది దేవకి మూతి మూడు వంకర్లు తిప్పుతూ.

“పిన్నీ! మా అమ్మకు ఆశ్రమం మీద ఉన్న ఇంట్రెస్ట్ మా

మీద లేదు. మేము ఏం తింటున్నామో ఏమో ఏదీ మా అమ్మకు పట్టదు. ఇంటిడి పని చేసి రమ్య కాలేజ్‌కి వెళుతోంది. కాలేజ్ నుంచి ఇంటికొచ్చి మళ్ళీ ఇంటి పని చేస్తుంది. తనకి చదువుకోవడానికి టైమ్ ఉండటం లేదు. అందుకే ఈ సంవత్సరం సబ్జెక్టులు తప్పింది!" అన్నాడు దేవకి కొడుకు భరత్.

"వరేయ్! తను సరిగ్గా చదవకపోవడానికి కారణం నేనా!" అంది ధుమధుమలాడుతూ.

"అవును. నువ్వే! మొన్న పౌర్ణమికి రమ్యను స్వామిజీ దగ్గరికి జ్ఞానోదయం కలిగిస్తాడని తీసుకెళ్ళావుగా...అప్పటి నుండీ తను మరీ డల్లయిపోయి దిగులుగా ఉంటోంది!" సూటిగా ప్రశ్నించాడు.

పూర్ణ, అక్కగారి వైపు తిరిగి "జ్ఞానోదయం ఏమిటి?" అడిగింది విస్మయంగా.

దేవకి విషయం చెప్పింది. "నువ్వు ఒకసారి ఆశ్రమానికి వచ్చి స్వామిజీ దర్శనం చేసుకో!" అంది.

పూర్ణ "స్వామిజీ మహిమలు అంత గొప్పవా?" ఆశ్చర్యంగా అడిగింది.

"అవును! ఇతర రాష్ట్రాల నుంచి ఎందరో భక్తులు వస్తుంటారు. తమకు వచ్చిన కష్టాలు చెప్పుకుంటారు. వాటి నివారణకు ఉపాయాలు చెబుతారు. ఎందరో రోగులు వస్తుంటారు ...ఎటువంటి దీర్ఘకాలం రోగాలయినా ఆయన విభూతితో నయం చేసేస్తారు. మన లావణ్యకు వంట్లో బాగాలేదని చెప్పావుగా ...తీసుకెళదాము పద!" అంది దేవకి ఉత్సాహపరుస్తూ.

"అవునక్కా! కడుపులో మంట అంటోంది. ఎన్ని మందులు వాడినా తగ్గడం లేదు. స్వామిజీ చేతి విభూతి మహిమతో లావణ్య ఆరోగ్యం బాగుపడితే మంచిదే కదా! పద వెళదాము!" అంటూ అక్క వెంట దారి తీసింది పూర్ణ కూతుర్ని వెంటబెట్టుకుని.

"పిన్నీ! నువ్వు కూడా స్వామిజీ మాయలో పడిపోకు. అక్కడికెళ్ళిన స్త్రీలు మంత్రించిన బొమ్మల్లా ఆశ్రమానికి అతుక్కుపోతున్నారు" అన్నాడు వెళుతున్న వాళ్ళ వైపు విస్మయంగా చూస్తూ.

* * *

ఆ రోజు కార్తీక పౌర్ణమి కావటంతో ఆశ్రమం అంతా కిక్కిరిసి భక్తులతో నిండిపోయింది. దేవకి, పూర్ణ, లావణ్య వచ్చారు.

"ఈ రోజు పౌర్ణమి కదా ...అమ్మవారి పూజకు ప్రీతయిన కన్నె ఎవరో!" అని ఎవరో అంటున్నారు.

దేవకి "ఇదిగో! ఈ అమ్మాయి. నా చెల్లెలు కూతురు లావణ్య. స్వామిజీ రెండు రోజుల క్రితం చూసి పౌర్ణమికి ఈ అమ్మాయిని కన్నె పూజకు కూర్చోబెట్టండని ఆదేశించారు!" అంటూ ఆనందంతో ఉప్పొంగిపోతూ లావణ్యను చూపించింది.

"మీరు చాలా అదృష్టవంతులు. మేం ఎన్నాళ్ళ నుండో చూస్తున్నాము...మా అమ్మాయిని అమ్మవారి పూజకు పంపాలని మాకు ఆ అవకాశం రాలేదు!" అంది ఓ మహిళ.

పూర్ణ మనసు చాలా సంతోషంతో నిండిపోయింది. ఈ రోజుతో తన కూతురి భవిష్యత్తు మారిపోతుంది. తన ఆరోగ్యం బాగుపడుతుంది తనను పట్టుకున్న గ్రహాల నివారణకు స్వామిజీ పూజ కుడా చేస్తారట. స్వామిజీ అమ్మవారి పూజకు తన కూతుర్నే ఎన్నుకొనడం తన అదృష్టమే!" లోలోన ఉబ్బితబ్బిబయిపోయింది.

ఆశ్రమవాసి పెద్ద ముత్తయిదువ విశాలాక్షి వచ్చి "దేవకీ! అమ్మ పూజకు కన్నెను తీసుకురా ...స్వామిజీ వేచి ఉన్నారు!" అంటూ చెప్పింది.

దేవకి లావణ్యను జ్ఞానమందిరంలోకి తీసుకెళ్ళి అమ్మవారి ఎదుట కూర్చోబెట్టింది.

లావణ్య బెరుకుగా చూస్తూ "పెద్దమ్మా! నాకు భయం వేస్తోంది!" అంది.

"ఛ! తప్పు అలా అనకూడదు. స్వామిజీ దేవుడు. నీలో ఉన్న అనారోగ్యాన్ని పోగొడతాడు. నీకు మంచి చేస్తారు తల్లీ!" అని బుజ్జగించి బయటికి వచ్చింది.

జ్ఞానమందిరం బయట మోహన్, పూర్ణా, దేవకి కూర్చుని ఉన్నారు. రెండు గంటలు గడిచింది.

"వదినగారూ! చాలా టైమ్ అయింది. పూజ ఇంతసేపా? లావణ్య ఇంకా రాలేదు!" కంగారుగా అడిగాడు మోహన్.

"వస్తుందండి! పూజ పూర్తవ్వాలి కదా! స్వామిజీ మంత్రోపదేశం చేస్తారు!" అంది.

సరిగ్గా అప్పుడు లావణ్య బయటికి వచ్చింది. ఎండిన తోటకూర కాడలా వాలిపోయి వుంది. మోహన్ కంగారుపడ్డాడు.

లావణ్య పరిగెత్తుకుంటూ వచ్చి తండ్రిని వాటేసుకుని బోరున ఏడ్వసాగింది.

అందరూ బిత్తరపోయి చూడసాగారు.

"ఏమైంది తల్లీ!" ఆదుర్దాగా అడిగాడు.

"నాన్నా ...నాన్నా! ఆ ...స్వామీజీ ...!" అంటూ ఆగి

బావురుమంది.

"ఏమైంది? ఏడ్వకు? విషయం చెప్పు!" అన్నాడు ఆందోళనగా.

"నన్ను ...నన్ను ...ఆ స్వామీజీ ...బలవంతం పెట్టాడు!"

"ఏంటి వివరంగా చెప్పు!" పూర్ణ రెట్టించి అడిగింది.

"అమ్మా! ఆ స్వామీజీ ...నాపై అత్యాచారం చేసాడు...!" చెప్పింది వెక్కిళ్ళు పెడుతూ.

అందరూ పిడుగుపడ్డట్టు కొయ్యబొమ్మల్లా అయిపోయారు.

మోహన్ తేరుకుని "ఏంటి వాడు నీపై అత్యాచారం చేసాడా...వాడు ఇంత పాపాత్ముడా!" కోపంతో ఊగిపోయాడు. దవడ కండరాలు ఎరుపెక్కాయి...పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

పూర్ణ కూతుర్ని దగ్గరకు తీసుకుని "ఏం జరిగిందో సరిగ్గా చెప్పు తల్లీ!" ఓదారుస్తూ అడిగింది.

"నన్ను ఓ గదిలోకి తీసుకెళ్ళి అత్యాచారం చేసాడు. ఎంత బ్రతిమాలినా ఏడ్చినా వినలేదు. నా నగ్న శరీరాన్ని సెల్‌ఫోన్‌లో చిత్రీకరించి, ఈ విషయాన్ని బయటికి ఎవరికైనా చెప్పావా నెట్‌లో పెట్టేస్తా!" అని బెదిరించాడు! దీనంగా చెప్పింది.

పూర్ణ కోపంతో ఊగిపోతూ "ఈ దొంగ బాబా కామ లీలలు ఇప్పుడే అందరికీ చెప్పేస్తాను!" అంటూ ముందుకు కదలబోయింది.

మోహన్ ఆమెను వారిస్తూ "పూర్ణా! ఈ పాపాత్ముడి పాపం పండింది. వాడికి బుద్ధి మనం కాదు పోలీసులు చెప్పాలి. ఇంటికి వెళదాము పద. ఇలాంటి దొంగ బాబాల, బూటకపు బాబాల నాటకాలు మీ అక్కలాంటి మూర్ఖుల వల్ల సాగుతున్నాయి. ఇక్కడ జనం బాబా మాయలో పడిపోయారు. మనం ఎన్ని చెప్పినా నమ్మరు. వాళ్ళ కళ్ళు ఎలా తెరిపించాలో ఆలోచిద్దాము!" అంటూ ఇంటికి దారి తీసారు.

దేవకి దిమ్మెరపోయి చూడసాగింది. నోటమాట రావటంలేదు. తన మూలంగా తన చెల్లెలు కూతురి మానం బుగ్గిపాలయి పోయింది. ఇంత పాపాత్ముడా స్వామీజీ. "ఓరి దుర్మార్గుడా! ఇంత రాక్షసత్వానికి ఒడిగడతావా? నిన్ను దేవుడుగా నమ్మి పూజించాము. కన్నె పిల్లల పూజంటూ ఆ జగన్మాత అమ్మవారినే మోసగించి ఇంత నాటకం ఆడి కామలీలలు సాగిస్తున్నావా? నిన్ను ఆ తల్లి వదలదు...నరకాన్ని చవి చూస్తావు!" అనుకుంటూ ఇంటి దారి పట్టింది.

మోహన్ ఇంట్లో అందరికి విషయం వివరించాడు.

రమ్య "పిన్నీ! ఆ స్వామీజీ కామానికి లావణ్యే కాదు నేనూ బలైపోయాను. ఈ విషయం బయటపెడితే ...నీ నగ్న శరీరాన్ని వీడియో తీసాను... నెట్‌లో పెడతాను అని బెదిరించాడు. భయపడి మౌనంగా భరిస్తూ వచ్చాను!" చెప్పి ఏడ్చింది.

దేవకి "ఓరి పాపాత్ముడా! నా కూతుర్ని కూడా పాడు చేసావా? నిన్ను గుడ్డిగా నమ్మినందుకు ఇంత మోసం చేస్తావా? అమాయక ఆడపిల్లల బ్రతుకులతో ఆడుకుంటావురా... ఆ భగవంతుడు నువ్వు బ్రతికుండగానే నీకు నరకం చూపిస్తాడురా!" అంటూ లబోదిబోమంటూ ఏడ్చింది.

చంద్రం భార్యను చెడామడా తిట్టాడు. "ఎందుకే ఏడుస్తావు? నీ మూలంగా ఇద్దరి ఆడ కూతుళ్ళు మానాలు పోగొట్టుకున్నారు. నీలాంటి మూఢ నమ్మకస్తుల వల్లనే బాబాలు భక్తి అవతారాలు ఎత్తి మాయ వేషాలు వేసి తమని తాము దేముడిగా ప్రకటించుకుంటున్నారు. జనం అమాయకత్వాన్ని టానిక్‌లా వాడుకుంటున్నారు!" కోపంగా అన్నాడు.

"అన్నయ్యా! మన ఊళ్ళో చాలా మంది అమ్మాయిలతో కోరిక తీర్చుకుంటున్నాడు ఆ స్వామీజీ. నన్ను బెదిరించినట్టే వాళ్ళని బెదిరిస్తున్నాడు!" చెప్పింది రమ్య.

"పోలీస్ కంప్లయింట్ ఇద్దాము!" అన్నాడు భరత్ ఆవేశంతో ఊగిపోతూ.

"కంగారుపడకండి! మన ఊరి పెద్దతో ఈ విషయం చర్చిద్దాము! ఆయన్ను తీసుకొస్తాను!" అని చంద్రం వెళ్ళి పది నిమిషాల్లో ఊరి పెద్దని వెంటబెట్టుకొచ్చాడు.

ఆ ఊరి పెద్ద వేణుగోపాలరావుగారు విషయం అంతా విని "మీరేం కంగారుపడకండి! ఈ విషయం పోలీసులకు చెబితే సాక్ష్యాలు అడుగుతారు. అందుకనీ మనం ఆలోచించి ఆ స్వామీజీని రెడ్‌హేండెడ్‌గా పట్టుకుని పోలీసులకి అప్పచెప్పుదాము!" అన్నారు.

"అయితే ఏం చేద్దామంటారు?" ఆదుర్దాగా అడిగాడు చంద్రం.

"వచ్చే పౌర్ణమికి కన్నె పూజకు అమ్మాయిని పంపమంటాడుగా...మనమే ఆ అమ్మాయిని ఏర్పాటు చేసి కథ నడిపిద్దాము వాడి కామలీలలు ఆశ్రమ నిర్వాహకులైన కార్యకర్తలకు, ఊరి జనాల కళ్ళకు ప్రత్యక్షంగా చూపిద్దాము. దానితో ఆ దుర్మార్గుడు పట్టుబడతాడు!" అంటూ ఎవరికీ తెలియకుండా దానికి సంబంధించిన కొన్ని రహస్య ఏర్పాట్లు వాళ్ళముందుంచారు. అందరూ విని దానికి ఆమోదించి పౌర్ణమి రాక కోసం వేచి ఉన్నారు.

* * *

అందరూ చూస్తుండగానే పౌర్ణమి వచ్చింది. స్వామీజీ జ్ఞాన మందిరంలో అమ్మవారికి పూజలు నిర్వహిస్తున్నారు.

కన్నె పూజకు అమ్మాయిని తీసుకురమ్మని దేవకికి కబురు వచ్చింది. దేవకి గుండెల్లో పొంగుతున్న అవమానం, కోపం, దుఃఖం దిగమింగుకుని కన్నెను తీసుకెళ్ళి అమ్మవారి ఎదుట కూర్చోబెట్టి, చేతులెత్తి అమ్మవారికి నమస్కరించి "అమ్మా! లలితా భట్టారికా! నిన్ను ఎప్పుడూ నేను ఏ కోరికలూ కోరకుండా పూజించాను. కానీ, ఈ రోజు కోరుతున్నాను తల్లీ ... ఈ పాపాత్ముడు స్వామీజీని శిక్షించు ... ఈ దుర్మార్గుడు నిన్ను అడ్డుపెట్టుకుని కన్నెల మానాలను దోచుకుంటున్నాడు. ఈ రోజుతో వీడి పాపం పండిపోవాలి... వీడి కామలీలలు బయటపెట్టు. అందరి చేత దూషించబడాలి ...!" అంటూ అర్థించి బయటికి వచ్చేసింది. గంట గడిచింది భరత్ ఆ ఊరి యువకులు పోలీసులను వెంటబెట్టుకుని స్వామీజీ జ్ఞానమందిరంలోకి దూసుకెళ్ళారు. స్వామీజీ అనుచరులు అడ్డుపడ్డా వాళ్ళు ఆగలేదు. ఏం జరగబోతుందో తెలియక అందరికీ అయోమయంగా ఉంది. ఆ మందిరానికి ఒక ప్రక్కగా ఉన్న గది తలుపులు తట్టారు. తెరుచుకోలేదు. గది తలుపులు గట్టిగా ఒక్క తోపు తోసారు బలంగా ఉన్న యువకులు. సుడిగాలిలా దూసుకుంటూ లోపలకు ప్రవేశించారు.

ఈ హఠాత్ పరిణామానికి స్వామీజీ బిత్తరపోయి, ఏమి ఎరగనట్టు "ఏంటి? ఇలా వచ్చారు? ఇక్కడికి రాకూడదని తెలియదా?" ప్రశ్నించాడు కోపంగా.

"ఇక ఆపరా! నీ నాటకం. నీ కామ లీలలు అందరికీ తెలిసిపోయాయి!" భరత్ ఆవేశంగా అరిచాడు.

"అర్థం లేకుండా మాట్లాడకండి! ఇక్కడ కన్నె పూజ జరుగుతోంది!" ఏదో చెప్పబోయాడు.

"ఛ! నోరుమూయ్యరా! కన్నె పూజ పేరు చెప్పి కన్నె పిల్లల మానాలు దోచుకుంటున్నావు! ఇప్పుడే నీ కామలీలలు అందరికి చూపిస్తాను!" అంటూ సీ సీ కెమెరా ఫుటేజ్ చూపించాడు. అంతే స్వామీజీ ఆ అమ్మాయిని కామంతో కౌగలించుకోవడం, ఆ అమ్మాయిని ముఖమంతా ముద్దులు పెట్టుకోవడం ... కోరికలతో చెలరేగిపోతున్నాడు. ఆ అమాయకురాలు అతడికి అందకుండా దూరంగా పరిగెడుతోంది. ఆమెను బుజ్జగించి దగ్గరకు లాక్కొంటున్నాడు. స్వామిజీ రాసలీలలు చూసి అందరూ కొయ్యబొమ్మలైపోయారు. కొందరు నానారకాల తిట్లతో ఈసడించుకున్నారు. ఆడవాళ్ళయితే స్వామీజీని నోటికొచ్చిన శాపనార్థాలు పెడుతూ ముఖం మీద ఉమ్మేసారు.

"ఇన్స్పెక్టర్ గారూ! చూసారుగా వీడి కామలీలలు అరెస్టు చెయ్యండి! ఈ బూటకపు గురువు ఘోరాలు, నేరాలు ప్రత్యక్షంగా కనిపిస్తున్నాయిగా ... ఎందరో ఆడపిల్లలను "కన్నె పూజ" పేరు చెప్పి రప్పించుకుని ఇలా కామం తీర్చుకుంటున్నాడు. భక్తి విశ్వాసాల మత్తు మందు చల్లి ఆడవాళ్ళని తియ్యని మాటలతో చేరదీస్తాడు. ఇంత హేయమైన ప్రవృత్తి కలిగిన ఈ పాపాత్ముడికి జీవిత ఖైదు శిక్ష విధించాలి!" ఆవేశంతో ఊగిపోతూ తీక్షణంగా అన్నాడు భరత్.

"నకిలీ స్వామీజీకి శిక్షపడాలి! బూటకపు స్వామీజీకి శిక్షపడాలి!" యువకులు ఏక కంఠంతో కోపంగా అరవసాగారు.

పోలీసులు స్వామీజీ రెండు చేతులకి సంకెళ్ళు వేసి తీసుకెళుతుంటే అతడి అనుచరులు చేతలుడిగి చూస్తూ ముక్కు మీద వేలు వేసుకున్నారు. స్వామీజీ కళ్ళల్లో నెత్తురు చుక్క లేదు. ముఖం అవమానంతో మాడిపోయింది.

ఆ ఊరి పెద్ద "బాబాలను గుడ్డిగా నమ్మే అమాయకులున్నంత వరకూ ఇలాంటి నకిలీ స్వామీజీలు పుడుతూనే ఉంటారు. ఆధ్యాత్మిక గురువులుగా కొత్త కొత్త అవతారాలెత్తి కోట్లు సంపాదించి, అమ్మాయిలతో కోరికలు తీర్చుకునే ఎందరో నకిలీ స్వామీజీలున్నారు నేటి సమాజంలో. ముందు జనం మారాలి. ఏది మంచో ఏది చెడో తెలుసుకోవాలి. ఇటువంటి దొంగ స్వామీజీలను తెలుసుకోవాలి. ఇటువంటి దొంగ స్వామీజీలను పోషిస్తోంది మూఢనమ్మకాలతో ఉన్న జనమే. వీళ్ళ మోసపూరిత చరిత్ర తెలిసినా గుడ్డిగా నమ్మేస్తారు కొందరు మూర్ఖులు. జనం పిచ్చి నమ్మకం అలాంటిది. ముందు జనంలో ఉన్న మూఢ విశ్వాసాలు పోవాలి!" భరత్ ఆవేశంగా అన్నాడు. ఆ ఊరి పెద్దాయన "ఇటువంటి నకిలీ గురువుల మోసపూరిత ముసుగులు తొలగించి వాళ్ళ గుట్టురట్టు చేసి బుద్ధి చెప్పగల సత్తా మీలాంటి యువకులకే ఉంది. కష్టసాధ్యాలను, సుసాధ్యం చేసి చూపగలరు మీలాంటి యువకులు. మీరు నవసమాజ నిర్మాణ కర్తలు!" నేనిచ్చింది ఆలోచనే కాని, మీరు ఎంతో పకడ్బంధీగా కార్య రూపం దాల్చి, ఆశ్రమంలో ఉన్నటువంటి వ్యక్తులకు ఎవ్వరికీ అనుమానం కలుగకుండా ఎంతో తెలివిగా సీ సీ కెమెరాలు అమర్చి ఆ దుర్మార్గుడ్ని రెడ్‌హేండెడ్‌గా పట్టుకోగలిగారు... నిజంగా మీ కార్యదీక్షకు మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను!" అంటూ ఆ ఊరి యువకుల భుజాల మీద చేతులతో తట్టారు ఆత్మీయంగా. వారి ముఖాల్లో కొత్త ఉత్తేజం వెల్లివిరిసింది. గుండెలు విజయ గర్వంతో ఉప్పొంగాయి. ◆



# యువకవుల కవితాచైతన్యం - కొన్ని నిర్దిష్టాంశాలు

- అద్దేపల్లి రామమోహన రావు

యువతరానికీ, కవిత్వానికీ గల సంబంధాన్ని ఆలోచించినప్పుడు, కొన్ని విషయాలు ఆనందం కలిగిస్తై. మరికొన్ని బాధ కలిగిస్తై. ఆనందం కలిగించే విషయాల్లో మొదటిది. ఈనాడు కవిత్వం రాద్దామనే ప్రేరణ గలవారిలో సామాజిక చైతన్యం బాగా ఉంది. అదివరకు కంటే ఈనాడు సమాజాన్ని అవగాహన చేసుకునే మాధ్యమాలు విపరీతంగా పెరిగిపోయినై. అవన్నీ ఇంట్లో కూర్చున్న వారి దగ్గరకే నేరుగా వచ్చేస్తున్నై. యువతరానికి తప్పకుండా ఆదర్శ సమాజం సహజంగా వారి రక్త వేగంలో ఉంటుంది. సమాజాన్ని మార్చాలనే తపన కూడా విశేషంగా ఉంటుంది. అంతేగాక, సమాజంలో సుఖాలు పొందే వారికంటే, నిత్యదుఃఖితుల చరిత్రలే వారిని కదిలిస్తై. ఈ కారణంగా ఇవన్నీ వారి కవితా వస్తువులౌతై. అసలు, సమాజ వైరుధ్యాలే కొంతమందిని కవులుగా మారుస్తున్నై అనడం కూడా అతిశయోక్తి కాదు. సామాజికమైన విషయం మాత్రమేకాదు, వైయక్తికమైన, ఆత్మాశ్రయమైన భావాలకు కూడా వారి అంతరంగం నిత్య చలనశీలంగా ఉంటుంది. అందువల్ల అసంఖ్యాకంగా కవుల సంఖ్య పెరగడం సంతోషం కలిగించే అంశం.

రెండోది ఈనాడు, గుర్తింపు పొందాలనే కోరిక కూడా బలీయంగా ఉంది. ఇది ఉండడం ఏమీ తప్పుకాదు. ఎందుకంటే 'యశోవామృత్యుర్వా' అనే నానుడి ప్రాచీన సాహిత్యం దగ్గర నుండి ఉన్నదే. ఐతే ఈ రోజుల్లో సాంకేతికమైన అభివృద్ధి వలన, కీర్తిపొందే మార్గాలకి అడ్డదారులు కూడా చాలా ఏర్పడినై. వాటిని వినియోగించుకోవడం కూడా విమర్శించదగినది కాదు. ఐతే, కొంతగా వెలుగులోకి రాగానే, నేను చాలా ఎదిగిపోయాననుకోవడం, కొంత అహంకారం కూడా పెంచుకోవడం, కొంతమందిలో జరుగుతుంది. ఒకప్పుడు, కవి, తనను పెద్దవాళ్ళు మెచ్చుకుంటేగాని, లేదా పదిమంది మంచికవి అని చెప్పుకుంటేగాని, కవిని అనుకోవడానికి భయపడేవాడు. 'భారతి'లాటి పత్రికలో ఒక కవిత రావడమనేది ప్రామాణికంగా ఉండేది. ఇప్పుడు పత్రికలు అసంఖ్యాకంగా పెరగడంతో, రచనా ప్రమాణ నిర్ణయం, కలగాపులగమైపోయింది. అదీగాక సన్మానాలు, అవార్డులు లెక్కలేకుండా పెరిగిపోయాయి. ఇది కూడా ఎవరితృష్ణ వారిది అనే సమదృష్టితోనే చూడవచ్చు. కాని, అహంకారం పెంచుకోవడం, తన భావాలకు దగ్గరగాలేని వాళ్ళందరికీ ఏమీ తెలియదనుకోవడం, ఎవర్నైనా తిట్టి, నేను ఖండితంగా చెప్పగలనని చాటుకోవడం - ఇలాటివన్నీ దుర్లక్షణాలే. మనిషిలోని 'ప్రతికూల భావ సంపద'కి నిదర్శనాలే,

ఇంకొంచెం గట్టిగా చెప్పాలంటే అమానుష లక్షణాలే. అదృష్టవశాత్తు, సమాజంలో మానవులు ఒకరితో ఒకరి అవసరాలకి బాగా దగ్గిరికి రావడంతో, ఇలాటి ప్రతికూలాంశాలు చాలావరకు తగ్గినై అని చెప్పవచ్చు.

మూడోది, చాలామంది తమలోని చైతన్యాన్ని పెంచుకునే ప్రయత్నం చెయ్యడంలేదు. కవితా నిర్మాణ పద్ధతులు బాగా తెలుసుకోవాలి. ఇంకా గొప్ప రచనలు చెయ్యాలి అనే తపన పెంచుకోవడం లేదు. ఒక గొప్ప ప్రేరణ అనేది అందరికీ ఒకే రకంగా ఉండదన్నది యదార్థమే. ఒక్కొక్క కళలో, విద్య, ఒక్కొక్కరు అందుకున్న శిఖరాలు అందరూ అందుకోలేకపోవచ్చు. 'అలా అందుకో లేకపోతే మునిగి పోయిందేమీ లేదు. కవి కాకపోతేగాని, మరొకరు కాకపోతేగాని, ప్రభుత్వం జైల్లో పెట్టదు; ఉరి తియ్యదు. ఏ ప్రతిభా లేకపోయినా మనిషి మనిషిగా బతకడం కంటే గొప్ప విషయం లేనే లేదు. కాని, ఏదైనా విషయంలో ఒకరికి ప్రేరణ ఉంటే, దాన్ని తన శక్తి కొద్దీ వికసింప జేసుకునే మార్గాలు అనేకంగా ఉన్నై. అలా చాలా తక్కువ స్థాయిలో ప్రారంభించి, పట్టుదలతో లేదా మిగిలిన విషయాలకంటే, తన ప్రేరణను విస్తృతం చేసుకోవాలనే నిరంతర దీక్షతో, క్రమంగా ఎదిగినవారు, నాకు వందల మంది తెలుసు, వారిని మొదట్లోనే నిరుత్సాహపరిస్తే, ఇంక వారు ఎదిగే ప్రశ్నేలేదు. ఈ విధంగా ఇంకొకరికి ప్రేరణ కలిగించడం ఒక సామాజిక బాధ్యత, ప్రపంచంలో నేనొక్కణ్ణే ఉన్నాననుకోవడం, ఎవర్ని తిట్టడానికైనా నాకు హక్కు ఉందనుకోవడం ఒక సామాజిక అనైతికత, తనకు నచ్చనిది నచ్చలేదని ఎవరైనా చెప్పవచ్చు; కాని దానికొక పద్ధతి ఉండాలి.

కవిగా ఎదగ దలచినవారు, చెయ్యవలసిన పనులు ముఖ్యంగా మూడు ఉన్నై, మొదటిది ఒక సామాజిక వైరుధ్యాన్ని గాని, లేక మరో అంశాన్ని గాని గమనించినపుడు దాని మూలకారణాల్ని అన్వేషించాలి. ఉదాహరణకి 'మనిషి స్వార్థపరుడు; పంచభూతాల్నీ కలుషితం చేస్తున్నాడు' అనడం మామూలు విషయం. కాని దానికి కారణమైన ఆర్థిక, సాంస్కృతికాది అంశాల్ని తెలుసుకుని, దోషం ఎవరిదో, ఎటువంటి వ్యవస్థదో కనిపెట్టడం, లోతైన విషయం. అందుకోసం 'పుస్తక పఠనం, అధ్యయనం' చాలా ముఖ్యం వాతావరణ కాలుష్య విషయమే కాదు, ఏ విషయమైనా అంతే, అది సామాజికమే కావచ్చు; అత్మాశ్రయమే కావచ్చు.

రెండోది, మరీ ముఖ్యమైనది, ఇది కొంతమందికే వర్తిస్తుంది. చాలామంది యితరుల కవితలు ఆసక్తిగా చదవరు. అసలు చదవని వాళ్ళు కూడా ఉంటారు. లేదా తమ భావాలు గల వాళ్ళవి మాత్రమే చదువుతారు. లేదా ఎరుగున్న వాళ్ళవీ, తమవి చదువమని 'మెసేజి' ఇచ్చిన వారివి మాత్రమే చదువుతారు, తమ అభిప్రాయం చెప్పడానికి. అలా కాకుండా, కవిత్వాన్ని కవిత్వం కోసమే చదవాలి. అందువల్ల అంతరంగ ప్రేరణ విస్తృతమౌతుంది. మనకి నచ్చిన అంశాలు తీసుకోవడం, నచ్చనివి వదిలెయ్యడం వేరే విషయం.

మూడోది, స్థాయి పెంచుకోవడంలో కొన్ని ప్రమాణాలు పెంచుకోవాలి. అందులో ఒకటి మాత్రమే చెప్తాను. మరికొన్ని ఊహించుకోవచ్చు. ఈనాడు, ఎన్నో పత్రికలు వస్తున్నై. మంచి రచయితలు పత్రికల్లో పనిచేస్తున్నారు. అందువల్ల, ఒక సంఘటన జరిగినప్పుడు, ప్రజల మనస్సుల్ని ఆకర్షించే శైలిలో వార్తలు, మిగిలిన విషయాలు రాస్తున్నారు. మంచి భాషను ఉపయోగిస్తున్నారు. ఆ మాత్రపు స్థాయిలోనో, అంతకంటే తక్కువగానో రాసే కవులు చాలామంది ఉన్నారు. అంతకంటే ఎక్కువ స్థాయిలోకి వెళ్ళి, క్రమంగా యింకా పరిశ్రమించే ప్రయత్నాలు కవులు చెయ్యాలి. ఇందుకొక మంచి మార్గం ఏమిటంటే, ఒక కవి పుస్తకం చదువుతున్నప్పుడు, మనకి నచ్చిన వాక్యాలు, నచ్చని వాక్యాలు గొప్పగా అనిపించిన పంక్తులు, అసలు బాగా లేని పంక్తులు గుర్తించి క్రింద గీతలు పెట్టుకోవాలి. అలా అనిపించడానికి కారణాలు ఆలోచించాలి. వేరే వారితో కలిసి చర్చిస్తే మరీ మంచిది. బాగా తెలిసిన వారి అభిప్రాయాలు సేకరిస్తే అంతకంటే మంచిది. ఇలా ఒక స్థాయి నుండి మరో స్థాయికి కవులు తప్పకుండా ప్రయాణం చేస్తారు. అసలు కవిత్వాన్ని, తన జీవితంతో ముడిపడిన ప్రయాణంగానే భావించాలి. ప్రత్యేకతగానో, కీర్తి కిరీటంగానో భావించరాదు. అది నీ చైతన్యంలోని అనివార్య భాగం కావాలి. 'ఎడారి వసంతం' అనే కవితలో ఇలా రాశాను.

'కవిత్వం ఒక నిరంతర యాత్ర
అక్షరం నీ గుండెలోతుల్లోని రక్తపాత్ర'
సమాజమే నీ చిరునామా అయినప్పుడు
కన్నీటి తడి, ఆరని జీవన కార్యమౌతుంది'

కష్టపడకుండా, కిరీటాలు పొందే వక్రమార్గాలు ఈ రోజుల్లో చాలా ఉన్నై. ఆ జోలికిపోవడం, సామాజికోన్నతికి కారణం కావచ్చుగాని, ఆత్మోద్ధరణకి మాత్రం ఆటంకమే ఔతుంది.

కవిత్వంలో వస్తు శిల్పాన్ని గూర్చి ఆలోచించినప్పుడు,

ఒకే వస్తువుపై అనేక వేలమంది రాస్తారు. పూర్వకాలంలో ఒకే కథని అనేకమంది రాసినట్లు. కాని, అనేక కవితల్లోంచి, ఒక కవిత విశిష్టంగా నిలబడడానికి అందులో ఉన్న శిల్పమే కారణం. ఇది శిల్పవాదమూ కాదు; వస్తువే కావాలనడం సమగ్ర వాదమూ కాదు. వస్తు శిల్పాల సరైన సమ్మేళనమే ఒక కవితని ఉత్తమ కవిత చేస్తుంది. శిల్పానికి అనేకానేకమైన కోణాలుంటై. ఏ దేశానికైనా, ఏ కాలానికైనా, గొప్పకవిత్వమంతటినీ అధ్యయనం చేసే ప్రయత్నం చేయాలి. దాన్ని రక్తంలోకి తీసుకునే స్పృహను పెంచుకోవాలి. అప్పుడు మాత్రమే, ఒక వస్తువుని, ఉన్నతంగా, భావభరితంగా చెప్పే నేర్పు సాధ్యమౌతుంది. ఈ విషయంలో ఈనాటి యువకవులు చాలామందికి స్పష్టమైన అవగాహన లేదు. ఇందుకై కృషి చెయ్యవలసిన అవసరం ఎంతగానో వుంది.

యువకవులకు (అందరు కవులకూ) అత్యంత ఆవశ్యమైన నాలుగు ప్రధానాంశాల్ని, కొద్దిపాటి వివరణతో చెప్పదలచాను.

**సమకాలీనత**

సమకాలీనత – అంటే, కవి, తాను నివసించే కాలంలో తనలో, తన సమాజంలో, ఉన్న లక్షణాలతో, సమాంతరంగా జీవించడం – ఆ జీవితాన్ని తన కవితల్లో ప్రతిబింబింప చెయ్యడం. కేవలం ప్రతిబింబింప చేయ్యడం మాత్రమే కాదు. ముందు ఏవి అనుకూలాంశాలు, ఏవి ప్రతికూలాంశాలు అన్న వివేచన కవికి ఉండాలి. దేని దృష్ట్యా అనుకూలం, ప్రతికూలం అంటే, ఏది వ్యవస్థను భవిష్యత్ కాలంలో బాగుచేస్తుందో అది అనుకూలం. ఏది వ్యవస్థకు ఆపదతెచ్చి పెడుతుందో అది ప్రతికూలం. ఒకనాటి అనుకూలత, ఈనాడు ప్రతికూలం కూడా కావచ్చు. అందుకే తన ముందు కాలానికి, సంబంధించిన అంశాల్ని, ఈనాడు అవసరమన్నట్లుగా చెప్తే, అక్కడ సమకాలీనత దెబ్బతిన్నట్లే. అదివరకటి కవుల మీద, ఆనాటి అంశాల్ని బలంగా చెప్పారు కాబట్టి, గొప్ప కవులుగా ప్రశంసించి, వారిలో కావలసినవి గ్రహించి, మిగిలినవి ఇప్పటి కాలం దృష్టితో చూడాలి. ఇది ఎంతటి మహాకవికైనా అన్వయిస్తుంది. ఉదాహరణకి కొన్ని ఉద్యమాలు కాలాన్ని బట్టి ప్రధానాంశాలు ఔతై. కాని వ్యవస్థ మారుతుంటే, అనేక మార్పులు వస్తై. కొత్త అంశాలు కలుస్తై. ఇవన్నీ గమనిస్తేనే ఆ కవి సమకాలీనత గల వాడైతాడు. ఫలానా కవి మనకి చాలా యిష్టం కాబట్టి, ఆ అంశాల్ని అలాగే ఈనాడూ రాయాలనుకుంటే అది 'అసమకాలీనత' ఔతుంది. ఈ సమకాలీనతలో రెండంశాలు ఉన్నై. ఒకటి వస్తు సంబంధి; మరొకటి శిల్ప సంబంధి. శిల్పాన్ని ఏ కాలంలో, ఏ దేశపు మహాకవుల నుండైనా గ్రహించవచ్చు. (కొన్ని మార్పులు తప్పనిసరిగా గమనించాలి. ఉదాహరణకు పూర్వం ఎంత లయబద్ధత ప్రదర్శించిన కవుల్నైనా అనుసరించి, ఈనాడు లయబద్ధంగా రాస్తే, అది వచన కవితారీతిని బలపరచదు. అలాగే సంస్కృత భాష, సమాసాలు, అలంకారాలు మొ॥ అన్ని అంశాల్లో మార్పుల్ని గమనించవలసి ఉంటుంది) వస్తువైతే, వ్యవస్థలో మార్పులు చాలా త్వరగా వస్తై కాబట్టి, ఎప్పటికప్పుడు కవి తన కాలాన్ని వెయ్యి కళ్ళతో కనిపెట్టాలి. ఉదాహరణకి 1990ల నించి ప్రపంచీకరణ ప్రభావం అన్ని రంగాల్లోకీ చొచ్చుకుని వచ్చింది. దీని ప్రభావాన్ని గమనించకపోతే, పతన విలువలపై ఎంత ఆగ్రహాన్ని ప్రదర్శించినా, మూలాన్ని వదిలేసినట్లౌతుంది. సమకాలీనత దృక్పథానికి ఏ కవీ మినహాయింపు కాదు. అసలు ఆ మహాకవి కూడా తన కాలాన్నే ప్రతిబింబింప జేశాడు గదా! ఇక్కడ మళ్ళీ మరో విషయాన్ని కూడా గమనించవచ్చు. మానవ సహజ ప్రేరణలు చాలా ఉంటై. వీటి ప్రతిఫలనం ఏ కాలానికైనా దాదాపు ఒకటిగానే ంటుంది. (ఐతే కాలాన్ని బట్టి ఆవిష్కరణ రీతుల్లో భేదాలు రావచ్చు. అందుకే ఏ కాలపు ఏ దేశపు కవిత్వానైనా, అనుభూతి పొందడం (పరిమితుల్ని బట్టి) జరుగుతుంది.

**నిబద్ధత**

నిబద్ధత – అంటే, అభిప్రాయాలకుగాని, అలవాట్లకుగాని, సమాజానికి గాని, మరో దానికి గాని కట్టుబడి ఉండడం. ఏ అభిప్రాయాలు కవిత్వంలో చెప్తున్నాడో, వాటిని హృదయపూర్వకంగా నమ్మి ఉండడం. వాటి వెలుగులోనే జీవితాంశాల్ని విశ్లేషించుకోవడం. ఇందులో వ్యక్తుల్లో తరతమ భేదాలుండవచ్చు. ఒక ముఖ్యమైన ప్రశ్న ఉంది. కవి జీవితానికీ, అతని కవిత్వానికీ సంబంధం ఉండాలా అని. ఇది చాలా సంకీర్ణమైన విషయం. అయితే ఒక్కటి మాత్రం సూటిగా చెప్పడం సాధ్యమౌతుంది. అట్టడుగు ప్రజల్ని గూర్చి రాస్తూ, నిజజీవితంలో వారిని ఎక్కడో అక్కడ అవమానపరిచే వారుంటారు. అలాగే కులభేదాలు పోవాలని రాస్తూ, తన జీవితంలో కుల ప్రభావం కలవారుంటారు. ఆ విధంగానే హృదయం, ఇతరులకు సహాయం చెయ్యడం, మొదలైన వాటి గూర్చి ఎక్కువగా చెప్తూ, నిజజీవితంలో పిల్లికి

బిచ్చం పెట్టని వాళ్ళూ, ఎంగిలిచేతిని కాకికి విదిలించని వారూ ఉంటారు. ఇలాటివైతే, ఖచ్చితం. కవి జీవితానికీ, కవిత్వానికీ సబంధం లేదని చెప్పవచ్చు. కాని సజీవుడైన కవి దుర్వ్యసన పరుడో, దుర్మార్గుడో ఐ ఉంటే, కవిత్వం బాగున్నా, కళ్ళెదుట కవి ఉన్నాడు కాబట్టి, మెచ్చుకోలేనివారూ ఉంటారు; కవి బలహీనతల్ని లెక్కచెయ్యకుండా కవిత్వాన్ని మాత్రమే మెచ్చుకొనేవాళ్ళూ ఉంటారు. ఇది వైయక్తికమై పోతుంది. ఇలాటి సంకీర్ణతల గురించి, నిశ్చితంగా చెప్పడానికి వీలుండదు. మొత్తంమీద, కవి సజ్జనుడూ, తన భావాల్నించి వక్రమార్గంలో పోనివాడూ, అయితే, బంగారానికి తావి అబ్బినట్లు, అతడు ఎందర్నో ప్రభావితం చెయ్యగలడు. అటువంటి స్థితినే అందరూ ఆశించాలి కూడా. తాను, తన కవిత్వమూ కలిసి ప్రయాణించడమే నిబద్ధత. నిబద్ధత ఉన్నవాడు సమాజంచేత పట్టించుకోబడతాడు. నిబద్ధతలేనివాడు వదిలివెయ్యబడతాడు.

## దృక్పథ నిర్దిష్టత

జీవితాన్నీ, సమాజాన్నీ అవగాహనతో విశ్లేషించుకునే వాళ్ళకి, ఒక దృక్పథం తప్పనిసరిగా ఏర్పడుతుంది. దృక్పథం అంటే సిద్ధాంతం కాదు. సిద్ధాంతం, మనిషినిగాని, సమాజాన్ని గాని, ఒక ఆదర్శ మానవునిగా, ఒక నిర్దిష్ట సమాజంగా మారే సూత్రాల్ని చెప్పేది సిద్ధాంతం. ఎప్పటికప్పుడు జీవితపు పోకడల్ని గమనించి, ఎక్కడికక్కడ పరిష్కారం చూపించేది దృక్పథం. ఉదాహరణ : కులభేదాలు, ఇలాంటివి ఆచరణలవల్ల తొలగిపోతై అనే దృక్పథం ఒకరి కుండవచ్చు. లేదా ఇతర కారణాల వల్ల అంతరిస్తై అనే దృక్పథం మరొకరికి ఉండవచ్చు. ఇలా శిల్ప విషయాల్లో కూడా అనేక దృక్పథాలుండవచ్చు. ఏదైనా ఒక దృక్పథం, వక్రమార్గాలుగాని, పొరబాట్లుగాని, భ్రమలు గాని లేకుండా కొనసాగించగలిగితే అది దృక్పథ నిర్దిష్టత ఔతుంది. మానవుడు మారితే సమాజం మారుతుంది అని ఒక దృక్పథం. దీన్ని గురించి కొందరు ఒక దృక్పథం ఏర్పరచుకోవచ్చు. అలాకాదు, వ్యవస్థ మాత్రమే మానవుణ్ణి తయారు చేస్తుంది. కాబట్టి వ్యవస్థే మారాలి అని మరొకరి దృక్పథం కావచ్చు. లేదా వ్యవస్థా మారాలి. మనిషి కూడా మారాలని, అప్పుడే ఆదర్శ సమాజం వస్తుంది అని మరికొందరి దృక్పథం కావచ్చు. ఏ దృక్పథం కలవారైనా, దాన్ని పటిష్టంగా నిర్మించుకోగల శక్తి ఉంటే, దానికి నిర్దిష్టత ఏర్పడుతుంది. ఒక మార్గాన్ని ఖచ్చితంగా ఏర్పరచుకున్నప్పుడు, అది నిర్దిష్టత ఔతుంది.

దృక్పథంలో నిర్దిష్టత మాత్రమ కనీసమైన అవసరం. లేకపోతే, కవిత్వం బాగా రాసినా, సమగ్రంగా పరిణమించడం సాధ్యంకాదు.

## నిర్మాణ పటిష్టత

ఒక ఆవేశం కలిగినప్పుడు, ఒక ఆలోచన వచ్చినప్పుడో, కవిత్వం రాయడం వేరు; ఆ ఆవేశాన్నో, ఆలోచననో, ప్రతి అంశంలోనూ అమర్చి, భాషకీ, భావానికీ, శైలికి ఒక సమన్వయం కుదుర్చుకుని, కవితని నిర్మించడం వేరు. నిర్మాణం అనగానే అది అప్రయత్న పూర్వకం కాదుగదా – అనే ఆలోచన రావచ్చు. ఇది లోతుగా ఆలోచించవలసిన విషయం. ఇక్కడ ఒ సృజన క్రియాపరమైన రహస్యం ఉంది. కవిత్వం ఎప్పుడూ ఒక సృజనావస్థ (మూడ్) లోనే ఆవిష్కరింపబడుతుంది. ఒక దశలో కొంత రాసి ఆపేసినా, మళ్ళీ దాన్ని కొనసాగించడానికి, ఆ స్థాయిలో సృజనావస్థ లేకపోతే సాధ్యం కాదు. సృజనావస్థ బలహీనపడితే, బలహీనంగా ఆ కొనసాగింపు ఉంటుంది. సృజనావస్థలోని చైతన్యస్థితి అనేది ఒక సంకీర్ణ సమాహారభూతమైన ప్రేరణ. ఒక కవి తక్కువ స్థాయిలో ఉన్నప్పుడు రాసిన కవితకీ, అధ్యయనాదుల చేత చైతన్య విస్తృతి పొంది రాసిన కవితకీ చాలా భేదం ఉంటుంది. మొదటిదీ, రెండోదీ కూడా అప్రయత్నంగా వచ్చినవే. కాని, రెండో దశలో వచ్చిన అప్రయత్నతలో అనేకాంశాల, అపూర్వ సమ్మేళనం ఉంది. నిర్మాణానికి సంబంధించిన అనేక అంశాలు నిర్దిష్టంగా అంతఃశ్చైతన్యంలో ఉంటే, సృజనావస్థలో అవి అమరిక పొంది, అప్రయత్నగానే గొప్ప కవితగా అభివ్యక్తి పొందుతై. అందువల్ల నిర్మాణ మనేది కూడా అ ప్రయత్న సిద్ధమే. ఐతే, సృజన కోసం జరిగే సర్దుబాట్ల కోసం కొద్దిపాటి ఆలోచనలు ఎలాగూ అవసరమౌతై. సరైన పదం కోసమో, సరైన కార్యక్రమం కోసమో మరో దానికోసమో, ఆలోచనలు ఉండవచ్చు. కాని, నిర్మాణానికి అవసరమైన అపూర్వ చైతన్యాంశ సమ్మేళనం, అప్రయత్నంగానే ఉంటుంది. ఉదాహరణకి ఒక మిశ్రమ ఫలరసాన్ని తయారు చెయ్యాలంటే, అనేక పళ్ళను తెచ్చి ముక్కలు మిక్సీలో వేస్తే, ప్రక్రియ ప్రారంభమైన తర్వాత ఏకధారగా, ప్రత్యేక రుచితో బయటికి వస్తుంది. కాబట్టి నిర్మాణ పటిష్టత కావలసిన సామగ్రిని, ఎప్పటికప్పుడు సేకరించుకుని, చైతన్య విస్తృతి సాధించుకోవడం, స్థాయి పెంచుకోవడం, కవికి నిత్యకృత్యం కావాలి.

*('సాహిత్య గమ్యం' పుస్తకం నుండి)* ◆




# నాన్న ప్రేమ బంధాన్ని ఆవిష్కరించిన కవిత్వం

- దేవ్

**క**వి సమాజం నాడీ పట్టుకొని లేపనం పూయడానికి "నాన్న పచ్చి అబద్ధాల కోరు" అనే డాక్టర్ చొక్కా తొడుక్కుని వీధి వీధి తిరుగుతూ పల్లె డాక్టర్ అయ్యాడు. సమాజానికి పట్టిన రోగాన్ని మాన్పాలనుకున్న ఈయన ఎవరంటే నాన్న పచ్చి అబద్ధాల కోరు కవితా సంపుటి రచయిత సురేంద్ర రొడ్డ. ఈయన ఉపాధ్యాయుడు కావడంతో పిల్లలతో మమేకమై వారి తల్లిదండ్రులతో పరిచయాలు ఉండటంతో వారి పరిస్థితులు సంబంధబాంధవ్యాలు ప్రేమలు అనురాగాలు దగ్గర నుండి గమనించడానికి ఉపాధ్యాయ వృత్తి తోడ్పడింది.

ఉన్న ఒక్క పరుపును నాకు పరిచి నడుము నొప్పికి నేలపడక ఉన్నప్పుడు నాకు తెలియలేదు నాన్న అబద్ధం ఆడుతున్నాడని!

ఒకతండ్రి తన కొడుకు ఎక్కడ అందరిలాగా సుఖాన్ని అనుభవించే లేకపోతాడో అని పరుపును కొడుకుకు పరిచి నాన్న నా నడుము నొప్పికి కింద పడుకుంటేనే నేలపైన ఉంటేనే మేలని అబద్ధం ఆడుతున్నాడని కవి ఎంత చక్కగా గ్రహించి అనుభవించి ఈ వాక్యాన్ని మన ముందు పెట్టాడు ఈ ఒక్క వాక్యం చాలు తండ్రి కొడుకుల ప్రేమ బంధాన్ని తెలపడానికి.

*అమ్మకు చెప్పకురా అనే కవితలో*
*అమ్మకు చెప్పరా కన్నా*
*నాన్నను అనాధాశ్రమంలో వదిలేశానని!*
*అన్నీ తెలిసిన అమ్మకు చెప్పక*
*వెన్ను విరిగి రెక్కలరిగిన నాన్నను ఆసుపత్రిలో చేర్పించానని చెప్పు. గుండాగక ఇంకొన్నాళ్ళయినా పాచిపని చేస్తుంది!*

పై వాక్యాలు కవి నిజజీవితంలో అనుభవించిన అనుభవాల నుండి అక్షరాలుగా పురుడుపోసుకున్నాయా? అన్నట్లు కన్నీటి చెమ్మతో చెంపను తడుతుంది.

*ఇరిగి పోవే కన్నీటి చుక్కా కవిత*
*కూటి కోసం కూలికెళితే*
*కొండంత రెడ్డి కొంగు పడితే*
*పసికూన కంట కనబడక*
*ఇరిగి పోవే కన్నీటిచుక్కా వేధించక!*

ఒక కూలీ మహిళ తన కుటుంబ పోషణ కోసం కూలికి వెళ్తే ఎక్కడ అక్కడ తనని చెడపెట్టే మనుషులు తన కొంగు లాగితే ఆ బాధకు కన్నీటి చుక్కలు రాలుతుంటే నా కన్నీటి చుక్క ఆ ఆలి తన నివేదిక అందించింది తిరిగి పోవే కన్నీటి చుక్కా నన్ను వేధించకే అంటూ ఎంత బాధగా చెప్పారండి అద్భుతం కదా.

*మగ్గం మూగబోయింది*
*ఎందరి మానాలను*
*సంరక్షించిన చేనేతన్న*

# మూగజీవుడు

- మోకా రత్నరాజు
9989014767

గ్రహణం నాడు
ముఖద్వారాలు మూసేసి బంధిస్తే
భయపడి బంధీ అయిపోవడానికి
నే నోరెరగని గుళ్ళో దేవుణ్ణి కాను

ఆ దేవాలయ నిర్మాణంలో
ఇటుక ఇటుక్కీ నడుమ
అడుసై నిల్చి : నిల్చి
ఆ నిర్బంధ నిలయ
పుట్టు పూర్వోత్తరాలెరిగిన వాణ్ణి

విగ్రహ రూపం దాల్చాక మునుపు
ఆ బండ రాయిని
అంటి, ముట్టి
తాక్కి; చెక్కిన వాణ్ణి

ప్రతిష్ఠా సందరాన
భుజానెక్కించుకుని
గర్భగుడి పీఠమ్మీద దిగబెట్టినోణ్ణి

కళ్ళకద్దుకుని ఆరగించే
పవిత్ర ప్రసాదాలకు
ముడిసరుకుల్ని పుట్టించడానికి
చచ్చేవరకూ శ్రమ పడేవాణ్ణి

స్నాన పానాదుల
జలధారలకు
భూమాత కడుపున చేయి పెట్టిదేవి
నీటికి నడకదారుల్ని చూపినోణ్ణి



పూటకో అవతారం మారుస్తూ
విడిచి, విడిచి కట్టే మడివస్త్రాలకు
మగ్గంలో కండనై
గుండెలవిసేలా కల తిరిగినోణ్ణి

ముడుచుకుని
పడుకున్న బండెద్దును
ముల్లకర్రతో అదిలించి లేపి
కాడికి జతచేసినట్టు
మునుమును చీకట్లుండగానే
మొద్దునిద్రలో మునిగిన దేవుణ్ణి
ఉత్తేజ దరువుతో మేల్కొలపడానికి
డప్పూ, చిడతనై
మోగుతున్న వాణ్ణి! కాగుతున్న వాణ్ణి
ఇన్నీ నేనై నిల్చి
అన్నీ అయ్యాక అంటరాని వాణ్ణి!

ఇవేమీ తెలుసుకోలేకనే కదా
నాకు జరిగే అవమానాల్నే కాదు
తన మీద జరిగే దోపిడిపై
కూడా
నోరు విప్పని పసిగుడ్డల్లే
అర్థంకాని మంత్రాల హోరుకి
జడిసి
గుడిబోనులో ఇరుక్కుపోయాడు
పాపం! దేవుడు వట్టి
మూగజీవుడు

ఇన్నీ తెలిసిన
నువ్వూ: నేనూ కూడా
పనిపాటలు మానేసి
ఆస్తుల్ని పెంచమని
ఆపదల్నుంచి కాపాడమని
(అ) ధర్మడిబ్బీ పొట్ట పగిలేలా
డబ్బు కట్టలు కుక్కడాలేమిటి?
పడి పడి మొక్కడాలేమిటి?
సిగ్గులేకపోతే సరి! ◆

---

*తన ప్రాణాలను కూడా కోసం*

***పట్నం వైపు కన్నీళ్లతో కలనేత చేనేతన్న*** అంటూ "వలస పక్షులు" కవితలో రైతు, కుమ్మరి, చేనేతలు వలస పక్షుల్లా వెళ్లిపోతున్నారని వారి గుండెచప్పుడు వినిపించాడు.

***కొత్త రెక్కలతో ఆమె దేవుడిచ్చిన జీవితాన్ని/ తుంచుకోలేక / కొత్త బంగారు లోకంలో /ఆనందపు హరివిల్లును / ఆవిష్కరించుకుని /కొత్త రెక్కలతో ఆమె /రెక్కలిరిగిన /స్త్రీ జాతికి స్ఫూర్తినిస్తూ..***

ఈ కవితలో ఒక మహిళ సమాజంలో ఎలా అవమానపడుతోంది? ఏ విధంగా కారణమవుతుందో? ఏవిధంగా చర్చ పడుతుందో? దేవుడిచ్చిన జీవితాన్ని ఉంచుకోలేక ఆమె స్త్రీ జాతికి స్ఫూర్తి నివ్వాలని ఎంతో ఆవేదనాభరితంగా ఈ కవితను నడిపారు.

గతంలో కవితావస్తువులు చదవలేదు. అమ్మానాన్నలు మొదలుకొని భార్య పిల్లలు, విద్యార్థులు, ఆశలు, ఆవేదనలు, మన మరణాలు, మనసు, ప్రేమ, అనురాగము? నిరీక్షణలు, రోజులు ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో వస్తువులతో ఏడు పదులు కావ్యం గా "నాన్న పచ్చి అబద్ధాలకోరు"గా మన ముందుకు తీసుకువచ్చారు. ఇది సురేంద్ర రోడ్డ తొలి కవితా సంపుటి. ఆయన మరిన్ని కవితా సంపుటులను సాహిత్య ప్రపంచానికి పరిచయం చేయాలని మనసారా కోరుకుంటూ అభినందనలు తెలియజేస్తున్నాను. ◆

# కరవు సీమలో కవితా ప్రవాహం






- కెంగార మోహన్
9493375447

రాయలసీమలో జీవనదుల్లేవు, ఆనకట్టల్లేవు అన్నమాటలెంత సత్యమో, జీవనదుల్లా కవిత్వం ఇక్కడ ప్రవహిస్తుంది. ఇటీవల మంచి కవిత్వం చదివానన్న తృప్తి అనడం కంటే హృదయతంత్రుల్ని మీటే కవిత్వమనిపించింది. అక్షరాన్ని ప్రేమించినవాడు, వాక్యాల్ని కౌగిలించుకున్న వాడు, కవిత్వాన్ని ప్రాణప్రదంగా భావించినవాడు బహుశా ఇలాగే ఉంటాడేమో.

ఏదోరాసి పడేసి ,అచ్చైతే మురిసిపోయి పలవరించి, పరవశించిపోయే కవులున్న ఈ కవితా ప్రపంచంలో కవిత్వమొక్కటే మాట్లాడే కవి కొత్తపల్లి సురేష్. అక్షరమాలిగా సీమ పొలాల్లో కవిత్వాన్ని విత్తి సిరులపంట పండిస్తున్నవాడు. ఇవన్నీ అతిశయోక్తేమో అని అనుకున్నా సురేష్ కవిత్వం చదివాక నిజమనిపిస్తుంది. గుండెల్లో మంటను రగిలించుకుని తనకుతాను కవిత్వమై కాలుతుంటాడు. కవిత్వమై మనిషిపైపు పరికించి చూస్తాడు. కవిత్వం రాయాలని రాసినట్టుంటుండదు, తన ప్రమేయం లేకుండా ప్రవహించినట్లుంటుంది.

కవిగా సాహిత్యలోకానికి పరిచయమైనప్పటికీ లైఫ్ హాలిడే కవితాసంపుటితో కరచాలనం చేస్తున్నవాడు. నా కవిత్వం నిలబడుతుందా? బాగుంటుందా? కొందరినైనా చదివిస్తుందా? అని అనేకానేక సందేహాల సంఘర్షణల్ని దాటుకుంటూ ఎత్తు పల్లాలను దాటుతూ ముందుకు నడుస్తున్నవాడు. ఆ కవితా శకలాలను పెకిలించి చూస్తే...**పొలం పనుల్లో అలసి/స్వేద పుష్పమై విరిసి/తీవ్ర దాహమై తిరిగొచ్చిన నాన్నను/చన్నీరై పలకరించేది అమ్మ/ఎన్నిరోజులైందో నాన్నపై అనురాగాన్ని చూపి..** అమ్మగూర్చి రాయని కవి ఉండరు..అమ్మ గూర్చి రాసిన ప్రతీ కవి కొత్తగానే రాస్తాడు. అలా సురేష్ కూడా ఉబికివచ్చే అక్షరజలానికి శ్రమైక స్వేద బిందువుల రంగులద్ది మరీ కవిత్వీకరించారు.

అమ్మ గూర్చి ఇంత గొప్పగా రాశారు అని ఎప్పటికీ అనకూడదు..ఎందుకంటే ప్రతీ కవి అమ్మగూర్చి రాసే కవిత్వం చాలా గొప్పది. అది హృదయంలోంచి వచ్చే ప్రవాహం. అమ్మ గూర్చి రాసే కవితకు జన్మస్థానం కూడా మాతృహృదయమే.

సురేష్ కవిత్వాన్ని పలకరించడు. పరవశించడు. పలవరించడు. కవిత్వాన్ని తన నెత్తుటిలో మిళితం చేసుకున్నాడనిపిస్తుంది..తన డిఎన్ఏ కూడా బలమైన కవితా వస్తువు కూడా అన్వేషిస్తుందనిపిస్తుంది..కవిత్వాన్ని ఎలా అన్వేషిస్తాడంటే..**కళ్ళు అరుణ వ్రణాలు/రేయి నడిఝామున / చెదిరిన పాపాయి కలలో / నాలుగు నవ్వుల్ని మిగల్చలేనప్పుడు / గుప్పెట పట్టలేని కాలం కౌగిట/ మౌనరోధన చేస్తున్న/ ఏకాకి లోలకం నేను!/ దు:ఖపరాగం / దేహాకాశమంతా**

**పరచుకున్నాక/ చిల్లులుగా కురుస్తున్న /నెత్తుటితారల నడుమ/ రాలక మిగిలిన చివరి మింటిచుక్కను నేను..**కవిత్వం ఎక్కడుందో అని వెతకాల్సిన పనిలేదు..ప్రతి వాక్యం కవితాత్మకంగా మలుస్తాడు. బలమైన వస్తువు పట్టుకుని దాన్ని గొప్ప అభివ్యక్తితో కవితను చెక్కుతాడు. రాయలసీమలో పుట్టిన కవికి వస్తువులకి కొదువలేదు. ఈ యువకవి గుండెనిఘంటువులో అనేక కవితా వస్తువులు దాగున్నాయి. కాదు కాదు నిక్షిప్తమై ఉన్నాయి. శ్వేతరుధిరధార శీర్షికతో రాసిన పై కవితలో మెటాఫర్ దాగుంది..చెప్పాలకుకున్న కవితాపంక్తులు కన్నీళ్ళవుతాయి.

సాహిత్యలోకంలో ప్రభుత్వకవులు–ప్రజాకవులు అని రెండురకాలుంటారు. గొప్ప కవిత్వం రాస్తున్న కవులు కూడా సన్మాన సత్కారాలకోసం, గుర్తింపుకోసం తాపత్రయపడటం కనబడ్తూ వుంటుంది. కవిత్వం మాత్రమే రాసే కవులు ప్రభత్వాన్ని పొగిడేందుకు సభల్లో కూర్చునే వారికి అర్థమయ్యేలా, నాల్గు చప్పట్లు సంపాదించుకునేందుకు పేలవమైన కవిత్వం రాస్తుంటారు. ఈ ఘటనలు మనం ప్రతి ఉగాది కవిసమ్మేళనాల్లో చూస్తుంటాం. ఈ కవి వాటికతీతమనో రాశాడనో రాయలేదనో చెప్పను కాని...ఈ కవిత చూశాక గుండెను మెలిపెట్టి తిప్పినట్లనిపిస్తుంది..ఆ కవిత చూద్దాం..

**చీకటి ఋతువులన్నీ రాలిపోయాక/ మనసు కొమ్మల్లో ఉదయించే కొత్త ఉషస్సే ఉగాది/ సంతోషపు కౌగిలి ఉగాది/ ప్రేమ సమీరం ఉగాది / కోపతాపాల బాధల బంధనాల/ తీపి కబుర్ల జుగల్బందీ ఉగాది...** అని అంటూనే స్వృహలోకొచ్చిన వాడిలా...**రైతు అప్పులగాయాల పగుళ్ళ పెదాల పొలం!/ పై పూతల రాజకీయనీతుల ఎండమావుల మీదుగా/ఎగిరివచ్చే పండుగ పక్షులు/ చావో రేవో వాటి దాహం తీర్చడమే/ పల్లె ఉగాది..**సీమ పల్లెల్లో ఉగాది అంటే ఇలాంటి ముఖచిత్రాలే..ప్రతిఇంటి గడపగడపలో ఇలాంటి రేఖాచిత్రాలే ముగ్గులౌతుంటాయి. కవికి బాధ్యత ఉండాలి..నిబద్ధత ఉండాలి..సమాజం పట్ల సానుభూతో ఇంకోటో అని కాదు..ఈ సమాజంలో బతికున్నంతకాలం సమాజాన్ని మార్చే ఆయుధంగా కవి మారాలి. ఆ భరోసా ఈ కవిలో కనబడుతుంది. కవిత్వం త్రికరణశుద్ధిగా రాస్తున్నాడని అనాలనిపిస్తే ఈ యువకవికి నూటికి నూరుపాళ్ళు సరిపోతుంది.. ఈ కవిత్వం చదువుతన్నంతసేపూ వైవిధ్యంగానే కనబడుతుంది..ఇక ఈ కవితా సంపుటి శీర్షిక విషయానికొస్తే "లైఫ్ హాలిడే ". కవిత్వానికి నిర్మాణ సూత్రాలేమి లేవనే వాళ్ళూ..ఏది రాసినా కవిత్వం అనే వాళ్ళూ..ఈ మాత్రమైనా రాస్తున్నారు కదా అనేవాళ్ళూ ఉన్న ఈ తెలుగు కవిత్వంలో వాస్తవం చెప్పాలంటే కవిత్వానికి కొన్ని పద్దతులున్నాయనిపిస్తోంది..కవిత్వంలో వస్తువు శిల్పమే కాక, ఎత్తుగడ, అభివ్యక్తి హృదయాన్ని తాకే ఎన్నో సూత్రాలు గొప్ప కవుల కవిత్వం చదివినపుడు కనబడ్తాయి..సురేష్ ఎంపికచేసుకున్న లైఫ్ హాలిడే గొప్ప ఎత్తుగడ. ఈ సంపుటి శీర్షికతో కవిత ఉంది. ఈ కవిత తండ్రిని ఉద్దేశించి రాసినది..తండ్రి అంటే దేశానికి అన్నం పెట్టే రైతు అన్నమాట. ఆ తండ్రి ఉండేది తల్లిలాంటి పల్లెలో..దేశానికి అన్నం పెట్టే రైతు..ఈ కవితలో పల్లెని, రైతు గూర్చి ఎంత హృద్యంగా చెప్తాడో చూస్తే...కళ్ళ నీళ్ళొస్తాయి..

**నిజానికి నేడు నిఖార్సైన పొలమూ లేదు / నిటారైన దేశమూ లేదు/ యిక్కడ, రైతు నుదురే ఒక ప్రాంసరీ నోటు/ ఆత్మహత్యలే వేలిముద్రలు/ అదిగో, ఉరికొయ్యకు అప్పుల చిట్టా వేలాడుతోంది/ దేశం ఖరీదైన సేద్యాన్ని కలగంటోంది./ నిరసనగా పల్లె పల్లెనా శవాలతోరణాలు వెల్లుస్తున్నాయి/ రైతు, లైఫ్ హాలిడే ప్రకటిస్తున్నాడు.!/ యిపుడు పల్లె,/ ఒక కార్పోరేట్ స్మశానవాటిక**

**రైతు తిరిగి మొలకెత్తడానికి చోటు దొరక్క కుళ్లిపోతున్న శవం!** ఇవి కరవుసీమలో కన్నీటి వాస్తవ దృశ్యాలు..అక్షరీకరించారనడంకంటే రైతన్న కన్నీళ్ళని సిరాగా చేసుకున్నాడనిపిస్తోంది. గాఢత కలిగిన కవిత్వం చదివామనే భావన పాఠకుల్లో కలుగుతుంది. నిజంగా రైతుకు హాలిడే ప్రకటించడమంటే వ్యవస్థపై నిరసన. పాలన పై నిరసన. ఆ నిరసన ఎంత కసితో చెప్తాడంటే..**పథకాల పాదాల / మీద ప్రభుత్వాలు నడుస్తుంటాయి/ జన్మభూమి బ్రహ్మ కడిగిన పాదము** అంటూ వెకిలిగా **జై జన్మభూమి** అంటాడు. ముందు చెప్పే కవితా పంక్తుల్లో **నేలఫక్కున నవ్వింది** అంటాడు కవి.. రైతన్నకు ఈ గతి పట్టించిన ప్రభుత్వాలపై నిరసన..సురేష్‌కు ప్రభుత్వాల మీద నమ్మకం లేదనిపిస్తోంది. ప్రజాస్వామ్య హక్కులు కాలరాయబడ్తున్నాయనే భావనతో ఓటు

రాజకీయాల్లో ప్రజలు మోసపోతున్నారని బలంగా అనుకుంటున్నట్లు కనబడ్తుంది. **లోకం ఒక దేహాల సంత/ బానిసత్వం సంత సరుకు/ యుగాల పీడన మోస్తున్న దేహాలు/ రంగురంగుల జెండాల దేహాలు/ కుర్చీల రెక్కల దేహాలు/ కీ ఇస్తే నడిచే ఓటు బొమ్మల దేహాలు/ ఆకలి అన్నం అయ్యే దేహాలు/ మార్కెట్లో అమ్ముడుపోయే దేహాలు/ ఆటోల మీదుగా, బస్సుల మీదుగా దేహాలు/ పొలాల స్వేద పుష్పాల దేహాలు/ ఫ్యాక్టరీ యంత్రాలదంతాల దేహాలు/ ఆఫీసు గోడ మీద పరుగుల గడియారపు దేహాలు/ ఫైళ్ళ మీద ఉచితసంతకాలయ్యే దేహాలు/ భవంతుల గోడల పునాదుల దేహాలు..** ఇటీవల ఎన్నికలు ముగిశాయి. ఓట్లకోసం బూర్జువాపార్టీలు, మతోన్మాద పార్టీలు చేస్తున్న నీతిమాలిన, పనికిమాలిన రాజకీయాలన్నీ చూశాం.. ఇన్ని ప్రలోభాలు పెట్టాక మనం ఓటుబొమ్మల దేహాలే కదా.. మన బతుకులు ఇలా ఉన్నాయా అని అనిపిస్తుంది లైఫ్ హోలిడే చదివాక.

ఈ కవిత చివర్లో అంటాడు **పిడికిలి విడగొడుతున్న రాజ్యతంత్రాన్ని తుపాకీ కంటితో / గురిపెట్టడం అవసరమని నువ్వు గుర్తించాల్సి ఉంది..** ఒక సమస్యను కవితలో చెప్పి వొదిలేయడం ఒకపద్ధతైతే ఆ సమస్యకు పరిష్కారం కూడా చెప్పే ప్రయత్నం కొంతమందే చేస్తారు. ఈ కవి కవిత్వ నాఢీ పట్టుకున్నవాడనిపిస్తోంది. బహుశా ఈ కవి కవితా సంపుటి మొదటిదే అయినా చాలా పరిణతి చెందిన కవిత్వంలా కనబడ్తుంది. కవితా పరిణామ క్రమాన్ని బాగా అర్థం చేసుకుని, అవగాహన చేసుకుని కవిత్వీకరించాడనిపిస్తుంది.

వర్తమాన సమాజాన్ని లోతైన దృష్టికోణంతో చూడగలిగిన ఏ కవి అయినా సాహిత్యలోకంలో నిలబడ్తాడు. స్పృహతో ఉండి కవనరంగాన్ని యుద్ధరంగంగా మలచుకున్నవాడెపుడు కవిత్వంలో ఓడిపోడు. అలా వొక్కొక్కమెట్టూ పేర్చుకుంటూ నిర్మించుకుంటున్న కవి, కవిగా నిలబడ్తాడు. ఈ కవిలో ఈ కవిత్వంతో అంతటి దార్శనికత కనబడ్తుంది. దీనికి ఉదాహరణగా ఒక కవిత చూస్తే.. **ఊరిని సందడిలో ముంచడానికే / వానపాటెత్తుకుంది మేఘం/ ఊరి మనసు నిండిన చెరువైంది/ ఆనందంలో తడుస్తూ నడుస్తున్న రైతులు/ సాగిపోతున్న ఆశల పడవలు..!**

ఈ కవితలో కవి గొప్పగా కలలు కన్నాడనిపిస్తోంది. అద్భుతంగా ఊహల్లో విహరించాడనిపిస్తోంది.. అనిర్వచనీయ భ్రాంతి పొందాడనిపిస్తోంది.. కారణం ఈ పరిస్థితులు రాయలసీమలో లేవు. ఎటు చూసినా ఎడారిలాంటి పైర్లు. అక్కడక్కడా ఎండిపోయిన చెట్ల కళేబరాలు. ఊపిరున్న పీనుగలు దర్శనమిస్తుంటాయి. ఇలా ఆనందం పొందుతున్నాడంటే కవి లోవల, లోలోవల ఎంత దు:ఖిస్తున్నాడో ఇట్టే అర్థమౌతుంది. ఇంత భయానక పరిస్థితులు రాయలసీమలో ఉంటాయా? అని ఆశ్చర్యపోవచ్చు. నిప్పులాంటి నిజాలు చెప్పాలి. చెప్పకపోతే రాయలసీమ సంతల్లో రత్నాలు, వజ్రాల రాసులుపోసి ఇంకా అమ్ముతున్నా రనుకుంటారు. ఎందుకంటే క్లియర్‌గా తనొక స్టేట్ మెంటిస్తాడు ఇలా.. **దేశానికి అన్నం పెట్టలేని రైతు/ ప్రపంచీకరణ పరిష్వంగంలో/ ఆఖరిశ్వాస తీసుకుంటున్నాడు/ మట్టిపుటల్లో ఆనవాలు కోల్పోయిన అక్షరాలన్నీ ఆకలిచావులే అని..** ఇంతకంటే ఇంకేం చెప్పాలి బండబారుతున్న బతుకుల గూర్చి.

కొత్తపల్లి సురేష్ కలం పేరు అక్షరమాలి. ఇతడు కరవుసీమలో అక్షరసిరులు పండిస్తున్నాడు. పండించిన మట్టిపూలతోటకు అక్షరమాలిగా మారాడు. ఈ కవి రాస్తున్న కవితల్లో కవిత్వం ఉంది. ఈ కవిత్వం చదివాక నికార్సైన కవులు బాగా రాస్తున్నాడని అభినందిస్తారు. మదిలోతుల్లో ఈర్ష్య నిక్షిప్తమై ఉంటే ఫరవాలేదంటారు. వర్తమాన కవిత్వంలో పదనైన కవిత్వం చదవక చాన్నాళ్ళైందనే భావన ఉండేది. అదిప్పుడు పటాపంచలైందనిపిస్తోంది. కవిత్వం బాగుందనో, చక్కనందనో, చిక్కనైందనో ఏవో ముఖస్తుతిగా నాల్గుమాటలు చెప్పాలని ఈ కవిత్వం చదివితే ఎవ్వరికీ అనిపించదు. భావుకత కలిగిన కవిత్వం హృదయాన్ని స్పృశించే కవిత్వం చదివామనే భావన కల్గుతుంది.

అక్షరమాలి సురేష్ కవిత్వం వర్ధమాన కవులకు ఆధారిత కవిత్వంగా తోస్తుంది.. కవిత్వాన్ని రాసే కవులకు గొప్ప కవిత్వం చదివామనిపిస్తుంది. ఆకుపచ్చని ఆకాశంలో జయకేతనమై ఎగరాల్సిన రైతు పొలం గనిలో ఊపిరాడని కార్మికుడై పోయాడన్న మాట నిజం. ఆ రైతును బతికించుకుందాం.. కవి కలలు గంటున్న సమాజం ఆవిర్భావంలో మనమూ శ్రమైకజీవులమౌదాం..

◆

# వర్తమాన దుఃఖాక్షరం

- మెట్టానాగేశ్వరరావు
9951085760




"వేదనయే లేని బతుకు/దూదికన్న తేలికగును/వేదనలోనే పుట్టును/వేదమ్ములు నాదమ్ములు" అన్నారు ప్రసిద్ధకవి సినారె. నిజమే గదా! ఆదికవి వాల్మీకి దగ్గరనుంచీ నేటి కవి వరకు శోకం నుంచే కవితోత్థవం జరుగుతున్నదన్నది సత్యం. ఆ దుఃఖం స్వీయదుఃఖం గావచ్చు లేదా సమాజదుఃఖం గావచ్చు. నిజమైన కవి ఎవరైనా సున్నితహృదయుడే. చీమ రెక్క తెగినా అల్లాడిపోతాడు. తన ఎదుట ఎవరిబతుకు కన్నీళ్లు రాల్చినా చలించిపోతాడు. కవితాస్వరమై బాధను ప్రవహిస్తాడు. నేడు అలాంటి నవయువ కవులెందరో. వారిలో ఈ.రాఘవేంద్ర ఒకడు. ఆయన వర్ధమాన కవి. బలమైన కవితావస్తువుల్నీ తీసుకుని, ఇటీవల "గాయపడ్డ విత్తన"మై వెలువడ్డాడు. ఆయన గురించి రాచపాలెం చంద్రశేఖర్ గారు ఇలా పరిచయించారు.

"ఈ కవికి సామాజిక సంవేదన బలంగా వుంది. ఈయన కవిత్వంలో వర్తమానమే వస్తువు. అనంతపురం జిల్లా కరువు నుండి సిరియా మారణకాండ వరకూ ఈయన కవిత్వం విస్తరించింది". అంటే స్థానికతనుండి విశ్వజనీనత వైపు రాఘవేంద్ర కవిత్వయాత్ర వుందనీ..!

ఏ కవైనా కవిత్వం రాసే కొత్తల్లో కవిత్వంపై కవిత్వం రాసే సంప్రదాయం తెలుగులో మెండుగా వుంది. "పూత మెరుంగులు పసరు పూవ బెడంగులు చూపినట్టివా కైతలు" నుంచీ "కదిలేదీ కదిలించేదీ" నుంచీ "ముట్టుకుంటే తగలాలి కవిత్వం మనిషి లాగా" నుంచీ ఇప్పటి వరకు ఎంతోమంది మెటాపోయట్రీ మీద కలం కదిపారు. మరి రాఘవేంద్ర "కవితాగీతం" ఎలా రాసారో చూద్దాం!

"మబ్బులు వీడిన/నా కన్రెప్పల నుండి/భావోద్వేగ చినుకులు రాల్చుకుంటూ/రాలిన ఒక్కొక్క చినుకునీ ఒడిసి/సిరాగా మార్చుకుని/కవితాక్షరాలను ప్రసవిస్తాను/ఆ కవిత్వం చదివితే/హృదయంలో స్పందన మొదలై/కంటిపొరల్లో దాగిన/కదలికెరటాలు పొరలి/మనిషంతా తేలికై పోవాలి/మనిషి మెదళ్లపై/ఆలోచనా చిగుళ్లు పురుడుపోసుకోవాలి/అంధకారంలో పయనమైన/బాటసారికి/నిండైన వెన్నెల వెలుగై/మనిషిలోని నిశ్శబ్దాన్ని/పలకరించే శబ్దం కావాలి" అంటూ చివరిగా ఇలా అంటాడు.

"గతగాయాల్ని మాన్పే/వర్తమాన వేకువగీతం కావాలి" అనీ..!

ఈ సంపుటిలో అలాంటి వేకువని కోరుకునే కవితల్నే ఎక్కువగా రాసి,కవి "ఆడినమాట" మీద నిలబడ్డాడు. వాటి వైనం ఇప్పుడు పరిశీలిద్దాం.

సంపుటికి శీర్షికగా వెలిగిన "గాయపడ్డ విత్తనం" విలువైన కవిత. సమకాలీన దుస్థితికి ప్రతిబింబం. వున్నవూళ్లో బతకలేక, బతుకులేక వలస పోవడం పాలమూరుజిల్లాలాంటి చోట తీవ్రంగా చూసేటోళ్లం. కన్నీళ్లు కార్చేటోళ్లం. ఇపుడీ కన్నీటివ్యథ అన్నిచోట్లా కానవస్తోంది. ముఖ్యంగా నీళ్లు లేని రాతినేలమీద రైతులజీవితాల్లో మరీమరీ వెంటాడుతున్నది. నెత్తికి రుమాలు, మోకాలి కిందకి పంచెతో, అచ్చం వూరి మొదల్లో నిండైనా కొండలా వున్న రైతు దుఃఖంలో ఎలా పడిపోయాడో చిత్రించిన కవిత "గాయపడ్డ విత్తనం". దానిలోని కొన్నిపంక్తులు తడమండి.. గుండెలోని తడి తెలియడానికి..!

"ఊర్లో ధ్వంసమై మొలకెత్తని/విత్తనమొకటి/పట్నంలో/ఓ ఇంటిగేటు ముందు/గ్రీష్మం కురిసిన చెట్టయి నిలబడింది/అలవాటు లేని ట్రౌజర్ /తలకు టోపి/చేతిలో కట్టె/రాత్రినదిని మెలకువతో ఈదుతున్న నావికుడు/ఇపుడు తాను/చీకటి కార్చిన

కన్నీరు/రెండు తలుపులు గీసుకున్న శబ్దం/చుక్కనీరు లేక/చెరువు పగుళ్లు దేలినట్లున్న/ఆ దేహం/ఈ దేశం చిరునామా"

పై కవితలో రైతువలస వేదన ఆవిష్కృతమైంది. ఇదివరకే వల్లెలో వల్లెంలోకి కూడు కరువైన చాకళ్లు, మంగళ్లు, గవుండ్లు మొదలైన వృత్తికులాలవాళ్లు అపార్టుమెంట్ లో కావలివాళ్లు అయ్యారనీ, పల్లె కన్నీరు పెడుతుందనీ బాధపడ్డాం. ఇపుడు దేశానికి కూడు పండించే రైతు కూడా అలా వలసబారిన పద్దం ఈ దేశానికి అపప్రథనీ తేల్చేశాడు కవి రాఘవేంద్ర. మరో కవిత "వానసంకటం" లో ప్రాంతీయ సేద్దెగాని దయనీయతకి కారణమైన మేఘం చూపించే పక్షపాతబుద్ధిని ప్రశ్నించాడు..

"అక్కడేమో/పొలాల్ని నదుల్ని చేస్తున్నావు/పంటల్ని పడవలై తేలుస్తున్నావు/ఊళ్లు, ఇళ్లు, మిద్దె లెక్కి మీసం మెలేస్తున్నావు/సీమతల్లి గుండెలపై మాత్రం/చినుకుగింజను రాల్చకుంటివి" ఇలా సాగే కవితలో "కాసిన్ని చినుకులకు మొహం వాసిన వాళ్లం/రవ్వంత తుంపరకే/కళ్లల్లో గుండెల్ని పుష్పాల్లా కురిపించే మనుషులం/నీకు కడగొట్టుబిడ్డలం" అన్నప్పుడు హృదయం ద్రవించిపోతుంది. "కడగొట్టుబిడ్డలం" అన్నప్పుడు జాషువా "గబ్బిలం" ఖండకావ్యంలోని ఆవేదన కళ్లలో మెదిలింది. ఈ కవిత ముగింపువాక్యం "పూరింపబడని ఖాళీ మైదానంలో/వాక్యం నిండని కావ్యం రైతు" అన్నది రాయలసీమ రైతుదైన్యాన్ని బొమ్మకట్టించింది.

రాఘవేంద్ర సీరియస్ కవి. తన అక్షరాన్ని తన ప్రాంతానికి ప్రాతినిధ్యం వహిస్తూనే, తన కళ్లతో చూసిన శ్రమజీవితాల్ని, వాళ్లనైపుణ్యాల్ని, వాళ్ల వెనకబాటుతనాన్ని పుటలమీదకి తీసుకొచ్చాడు. ఇందులో వీథిపుష్పం, గీతఘోష ఆ కోవలోనివి.

ఈతకల్లుగీత కార్మికుని జీవితాన్నిలా ముందు పరిచాడు..!

"భుజాన లొట్టి/నడుముకు మోకు/రెక్కల చాటు కత్తులు కట్టుకుని/ఇనుడు పూసేముందే/చెట్టుమీద పువ్వయి ఉదయిస్తాడు/ఆకాశంలోని వెన్నెలను తన మదిలోకి/ఒంపుకున్న చెట్టు/అతని చేయి సోకి అమృతమౌతుంది/పిడికెడు ముద్దకోసం/రోజూ నేలనుంచి ఆకాశం దాకా/చెట్టు సముద్రాన్ని ఈదినా/కడుపులో మొలిచిన పేగులచెట్టు/ఆకలిగాలికి/ఈతచెట్టై నిలబడలేకుంది"

పై పాదాల్లో గీతకార్మికుని నైపుణ్యాన్ని అందమైన భావచిత్రాలతో చిత్రికపట్టాడు. లొట్టి, మోకు, కత్తులు వంటి వృత్తిపరమైన మాటలు కావ్యస్థం చేసాడు. కత్తులను పెనకత్తి, గీతకత్తి అనివుంటే బాగుండేది. చెట్టుసముద్రం, పేగులచెట్టు, ఆకలిగాలి, గాలినది, బతుకుదండెం అనే రూపకాలు భావచిత్రాలను సౌందర్యవంతం చేశాయి. మరొక కవిత "జీవనదిలా.." ఇదివరకు ఎవరూ గ్రంథస్తం చేయని వస్తువు. ఆర్థిక బలమున్న వాళ్లింట్లో బతుకుస్థోమత లేని వయసు మళ్లిన వృద్ధతల్లులు ఇంటిపనులకు కుదురుకుంటారు. వంటపాత్రలు కడగడం, బియ్యం చెరగడం, ఇల్లు తుడవడం, ఫ్లోరు కడగడం, కూరలు తరగడం, బట్టలుతకడం వంటి పనులెన్నో చక్కగా చేస్తుంటారు. రాఘవేంద్ర కంటపడింది ఈ జీవితం. ఎలా రాసాడో గమనిద్దాం.

"నలిగిన కాయితం ముడతలు/అతికించుకున్న దేహంతో/మా వీథిలో/తిరగేసిన దినపత్రికలా/ఉదయాన్నే/కళ్లముందు రెపరెపలాడుతుంది/డెబ్బయి వసంతాలు/వయసు మీదేసుకున్న జీవనది/అనుభవాన్నంతా /భుజాలకెత్తుకున్నట్లు వంగిన నడుము" తో వున్న ఆమె బతుకుపోరాటానికి కాలం కూడా తెల్లముఖం వేస్తుందంటాడు. ఇంకా ఈ కవితలో తాత్వికఛాయలు కూడా మేళవించాడు.

ఏ కవైనా జీవితంలోంచి రాయాలి. బతుకే యుద్ధమైన జీవితాల గురించి రాయాలి. సమకాలిక దురాగతాలమీద, దుర్ఘటనల మీద సిరాని వాడాలి. రాఘవేంద్ర బాధ్యతతో వాడాడు. అందుకు "గాలికాటు", నిరుద్యోగితనం, నేను మీ గౌరీలంకేష్, నది మింగిన ప్రాణం, నీలిపడగ వంటి కవితలు బలమైన సాక్ష్యాలు. గోరఖ్ పూర్ ఘటనలో ఆక్సిజన్ అందక పిల్లలు చనిపోవడాన్ని ''గాలికాటు'' వదబంధం ఔచితీవంతంగా పొసగింది. ఈ కవి శీర్షికలు పెట్టడంలో సృజనాత్మకంగా ఆలోచించాడనే చెప్పవచ్చు. ఊడలమర్రి, జీవనదిలా, నీలిపడగ, రాతిముడి, మదిలో రాయి, మబ్బులఒడ ముఖ్యమైనవి. ఇంకా పాతపదాలననుసరించి కొత్తపదాలను ప్రయోగించే "అనాలజీ" శిల్పాన్నీ పాటించాడు. సంఘజీవిలా అసంఘజీవి అనడం, ప్రాణసంకటంలా వానసంకటం అనడం హృద్యంగా అనిపించింది. ఇక నిర్మాణపరంగానూ ఒడుపుని చూపించాడు.

సరళమైన కవితాశైలినే కవి ఎన్నుకున్నాడు. ఏ కవితకు ఎంత అవసరమో అంతే రాశాడు. కవితాత్మకత వాక్యాలనిండా ప్రతిఫలించేలా జాగ్రత్త పడ్డాడు. తొలి కావ్యమైనా తడబాటు లేకుండా కవితా సంవిధానాన్ని చొప్పించాడు. నప్పించాడు. మనచేత మెప్పించాడు. భావచిత్రాలు, అందులోకి సరిపడా అలంకారాలూ వాడుకుని తన తొలి కవితాచరణాల్ని పాఠకుల్ని సంపాదించుకునే వైపుగానే వేసాడనీ ఈ "గాయపడ్డ విత్తనం" నిరూపించింది. మంచి కవిత్వాన్ని అందించిన రాఘవేంద్రకు మనసారా అభినందనలు. ◆

కథ

# సుగాలీ కుటుంబం

- చింతా దీక్షితులు



చింతా దీక్షితులు (1896 - 1960)

పాత అధికారి వెళ్ళి కొత్త అధికారి వచ్చినాడన్న వార్త చుట్టుపట్ల నున్న గ్రామాల కన్నింటికీ తెలిసింది. ఇంత త్వరలో తెలియడానికి కారణము లేకపోలేదు.

ఈ ప్రాంతపు దేశమంతా అడవిమయము. ఆ అడవిలో ఒక భాగమునకు ఈయన అధికారి. ఏ వూరివాడో తెలియదు. అధికారము చెలాయించేటప్పుడు ముక్కు సూటిగా వెళ్ళడం ఈయన మతము. ఈ సంగతి ఈయనే పలువురితో చెప్పటం కద్దు. లోకులు ఈ సన్మార్గమును కాఠిన్యమన్నారు.

ఒకనాటి సాయంకాలం - ఈయన పాత్రకు పేరు వుండవలెను, గనుక ఈయనను మునిస్వామి అందాము - కంసాలివానికి వర్తమానము చేసినాడు. ముప్పది తులముల బంగారముతో చేయబడిన కంటె ఒకటి ఆయన భార్య పెట్టుకొనే అలంకారములలో ఒకటి. ఈ కంటెను చెరిపించి నలభైతులాల బంగారపు కంటె చేయించిపెట్టమని భార్య అడగడము కంసాలిని పిలిపించడమునకు కారణము.

కంసాలి వచ్చినాడు, అతనికి చెప్పవలసిన మాటలు చెప్పుతుండగా అడవి కాపరులు ఒక మనిషిని పట్టుకొని మునిస్వామి వద్దకు తీసుకువచ్చారు. అడవిలో నల్లమద్ది కొమ్మ కొట్టి యీ మనిషి తీసుకొని పోతుండగా కాపరులు పట్టుకొన్నారు.

మునిస్వామి విచారణలో తేలిన విషయమిది. ఈ మనిషి బండిచక్రమునకు కొన్ని ఆకులు విరిగిపోయినవట. కొనడానికెక్కడా కర్రలు దొరకలేదట. బండి తోలుకొని జీవించడమే అతని ప్రధాన వృత్తిట. అందుచేత అడవిలో కొమ్మ కొట్టిన మాట వాస్తవమట.

సన్మార్గగామియైన మునిస్వామి అతనిపై కేసు చేసినాడు. అడవి కేసులకు సాక్ష్యము మొదలైనవి అక్కరలేదు. అధికారి మాటా, మేజస్ట్రీటు శిక్షా నేరస్థుని కొంప గుండము! అడవి పరిపాలనలో న్యాయచక్రము పై మూటిమీద ఎప్పుడూ వర్తించుచుండును.

ఆ మనిషికి రెండు సంవత్సరముల కఠిన వరకము పడినది. మునిస్వామి వచ్చిన నెల లోపుగా ఇట్టివెన్నో జరిగినవి. ఆయన కీర్తి చంద్రికలు నాల్గువేపులా వ్యాపించినవంటే ఆశ్చర్యమేమి!

## 2

రాక్షసనామ సంవత్సరమున సకాలమున వర్షములు లేకపోవుటచేత కొన్నిచోట్లా, వర్షములు వెనక బట్టుటచేత కొన్ని చోట్లా కాటకము సిద్ధించినది. పచ్చని చేలుండవలసిన

తావులందు పత్రభూములు కానవచ్చుచున్నవి. సూర్యుని వేడిమి నానాటికి సహింపశక్యము గాకున్నది. నాగళ్ళు, గొఱ్ఱులు, జడ్డిగాలు, పాపటలు, మెట్టులు అన్నియు మూలకొదిగినవి. నూతులందు నీరు నానాటికి లోనికి పోవుచున్నది. చెరువు లెండుకుపోయినవి. విత్తనముల కొరకై వెనకటి సంవత్సరము దాచుకొన్న ధాన్యము, జొన్నలు, కొఱ్ఱలు ఈ సంవత్సరము గ్రాసమునకు వినియోగపడుచున్నవి, భూమిపై గడ్డి మొలవలేదు. అడవిలో చెట్లు చిగుర్చలేదు. ఆవులకు మేత లేదు. మనుష్యుల కావుపాలు లేవు.

"ఈ యేడు వర్షములు లేక పంటలు లేవు. తినడానికి తాటిపళ్ళైనా పడడంలే"దని ఒక మాలవాడు విలపించినాడు.

ఈ కాలమున మునిస్వామి అధికారములో నున్న అడవికి సమీపమున ఒక వూరిలో ఒక సుగాలీ కుటుంబము కాపురముండెను. ఈ కుటుంబము ఆ వూరికి రావడమునకు పూర్వము ఎర్రకొండలో వుండేదిట. అక్కడ వున్న చెంచువాళ్ళు వీళ్ళ కొంపలో పడి దోచుకొనడముచేతనూ, వీళ్ళ పశువులను తోలుకుపోవుటచేతనూ జీవనాధారము లేక యిక్కడకు వచ్చినారు. అడవిలో నివసించినచో చెంచువాళ్ళు బాధపెట్టుదురనే భయముచేత వూళ్ళోనే కాపురమున్నారు.

ఈ కుటుంబము కడు బీదస్థితిలో వున్నది. భార్యా, భర్తా, ఏడుగురు పిల్లలూను. వీరిపై దయదలచి ఒక బ్రాహ్మణుడు తన దొడ్డిలో వీరి నుండనిచ్చెను. ఆ దొడ్డిలో పాక వేసుకొని వీళ్లున్నారు.

సుగాలీవాళ్ళు అడవిజాతికి చేరినవారు. చెంచులు, ఎరుకులు, కోయిలు, లంబాడీలు, ఒడ్డలూ ఇట్టి అడవిజాతులే.

సుగాలులకు కొండలూ, అడవులూ నివాస స్థానము. వీళ్లు అడవులకు పిల్లలవంటివారు. అడవులు వీరిని కనును, అడవులు వీరిని పోషించును. అడవులు వీరిని భరించును. అడవులకు వీరు తమ ఆస్తులనర్పింతురు.

సుగాలీ స్త్రీలు అలంకారప్రియులు, వివాహితయైన సుగాలీ స్త్రీ చేతులకు ఎముకలతో చేసిన కంకణములను మోచేటివరకు ధరించును. బొంతలలో చిన్న చిన్న అద్దములను కుట్టి బొంతల కతికించి ఆ బొంతలను లంగావలె కట్టుకొనును. ఉరస్థలి పై కప్పుకొనును. రంగురంగుల గుడ్డలతో బొంతలను చేయుదురు. రంగులన్న వారికి ప్రీతి, వారి బొంత టోపీ తలపై ధరించుట కూడ కద్దు. సుగాలి స్త్రీలు సొగసుగా నుందురు. ఆరోగ్యము సౌందర్యమునకు వన్నె తెచ్చును. వీరికి ఆరోగ్యము సౌందర్యము కూడా కలవు.

పురుషులను స్త్రీలును కలసి పండుగ దినములలో నృత్యము సల్పెదరు. సుగాలీ భాషలో పదములు పాడెదరు.

అడవులలో కట్టెలను కొట్టి మోపులుగా గట్టి ఊరూరు దిరిగి వాటి నమ్మి జీవింతురు వీరు. ఇది కొందరి వృత్తి, కొందరు అడవులలో పశువులను మేపుకొని జీవింతురు.

ఈ సుగాలులు ఇతర అడవి జాతులవలెనే అప్పుడప్పుడు దారులు కాచి దొంగతము చేయుట కద్దు. అందు స్త్రీలు గూడ పాల్గొందురు. వీరిలో సాధారణముగా స్త్రీలు పురుషులకన్నా బలాఢ్యులు.

కాటకము నానాటికి తీవ్రమైపోయింది. మర్యాదగా కూలిపని చేసుకొని గుక్కెడు అంబలి త్రాగే వాళ్ళందరికీ చిప్ప చేతికి వచ్చింది. ఊళ్లల్లో యాచకుల సమ్మర్దము ఎక్కువ అయిందని పత్రికలలో మొరలు వినిపించెను. వీధులలో పాటలు పాడుకొనుచూ యాచకులు సంచారము చేయుచుండిరి. "వానదేవుడు పదములు" ఎల్లతావుల వినవచ్చుచుండెను.

*వాన దేవుడా ఓ వాన దేవుడా*
*ఇగ నెందు కున్నావు జగమేలు నాసామి*
*చినచిన్న మొలకలు జింకల పాలాయె*
*వేసిన చేలన్ని ఎండెండి పోయె*
*చక్కంటి మొగవాళ్ళు సూదులై పోయిరి*
*ఏకంత మొగవాళ్ళు ఎదవాడి ఉండిరి*
*గుంటిక కొట్టేవాళ్ళ గుండెలారుకు పాయె*
*నాగలి పట్టేవాళ్ళ నడుము లెండుకు పోయె*
*నెత్తిమీద సూర్యుడా నెల వన్నెకాడా*
*తల మీద సూర్యుడా దండంబు నీకు*
*ఏనుగంతెద్దులూ ఎత్తుబడి పోతాయి*
*గాడి కట్టిన పసరం కదేంకు పోలేదు*
*ఎక్కడా వున్నావో గ్రక్కునా కదులయ్య*
*కురిపించు నాసామి కుంభ వర్షాలు*
*కురవాక మాతోడ కువ్వారమేల*
*వానలు కురిపించి ప్రాణాలు రప్పించు*
*వంకలూనిండంగ వాగులూ నిండ*
*కురిపించు, నా సామి కుంభ వర్షాలు*

*వానదేవుడా ఓ వాన దేవుడా*
*ఇగనెంగుకున్నావు జగమేలు నాసామి*

3

ఈ సుగాలీ కుటుంబము కూలిపనులున్న రోజులలో కూలిపని చేసుకొని పొట్ట పోసుకునేవాళ్ళు. కాటకము వచ్చుట కూలిపనులు పోవుట ఒక్కమారు తటస్థించినది. కట్టెలు కొట్టుకొని అమ్మి జీవిస్తామంటే అడవి స్వాధీనములో లేదు. పశువులను కాచుకుందామంటే పశువులు లేవు. అడవిజాతివాళ్లని అడవిని అనుభవించ వద్దనడం పిల్లలను తల్లి వద్ద పాలు తాగరాదనడమే.

ఈ సుగాలీ కుటుంబమున యజమాని పేరు రూపల్ నాయక్, అతని భార్య పేరు చంద్రి. వీనికి కొడుకులు కూతుళ్లూ పాలు త్రాగు పిల్ల మొదలుకుని పదిహేనేళ్ళ వరకు వయస్సు వచ్చిన పిల్లలు ఏడుగురు. సూర్యనాయక్, రామనాయక్, పొటేల్ నాయక్, లక్ష్మి, సీత, బద్ధి, భారతి వాళ్ళ పేర్లు, తండ్రీ తల్లి పాటుపడి పిల్లల నందరనూ పోషించవలెను. పెద్దపిల్ల లక్ష్మికి పండ్రెండవ యేట వివాహమయినది. అత్తవారు తీసుకుపోయి బాధలుపెట్టడంవల్ల అత్తవారింటి నుంచి పారిపోయి వచ్చి తల్లి ఉన్న ఊళ్ళోనే ఒక శూద్ర కుటుంబములో చాకిరీకి ప్రవేశించి పొట్ట పోసుకుంటూంది లక్ష్మి.

తొలికోడి కుయ్యడంతోనే రూపల్ నాయకుడు చంద్రీ బయలుదేరి కొండమీదికి అడవులలోకి పోతూ ఉండడం వాడుక. పిల్లలందరూ ఇంటివద్దనే ఉందురు. అడవికి పోయి అక్కడే దేవదారు కూర, పింకి కాయలు, పాలపళ్ళు, వెలకపళ్ళు – ఏవి దొరికితే అవి తీసుకువచ్చి ఊరూరూ తిరిగి జొన్నలు, కొర్రలు పోగుచేసుకొని మధ్యాహ్నం ఒంటిగంటకు ఇంటికి వచ్చే వాడుక. అప్పుడు కొఱ్ఱన్నమో, జొన్న సంకటో, జొన్న రొట్టో తయారుచేసి తామింత తిని పిల్లల కింత పెట్టి ఆ రోజు గడుపుకునేవాళ్ళు.

సుగాలీవాళ్ళు కష్టపడి పనిచేసి యింత తింటారు గాని ఒకరిని దేహి అని చెయ్యి చాపి అడగరు. ఇస్తే వద్దనరు.

కొంత కాలం ఈ రీతిగా జరిగింది. ప్రజలలో క్షామము ప్రవేశించినది, ఆకుకూరలూ, పండ్లూ కొనేవాళ్ళ సంఖ్య నానాటికీ క్షీణించింది. ఇక చేయవలసినదేమి? చేయుటకు కూలిపనులు లేవు. కాయుటకు పశువులు లేవు. ఆకుకూరలు కొనుటకు మనుష్యులు లేరు. ఇట్టి స్థితిలో నున్నవారే కొందరు యాచకులౌదురు. ఇట్టి స్థితి నున్నవారే కొందరు దారులు కొట్టుటకు మొదలుపెట్టుదురు. ఎవరిదీ తప్పు? వారిదా?

అయిదారుగురు పిల్లలు రోటి చుట్టూ మూగినారు. వారెవరు? మోకాలిపై తల నుంచి ధ్యానము చేయుచు కూర్చున్నాడొక మూల అతడెవరు? వారి ముఖములు తేజోఃహీనమై ఉన్నవేల? వారి కడుపులు నడుములు కంటుకుపోయివేల? రోకలి చేతబూని ఒక్కరీతిగా దంచుచున్నది. అవి యేమి? ఆమె ఎవరు?

ఈత పండ్ల నక్కడక్కడ పోగు చేసుకొని వచ్చి వాని నెండబెట్టి తరువాత నా పళ్ళను దంచి గింజలను పారవేసి ఆ పొట్టుతో రొట్టెలను గాల్చుకొనుచున్నారు. రూపల్ నాయక్ కుటుంబము. మార్గము లేని వారికి భగవంతుడొక మార్గమును కల్పించక మానునా! కాలినది ఈత పొట్టుతో నయిన రొట్టె ఒకటి తినుటకు సిద్ధముగా నున్నవారు ఎనమండుగురు.

కొంత కాలమిట్లు గడిచినది. ఈతపళ్ళు కూడ కొన్నాళ్ళకు కరువైనవి. కావా! చెంచువాళ్ళు మాలమాదిగెలు సుగాలీ వాళ్ళు ఇందరికీ ఎంత కాలము ఈతపళ్ళు ఆధారమై వుండగలవు? ఇంక సాధనమేమి?

ఒకనాటి ఉదయమున రూపల్ నాయక్ చంద్రీ యిద్దరూ తట్టలు చేతితో పట్టుకుపోయినారు. వాళ్ళ పిల్లలు ఊరిలో వీళ్ళ గడపలూ వాళ్ళ గడపలూ పట్టుకొని కాలము బుచ్చుచున్నారు. మధ్యాహ్న మగుసరికి భార్యా భర్తలిద్దరూ తట్టెడు చింతగింజలను తెచ్చినారు. అవి యేల! ఆ చింతగింజలను రోటిలో ఇద్దరూ దంచినారు. నీళ్లల్లో నానవేసి కడిగినారు. ఎండబెట్టి తిరుగలితో విసరినారు. నల్లటి పిండి తయారైనది. వీరు చేయు పనులను పండ్రెండు కన్నులు చూస్తూ ఉన్నవి. ఈ పిండితో సాయంత్రమగుసరికి రెండు రొట్టెలు తయారైనవి. మెడ పట్టులు పట్టుకొనుచూ తమకు తక్కువైనదని కొట్లాడచూ పిల్లలూ దంపతులూ ఆ రొట్టెలను తిన్నారు. ఇంత నీరు త్రాగినారు. ఆ దినమునకు భగవంతుడింత యిచ్చినాడు. హాయిగా రాత్రి అందరూ వెన్నెలలో విచారము లేకుండా నిద్రపోయినారు.

కొంత కాలము రీతిగా జరిగినది. చింతగింజలకు కూడా కరవైనది. కొన్నాళ్ళకు చింతగింజలను వర్తకులు అమ్మ మొదలుపెట్టిరి. పడి అర్ధణా! అర్ధణా ఆ సుగాలీ వాళ్ళకు

ఎక్కడినుంచి వచ్చును? ఇక చేయునదేమి?

ఒకనాటి సాయంకాలము ఒక సుగాలీ కుటుంబము ఆరుబయట ఆకులలో నల్లటి పదార్థము పెట్టుకొని ఆత్రముగా తినుచున్నారు. ఆ నల్లటి పదార్థమేమిటి? చింతచిగురూ చింతపండూ బూడిదలో కలిపి పొయ్యిమీద ఉడికించగా తయారైన పదార్థము. ఈ అంబలి త్రాగి కడుపు నిండి నీళ్ళు త్రాగి చింతలేక హాయిగా నిద్రపోయిరి. ఇట్లు కొన్నాళ్ళు అడవిలో చింతపండు తెస్తూఉన్న వాళ్లకు శిక్ష పడుతూందని వదంతి పుట్టింది. ఇక చేయవలసినదేమి?

దేవదారు కూర మిగిలిన ఆకుకూరల వలె గాక కొంత సువాసన కలిగియుండును, దీనిని బ్రాహ్మణులు పప్పులో వేసి వండుకొందురు. ఇది మెంతికూర పప్పు వలె నుండును అడవులలో తిరిగేవాళ్ళు ఈ కూరను ఊరివారికి బియ్యమునకూ, జొన్నలకూ అమ్ముదురు. కొనువారు లేనప్పుడో?

అడవి సమీపమున నున్న దేవదారు చెట్ల నాశ్రయించి మధ్యాహ్న మగుసరిగి ఒక తట్టెడు దేవదారు కూర తెచ్చినారు. ఈ సుగాలి దంపతులు కుండలో ఆ కూరను బోసి నీళ్ళు పోసి ఉడకబెట్టి దించినారు. ఆకులలో బెట్టుకుని పిల్లలూ తల్లీ తండ్రీ కడుపు నిండి తిన్నారు. హాయిగా నిద్రపోయినారు.

ఈ రీతిగా కొన్నాళ్ళు జరిగింది. అడవి యంచులనున్న కూర నానాటికి తరిగిపోయినది. ఇక చేయవలసినదేమి?

నడిరాత్రి బయలుదేరి ఎవ్వరూ చూడకుండా యింత దేవదారు కూర దూసుకొని వచ్చి తెల్లవారుసరికి ఇల్లు చేరి ఆరోజు గడుపుకొనవలసివచ్చింది. ఇట్లు కొంత కాలము గడిచినది. ఒకనాడు తోవలో నలుగురు మాలవాళ్ళు కనిపించినారు. రెండు రోజులకు ముందు వారు దేవదారు కూర ఆ రీతిగా తీసుకుపోవుచుండగా అడవి కాపరులు పట్టుకొనిరట. నూతనోద్యోగి కడకు తీసుకుపోయిరట. బొటనవ్రేలి ముద్రలను వేయించుకొన్నారట. ఈ వర్తమానము సుగాలి దంపతులకు తెలియవచ్చినది. ఇక అడవికి పోవుట ఎట్లు? పొట్ట పోషించుకొనుటెట్లు? పిల్లలను పోషించుట ఎట్లు?

రెండు రోజులపాటు సుగాలీ కుటుంబమునకు తిండి లేదు. దిగుడు బావిలో నుంచి తెచ్చుకున్న నీళ్ళే తిన్నారు. ఆ నీళ్ళే త్రాగినారు. వెన్నెలలో సుఖముగా నిద్రపోయినారు. రెండు రోజులు గడిచినవి. ఇట్లెన్ని రోజులు గడుచును?

కష్టమున నున్నవారికి భయము తక్కువ, నీకున్నను భయముండదు. అధికారులన్న భయమా! మృగములన్న భయమా! తోడివారన్న భయమా! ఆపత్తులు సంభవించునని భయమా? భయము లేకున్ననేమగును? కష్టములు వచ్చును. ఉన్న కష్టములలో అవి కలసిపోవును. ఇంక భయమెందుకు.

మరింత జాగ్రత్తగా దేవదారు కూర అడవులలో నుంచి వారు తెచ్చుకొనక తప్పినది కాదు. కొంత కాలము సరిగానే జరిగినది. ఒకనాడు రూపల్ నాయక్ అడవిలో దేవదారు కూర కోయుచుండెను. చంద్రి కొండలలో ఒక చరియలో ఈతచెట్టుకు పళ్ళున్నవని విని ఆ పళ్ళకోసము అక్కడకు వెళ్ళినది.

రూపల్ నాయకుడు ఒడి నిండా కూర కోసుకొని అడవి దాటివస్తూ ఉన్నాడు. ఇద్దరు అడవి కాపరులు అతనిని అడ్డగించినారు. పారిపోయినాడు. వరుఃగెత్తి వానిని పట్టుకొన్నారు. అతనిని పరీక్షించినారు. దేవదారు కూర కానవచ్చినది. మునుస్వామి కడకు తీసుకుపోయినారు. దేవదారు కూర కోసినట్లును కొమ్మలను విరిచినట్లును కేసు. కూర కొయ్యడం తప్పుకాదు. కొమ్మలు విరవడం నేరము. కొమ్మలు విరవడం ఎందుకు? వట్టికుపోయి అమ్ముకుందామనే కదా, అడవికి నష్టము కలుగజేయవలెననే ఉద్దేశ్యమే కదా. మేస్ట్రీటు వద్ద కేసు జరిగింది. రూపల్ నాయకుడు దీనముగా చెప్పుకున్నాడు. "తనకు ఏడుగురు పిల్లలనీ, కూలిపని చేసుకోవడము వృత్తనీ, కూలిపనులు లేవనీ, తిందామంటే ఈత పళ్ళు కరవయినవి. బూడిద తాగుదామంటే చింతపండు కరవయింది. చింతపిక్కలు తిందామంటే ఖరీదైనవి. దేవదారు కూరపై అతని కుటుంబమంతా ఆధారపడి యున్నది. అతడు కొమ్మలు విరవలేదట. కూర కోసుకున్నట్లు ఒప్పుకున్నాడు.

మేస్ట్రీటు నూతనోద్యోగి చాకచక్యమును మెచ్చుకున్నాడు. సుగాలీ వానికి నాలుగు ఏళ్లు ఖయిదు విధించినాడు.

**5**

చంద్రి ఈతపళ్ళను ఇంటికి తెచ్చుసరికి రూపల్ నాయకుడు ఇంటికి రాలేదు. ఎక్కడైన కూలికి పోయినాడేమో అని సంతోషించింది. ఈత రొట్టెలను పిలకు పెట్టి తాను తిన్నది. రెండు రోజులపాటు రూపల్ నాయకుడు ఇంటికి

# ఇల్లుఖాళీ చేసి వెళ్ళిపోవడం

- బుర్రా సాయిబాబు
9291291751

ఇల్లుఖాళీ చేసి వెళ్ళిపోవడం
అంత సులభమయితే కాదు
కొన్ని అనుబంధాలని కోల్పోవడమే
చంటిదాని నవ్వుల పువ్వులు
నేలమీద దొర్లుతూనే ఉంటాయి
చంటాడు గుమ్మం మీదపడ్డప్పుటి
పెదాల గాయం ఇంకా అక్కడే ఉంది
బాల్కనీ మీద దండాలు
పరాయీకరించబడతాయని ఊహించడం
వేరొకరు ఆక్రమించ ఒడిన కోటమీద
కొత్త జండాలాగ అనిపిస్తుంది
ఇంటి ముందు ఎదురు చూసిన కొన్ని కళ్ళు
ఇంకా అంటి పెట్టుకునే ఉంటాయి
బాల్కనీలో గూడుకట్టిన పక్షి నమ్మకం
ప్రశ్నలమీద ప్రశ్నలు వేస్తూ అరుస్తూ ఉంటుంది.
అద్దె ఇల్లే కావచ్చు , వెళ్ళేది మరొక ఇంటికే కావచ్చు
ఇంటి తీరు మీద అభిరుచి రంగరించిన కొత్త రూపు ,



దాని వెనక వున్న శ్రమ, అన్నీ వ్యృధా అని తెలిసాక
ఒక వైరాగ్యం మనసు చుట్టూ అల్లుకుంటుంది
ఇన్నాళ్ళూ ఆశ్రయమిచ్చిన ఇల్లు రేపు మనది కాదు!
రేపు శరీరం కూడా ఇంతే కదా!!. ◆

---

రాకుండడము అలవాటే.

రెండు రోజులు పోయిన మీదట తన భర్తకు ఖయిదు వేసినారని చంద్రికి తెలిసింది. ఏమి చేయగలదు? తన రెక్కలతో ఇందరిని పోషించగలదా! ఎడపిల్లను పెద్దపిల్లకు అప్పగించి చంటిపిల్లను చంక బెట్టుకొని ఒకనాడు ప్రయాణమై తెల్లగొండలకేసి పోయింది. తెల్లకొండలలో దాని చుట్టాలున్నారట. ఈ సంగతి వూరివారికి తెలియదు.

పాకలో నలుగురు పిల్లలు తల్లిదండ్రులకోసము ఆనాటి మధ్యాహ్నమువరకు వేచియుండిరి. ఎవ్వరూ రాలేదు. పాకను విడిచి వూరిలో ఆ నలుగురూ వేర్వేరు దిక్కులకు బోయిరి. వారేమయిరో ఎక్కడుండిరో ఎవరికీ తెలియదు. భూదేవి వారిని కన్నది. భూదేవి వారిని మరల స్వీకరించినది.

రూపల్ నాయకుడు నాలుగేండ్లయిన తర్వాత ఆ వూరు వచ్చినాడు. తన కుటుంబము లేదు. భార్య తెల్లకొండలకో ఎక్కడికో పోయిందనీ పిల్ల లెక్కడకో పోయినారనీ పొరుగువాళ్ళు చెప్పినారు. రూపల్ నాయకుడు ఆ రోజునే బయలుదేరి తెల్లకొండలకు బోయినాడు. అక్కడ వాని భార్య కానరాలేదు. మునుస్వామి నానాటికి ధనము గడించడము మొదలుపెట్టినాడు. సాలుకు ఇంత యిచ్చే పద్ధతిమీద తనకు తెలియకుండా అడవి నరకు తెచ్చుకొనవచ్చునని లోపాయికారిగా అడవి మనుష్యులతో రాజీపడ్డాడు. కేసులు తక్కువైనవి. అధికారి సామర్థ్యమునకు దొరతనము సంతోషించినది.

అది విషజ్వరముల కాలము. ఊరూరా, దేశదేశములా విషజ్వరములే, ఎందరో దాని వాతబడిరి. మునుస్వామి యింట ప్రవేశించినదీ విషజ్వరము. భార్యా ఇద్దరు పిల్లలూ పది రోజులలో ఎగిరిపోయినారు.

మునుస్వామి ఒక్కడు, నా అన్నవాళ్ళు లేరు. ధనమునే చుట్టముగా చూచుకొన మొదలుపెట్టినాడు. క్రమక్రముగా మునుస్వామి ప్రవర్తనపై అధికారులకు తెలియవచ్చినది. విచారణ జరిగినది. మునుస్వామిని ఉద్యోగము నుండి తొలగించిరి.

చిన్ననాటి బంధువులతోను, మిత్రులతోను జీవితము గడపవచ్చునని స్వగ్రామము పోయినాడు. మునిస్వామి మిత్రబంధుకోటి ఆ గ్రామముననతనికి కరవైనది. ◆



# పోలింగుపై విమర్శలు.. ఆధిక్యతపై అతిశయాలు..

- తెలకపల్లి రవి

ఇరు శిబిరాలు దాదాపు 130 అనే చెప్పుకుంటున్నాయి. అయితే అన్ని సీట్లు లేవు గనక ఒకరికే ఆధిక్యత సాధ్యం. వైసీపీకి కొంత ఆధిక్యత వుండొచ్చనే అభిప్రాయం ఎక్కువగా వినిపిస్తుంది. ఇది పార్లమెంటు ఎన్నికలలో ఎక్కువగా కనిపించవచ్చు. జనసేన, కమ్యూనిస్టు పార్టీలు, బిఎస్‌పి కూడా చాలా చోట్ల 20 నుంచి 30 శాతం ఓట్లు తీసుకున్న కారణంగా శాసనసభ ఎన్నికలలో అంత ఆధిక్యత వుండకపోవచ్చు.

ప్రస్తుత ఆంధ్ర ప్రదేశ్ రాజకీయ రంగస్థలాన్ని చూస్తుంటే నాటకం ముగిసినా ప్రధాన నటులు విజృంభించి నటన కొనసాగిస్తున్నట్టు కనిపిస్తుంది. మామూలుగా పోలింగ్ ముగిశాక ఘటనల బాధితులను పరామర్శించడం, అవకతవకలపై ఫిర్యాదులు, ఓటర్లకు కృతజ్ఞతలు వంటివి చూస్తాం. మేము గెలుస్తామని విశ్వాసం ప్రకటించడం కూడా జరుగుతుంటుంది. ఏపీలో వీటన్నిటితో పాటు పోలింగ్ పూర్వ నిందారోపణల పర్వం కొనసాగుతున్నది. విజయంపై విశ్వాసం కూడా లాంఛనంగా గాక నిర్ధారిత సత్యంలా ప్రచారం చేసుకుంటున్నారు. 'ఏ.పి లో ప్రభుత్వ అధినేత ప్రతిపక్ష నాయకుడిలా, ప్రతిపక్ష నేత ముఖ్యమంత్రిలా మాట్లాడుతున్నారా?' అని ఒక ఇంగ్లీషు పత్రిక ప్రతినిధి నన్నడిగారు. 'అలా పాత్రలు మార్చుకోవడమే గాక అతిగా కూడా నటిస్తున్నారు' అని నేను జవాబు చెప్పాను. ఈ తతంగానికి ప్రజలు, మీడియా కూడా చాలా కాలంగా అలవాటు పడిపోయారు. కాని పోలింగ్‌తో కాస్త ఉపశమనం లభిస్తుందన్న ఆశ కూడా ఆవిరై పోయింది.

**ఇరువైపులా పాక్షికత్వం**

పోలింగ్‌లో ఈవీఎంలు మొరాయించడం కొత్త ఏమీ కాదు. తెలంగాణ లోనూ 300 ఈవీఎంలతో సమస్యలు వచ్చినట్టు సమాచారం వుంది. అయితే ఎ.పి లో దాదాపు 500 వరకూ ఇబ్బంది పెట్టడం ఎక్కువే. తత్కారణంగా మధ్యాహ్నం వరకూ ఓటింగు వాయిదా పడటం, చాలా చోట్ల అర్ధరాత్రి వొంటి గంట దాటాక కూడా కొనసాగడం విపరీతమే. ముఖ్యమంత్రి పోలింగ్ మధ్యలో వచ్చి వెళ్లి ఓటు వేయండని పిలుపివ్వడం, ఆయన కుమారుడు స్వయంగా మంత్రి అయిన లోకేశ్ రాత్రి ధర్నా చేయడం వంటివి కూడా గతంలో ఎరుగని ఘటనలే. చంద్రబాబు నాయుడు ముందు రోజే ధర్నా చేశారు. పోలింగ్ రోజు ఫిర్యాదులు చేశారు. ఈవీఎంల సమర్థతపై సందేహాలు పెరిగినందున బ్యాలట్ పేపర్‌కు తిరిగి వెళ్లాలని పోలింగ్ మధ్యలో ఎన్నికల ప్రధానాధికారికి లేఖ రాశారు.

80 శాతం పైగా ఓటింగు జరిగినట్టు లెక్కలు చెబుతున్నా 'ఓటరు స్ఫూర్తికి ఈసీ తూట్లు' అనే తీవ్రమైన శీర్షిక ఇచ్చింది ఒక అగ్ర పత్రిక. ఇది ఇలా వుంటే మరోవైపు ప్రతిపక్ష వైసీపీ ఎన్నికల సంఘం తరపున తను వకాల్తా తీసుకున్నట్టు ఈ ఆరోపణలన్నీ కొట్టేసింది. పోలింగ్ రోజు సాయంత్రం మాట్లాడిన జగన్ తను ఘన విజయం సాధిస్తున్నట్టు చెప్పి ప్రభుత్వంపై విమర్శలు గుప్పించారు. ఇంత భారీ పోలింగ్ జరిగితే ఈసీని ఎందుకు విమర్శించాలన్నట్టు మాట్లాడారు. ఇంకోవైపున ఈ రెండు పార్టీలు పోలింగులో మీరు కుట్రలు చేశారంటే మీరు కుట్రలు చేశారని ఆరోపించుకున్నారు.

మ్యాక్ పోలింగ్ తర్వాత ఒకరిద్దరు బాగానే ఓట్లు వేశాక ఈవీఎంలు ఎందుకు పని చేయలేదనే దానిపై సంతృప్తికరమైన వివరణ లేదు. కంప్యూటర్లు ఇబ్బంది పెట్టడం మామూలేనని కొందరు అంటుంటే కావాలని అధికారులు రాజకీయ కోణాలతో నిలిపేశారని మరికొందరు అంటారు. వచ్చిన వారి ఓటింగు సరళిని బట్టి ఇదంతా చేశారనేది టిడిపి ఆరోపణ సారాంశం. అలాగే టిడిపి వారు తమకు వ్యతిరేకంగా ఓటేస్తున్న వారిని నిలవరించేందుకే రభస చేసి ఆలస్యానికి కారకులయ్యారనేది వైసీపీ వాదన. ఇది గాక పరస్పర దాడులు, హింసాత్మక ఘర్షణలు, ఇద్దరి మృతి, స్పీకర్ పైనా దాడి వంటి ఘటనలు వాతావరణాన్ని ఉద్రిక్తం చేశాయి. ఇందులో ఎక్కువ భాగం సమస్యాత్మక ప్రాంతాలైనా ముందు జాగ్రత్త చర్యలు తీసుకోవడంలో వైఫల్యం స్పష్టంగా కనిపిస్తుంది. ప్రభుత్వం సరిగా చేయడం లేదని బాధ్యత తనే తీసుకున్న ఎన్నికల సంఘం వీటిని ఎందుకు అనుమతించింది?

**ఈసీ నిర్లిప్తత**

దాదాపు రెండేళ్ల నుంచి రాష్ట్రంలో ఎన్నికల వాతావరణమే తిష్ట వేసింది. చంద్రబాబు, జగన్ ఉభయులూ ఆ భాషలోనే మాట్లాడుతూ వచ్చారు. అయినా తృప్తి లేనట్టు పోలింగ్ రోజున కూడా పరోక్ష ప్రచారం చేసుకున్నారు. 'మార్పు కోసం ఓటు చేయండి' అని జగన్ అంటే...'వెళ్లి పోలింగ్ లో పాల్గొని అరాచకాన్ని ఓడించి రాష్ట్రానికి న్యాయం చేయండి' అని చంద్రబాబు పచ్చ చొక్కాతో వీడియో విడుదల చేశారు. 'నిర్భయంగా ఓటు చేయండి' అన్న జగన్ గాని, 'అరాచకాన్ని తుద ముట్టించండి' అన్న చంద్రబాబు గాని తమ వారికి కూడా ప్రశాంతత పాటించాలని చెప్పకపోవడం గమనించదగ్గది. నిజానికి విజయవాడలో సిపిఎం అభ్యర్థి బాబూరావుపై పోలీసు ఎస్ఐ అనుచితంగా ప్రవర్తించారు. ఇలాంటి ఘటనలు ఇతర చోట్ల కూడా సంభవించాయి. ఈసీకి టిడిపి పదే పదే ఆరోపణలు చేస్తుంటే రాష్ట్ర ప్రధాన ఎన్నికల అధికారి గోపాలకృష్ణ ద్వివేదీ తను కూడా అసహనానికి లోనై సమర్థించుకున్నారే గాని సమన్వయం చేసి సమస్యలు పరిష్కరించేందుకు ప్రాధాన్యత ఇవ్వలేదు. ఇన్ని వందల ఈవీఎం లోపాలు గాని పోలింగు విపరీత జాప్యం గాని ఆయన పెద్ద సమస్యగా తీసుకోకపోవడం ఆశ్చర్యం కలిగిస్తుంది. ఎన్నికల సంఘాన్ని విమర్శించడం రాజ్యాంగ వ్యతిరేకమైనట్టు వైసీపీ నేతలు మాట్లాడ్డం విడ్డూరమే. ఇందిరాగాంధీ హయాం నుంచి ఇలాంటి ఫిర్యాదులున్నాయి. ఇప్పుడు కూడా వీవీ ప్యాట్ల లెక్కింపు, ఈవీఎంల పటిష్టత వంటి విషయాలపై అన్ని పార్టీలు ఫిర్యాదు చేయగా సుప్రీం కోర్టు అయిదు ప్యాట్లు లెక్కించాలని ఆదేశించింది. అయితే ఆ సాధారణ ఫిర్యాదులను ఇప్పుడు రాష్ట్రంలో వచ్చిన నిర్వహణ సమస్యలు తదితర ఆరోపణలను చంద్రబాబు కలగాపులగం చేశారు. సమస్యలు వచ్చిన చోట్ల, ఈవీఎంలను మార్చిన చోట్ల సందేహాల నివృత్తికి రీపోలింగ్ వంటి చర్యలు తీసుకోవాలని సిపిఎం తన ప్రకటనలో కోరింది. అలా గాక టిడిపి, వైసీపీ దీన్ని కూడా రాజకీయ వాదోపవాదాలుగా మార్చి వివాదం, ఉద్రిక్తత సాగదీస్తున్నాయి.

శనివారం ఢిల్లీలో ఎన్నికల సంఘాన్ని కలుసుకున్న చంద్రబాబు తనకు వారి వివరణ సంతృప్తి కలిగించలేదని, పోరాటం కొనసాగిస్తానని ప్రకటించారు. మరో వంక వైసీపీ ఎం.పి విజయసాయి రెడ్డి మొన్నటి ఘటనలను పూర్తిగా వదిలేసి ఈవీఎంల భద్రత కోసం రాష్ట్ర పోలీసులను గాక కేంద్ర బలగాలను నియమించాలని కోరారు. ఈ విధంగా ప్రతిదానికి కేంద్ర జోక్యం కోరడం సమాఖ్య విధానానికి విఘాతమే. ప్రధాని మోడీ ఆధ్వర్యంలో ప్రతిపక్ష పార్టీల పైన, రాష్ట్రాల పైన ఏకపక్షంగా దాడులు జరుగుతున్నాయని దేశమంతా ఘోషిస్తున్నది. ఎన్నికల సంఘం కూడా ఈడీ, ఐ.టి దాడులు తమకు తెలియకుండా జరగడంపై ఫిర్యాదు చేసింది. కేంద్రం ఒత్తిడికి అనేకసార్లు తలొగ్గినప్పటికీ చాలా విషయాల్లో బిజెపి వైఖరినీ ప్రధాని పోకడలను కూడా ఈసీ

ప్రశ్నించక తప్పలేదు. ఇలాంటి పరిస్థితులలో వైసీపీ మాత్రం రాష్ట్రంపై విమర్శల కారణంగా అన్నిటినీ కేంద్రం నిర్వహించాలని కోరడం సందేహాలను పెంచు తుంది. ఏది ఏమైనా ఎన్నికల సంఘం తీసుకున్న దిద్దుబాటు చర్యలు ఇచ్చిన వివరణలు సంతృప్తికరంగా లేవు.

**పెరిగిన ఓటింగులో జనసేన కూటమి**

ఈ వాదోపవాదాలు ఒక ఎత్తయితే వీటి ఆధారంగా తమ విజయావకాశాల గురించి చెప్పుకుంటున్న గొప్పలు మరీ అతిశయంగా వున్నాయి. ఎన్నికల్లో కుట్రలు విఫలం చేసేందుకై చంద్రబాబు రంగంలోకి దిగి మధ్యలో ఇచ్చిన పిలుపు వల్ల మహిళలు వెల్లువగా వచ్చారు గనక తాము గెలిచేస్తామని టిడిపి నేతలు బహిరంగం గానే చెప్పుకుంటున్నారు. ఆ స్త్రీలంతా తమ పసుపు కుంకుమతో వచ్చిన వారేనని వారి వాదనగా వుంది. అయితే అన్ని పార్టీల అభిమానుల లోనూ స్త్రీలుంటారనీ ఈ నాయకులకు ఎందుకు తట్టడం లేదో అర్థం కాదు. మన పార్టీని గెలిపించుకోవాలనే బహిరంగ పిలుపుతో టిడిపి వారు తరలి వస్తే ఓడించాలని ఇతరులు రారా? పైగా ఈసారి డబ్బు పంపిణీ ప్రక్రియ చాలా పకడ్బందీగా లెక్కలతో సహా జరగడంతో ఓటేసి చూపకపోతే సదరు దళారీలు వదలిపెట్టబోరన్న భయం కూడా చాలా మందిపై పని చేసింది. ఇవేగాక జనాకర్షణ గల పవన్ కళ్యాణ్ జనసేన, ఆయా కేంద్రాలలో పట్టు గల కమ్యూనిస్టు ఓటర్లు కూడా భారీగానే తరలి వచ్చారు. చాలా చోట్ల 20, 30 శాతం పెంపు దలకు ఇది కూడా కారణమైంది. టిడిపి, వైసీపీలలా హంగామా చేయని నిశ్శబ్దమైన ఈ ఓటింగును కూడా పరిగణన లోకి తీసుకుంటేనే పోలింగ్ దృశ్యం పరిపూర్ణమవుతుంది. యువత, మహిళలు తృతీయ శక్తి ప్రభావంతోనే ఉత్సాహంగా ఓటింగుకు వచ్చారు. విద్యార్థులు కూడా గతంలో కంటే ఎక్కువగా ఓటింగులో పాల్గొన్నారు. కనుక టిడిపి వైసీపీ పెరిగిన ఓటింగు మొత్తం తమ ఖాతాలలో వేసుకుని అతిగా ఆనందపడటం హాస్యాస్పదం.

**శృతి మించిన ఆశలు, అనిశ్చితి**

ఏమైనా పోలింగు ముగిసిపోయింది గనక విజయావకాశాలపై చర్చ మొదలైపోయింది. దీనిపై పెనుజాడ్యంలా మారిన బెట్టింగుల క్రీడ కూడా నడుస్తున్నది. మేము అఖండ విజయం సాధిస్తామని జగన్ అంటే, 130 వరకూ వస్తాయని చంద్రబాబు అన్నట్టు లీకులు ఇచ్చారు. రకరకాల సర్వేలు, ఎగ్జిట్‌పోల్స్ జరిగాయి గాని నిబంధనల కారణంగా ప్రకటించడం లేదు. ఇరు శిబిరాలు దాదాపు 130 అనే చెప్పుకుంటున్నాయి. అయితే అన్ని సీట్లు లేవు గనక ఒకరికే ఆధిక్యత సాధ్యం. వైసీపీకి కొంత ఆధిక్యత వుండొచ్చనే అభిప్రాయం ఎక్కువగా వినిపిస్తుంది. ఇది పార్లమెంటు ఎన్నికలలో ఎక్కువగా కనిపించవచ్చు. జనసేన, కమ్యూనిస్టు పార్టీలు, బిఎస్‌పి కూడా చాలా చోట్ల 20 నుంచి 30 శాతం ఓట్లు తీసుకున్న కారణంగా శాసనసభ ఎన్నికలలో అంత ఆధిక్యత వుండక పోవచ్చు. వైఎస్ హయాం లోనూ త్రిముఖ విభజన కారణంగా 36 లోక్‌సభ స్థానాలు, 152 శాసనసభ స్థానాలు వచ్చిన తరహాలో ఏదైనా జరగొచ్చు. పథకాల ప్రభావంతో ప్రభుత్వం పట్ల అనుకూలత గురించి టిడిపి చెప్పుకునేది పాక్షికంగానే వాస్తవం. వ్యతిరేకతే అధికంగా వుంది. అందుకు అనేక కారణాలున్నాయి. అదే వైసీపీకి అనుకూలతగా మారడం తప్ప మరేదో మహత్తరంగా వారు ఆకర్షించారని చెప్పడానికి లేదు. దాన్ని అతిగా ఊహించుకుని అప్పుడే అధికార పీఠం ఎక్కేసినట్టు ప్రవర్తించడం తొందర పాటే. బిజెపి ఇప్పటికే చేతులెత్తేసినట్టు జీవిఎల్ నరసింహారావు ప్రకటనే తేల్చిచెప్పింది. కాంగ్రెస్ ప్రభావ శూన్యంగానే మిగిలిపోయింది. ఆ కాంగ్రెస్ తో టిడిపి సంబంధాలలో అస్పష్టత కారణంగానే లోక్‌సభ స్థానాల్లో వైసీపీ కొంత ఆధిక్యత సంపాదించి వుండొచ్చు. కాగా ప్రభుత్వంపై ఉద్యమాలు చేసిన కమ్యూనిస్టులు-జనసేన కూటమి కూడా విస్తృతంగానే ప్రజాదరణ పొందింది గనక వారికి కూడా బాగానే ఓట్లు పడినట్టు కనిపిస్తుంది. ఇది కొన్ని జిల్లాల్లో బాగా ఎక్కువగా, మరికొన్ని చోట్ల కొంత పరిమితంగా వుండొచ్చు గాని వ్యతిరేకులు చెప్పేదానికన్నా ఎక్కువగా వుంటుంది. టిడిపితో జనసేన కుమ్మక్కు యిందని జగన్ పదేపదే ఆరోపణలు చేసినా ఆచరణలో మాత్రం ప్రభుత్వానికి వ్యతిరేకంగానే జనసేన కూటమి ఓట్లు పొందినట్టు కనిపిస్తుంది. ఆ కారణంగానే వైసీపీ తన ఆధిక్యత గురించి అంచనాలు వేసుకునే అవకాశం ఏర్పడింది. జనసేన కూటమి ఓటింగును బట్టి, స్థానిక పరిస్థితులను బట్టి శాసనసభలో అనిశ్చితికి కూడా అవకాశం వుండదని చెప్పలేము. కాబట్టి మిగిలింది నిరీక్షణా వీక్షణమే. వీరంగం వేస్తున్న టిడిపి వైసీపీ నేతలు ఉభయులూ ఈ దశలో సంయమనం అవసరమని గుర్తింతురు గాక! ◆

# కందుకూరి శతవర్ధంతి - మహిళా సాధికారత



- పసుమర్తి పద్మజవాణి
9705377315

సంఘసంస్కర్త, నవయుగ వైతాళికుడు, బహుముఖ క్రాంతదర్శి శ్రీ కందుకూరి వీరేశలింగం గారి శతవర్ధంతి సందర్భంగా ఏప్రిల్ 14న కాకినాడ సాహితీస్రవంతి మహిళా విభాగం ఆధ్వర్యంలో సభ జరిగింది. గాంధీభవన్, కాకినాడ వేదికగా జరిగిన ఈ సభకి కొన్ని ప్రత్యేకతలు ఉన్నాయి. మహిళాభ్యుదయం కోసం తన జీవితకాలమంతా పాటుపడిన ఆ మహనీయుని రచనల్ని, సంస్కరణల్ని స్మరిస్తూనే రాబోయే తరాల్లో మహిళా ఉపన్యాసకుల్ని తయారుచెయ్యటం కోసం నలుగురు యువతుల్ని ఎంపిక చేయడం జరిగింది. వీరందరూ మంచి పఠితలు. చదివిన అంశాలను స్పష్టంగా మాటలలోను, రాతలలోను పెట్టగల నిపుణులు. కందుకూరి ని వారు ఏ కోణాల్లో దర్శించారో చెప్పాల్సిందిగా కోరాం. అంతేకాకుండా వాటిని వ్యాసాల రూపంలో డి.టి.పి. చేయించి, ప్రస్తుత చర్యగా ఒక పుస్తకంగా తెచ్చే ప్రయత్నం చేసి, ఆవిష్కరించటం జరిగింది. కేవలం మహిళలే నిర్వహించిన ఈ సభ మహిళా సాధికారత సభగా వీరేశలింగం దంపతుల స్మృతికి అంకితం ఇవ్వటం జరిగింది

ఈ సభకి అధ్యక్షత వహించిన పద్మజవాణి మాట్లాడుతూ, వీరేశలింగం గారి బాల్యం, గొప్ప సంస్కర్తగా వారి వ్యక్తిత్వం రూపుదిద్దుకున్న క్రమం వివరించారు. భార్య శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ గారి సహకారంతో సుమారు 60 కి పైగా వితంతువులకి పునర్వివాహాలు జరిపించి, మోడువారిన జీవితాల్లోకి వెలుగులు నింపిన మహనీయుడుగా కీర్తించారు. బాల్యవివాహాలు, భ్రూణ హత్యలు, ఆడపిల్ల పుడితే ఆ పసికందుల్ని ముళ్ళపొదల్లోకి విసిరేయడం లాంటి అమానవీయ అకృత్యాలు, స్త్రీలపైన అత్యాచారాలు, దుష్టసంప్రదాయాలు మళ్ళీ జీవం పోసుకుని పెచ్చుపెరుగుతున్న ఈ కాలంలో ఒక్కో ఆడపిల్లా ఒక్కొక్క వీరేశలింగమై, అగ్నితరంగమై నిలవాల్సిన స్ఫూర్తినివ్వటానికి ఈ సభ ప్రేరణకాగలదని ఆశించారు.

వక్త శ్రీమతి జోశ్యుల దీక్ష, హైదరాబాద్ నుంచి విచ్చేసి ఈ సభలో ప్రసంగించారు. ఆమె వీరేశలింగం రచన "సత్యరాజా పూర్వదేశయాత్రలు" రెండు భాగాల నవల గురించి సోదాహరణ ప్రసంగం చేసారు. "ఈ సత్యరాజా పూర్వదేశ యాత్రలు నవల రెండు విభాగాలు. మొదటిదైన ఆడ మళయాళంలో సత్యరాజాచార్యులు అనే ఒక కరుడుగట్టిన సనాతన సంప్రదాయవాది అయిన బ్రాహ్మణపాత్రను తీసుకుని చండశాసనుడైన పురుషుల అధీనంలో తరతరాలుగా స్త్రీలు పడతున్న బాధలు, అణచివేత, అనుభవిస్తున్న హింస - ఇవన్నీ స్త్రీల వల్ల పురుషులు అనుభవిస్తే ఎలా ఉంటుంది? అని కందుకూరి ఈ నవలలో ఒక అద్భుత కల్పన చేశారు. నవల

చదివిన ప్రతీ పాఠకుడు "అమ్మో! ఆ స్త్రీల పరిస్థితిలో నేను వుంటే ఎలా వుంటుందో" అని ఆలోచించుకోకుండా, భయపడకుండా ఉండలేడు. అలాగే రెండవదైన లంకాద్వీపంలో జ్యోతిశ్శాస్త్రం, ముహూర్తాలు వట్టి బూటకాలనీ, ఎక్కడో ఉన్న గ్రహాలు మనుషుల జీవితాల్ని ఎలా ప్రభావితం చేస్తాయనీ, గొప్ప గొప్ప సిద్ధాంతులు ముహూర్తాలు చూసి చేసిన పెళ్ళిళ్లన్నీ విజయవంతం ఎందుకు కావటం లేదన్న చర్చ పెట్టి కందుకూరి ఈ నవలలో పాఠకుల్ని ఆలోచింపచేస్తారని చెప్పారు.

శ్రీమతి కనుమూరి మధుర ఎంచుకున్న నవల వీరేశలింగం గారి వచన ప్రబంధం "రాజశేఖర చరిత్రము" ను సమీక్షిస్తూ "ఈ నవల కందుకూరి వారు రాసేనాటికి ఆయన వయసు 30 ఏళ్ళు. సరళ గ్రాంథికాలు కలిపి రాసిన ఈ పుస్తకం తొలి వచన ప్రబంధంగా అంటే సామాజిక నవలగా ప్రసిద్ధి పొందటమే కాక చాలాసార్లు యూనివర్శిటీ పాఠ్యాంశంగా చేర్చబడింది. ఆనాటి కాలంలో చాలా వ్యాప్తిలో ఉన్న మూఢనమ్మకాలు, దొంగమోసాలు, భోగంమేళాలు, శకునాలు, అంజనాలు, భూతవైద్యుల బారి నుండి సమాజాన్ని విద్యావికాసం వైపుగా నడిపించటానికి వీరేశలింగం ఎలా ఆద్యుడయ్యారో వివరించారు. మరొక వక్త కుమారి ఎన్.వి.ఎస్. ఇందిర మాట్లాడుతూ వీరేశలింగం శుద్ధ శ్రోత్రియ సదాచార కుటుంబంలో పుట్టినప్పటికీ, అవే కుటుంబాల్లో చోటుచేసుకున్న మూఢాచారాల్ని ఎండగట్టిన తీరు వివరించారు. బాల్యంలోనే భర్త చనిపోయి పుట్టింటికి చేరిన ఆడబిడ్డల దైన్యస్థితికి చలించిపోయి, వారి జీవితాల్లోకి స్త్రీవిద్య అనే ఆయుధాన్ని, పునర్వివాహం అనే పుష్పమాలికల్నీ ఏకకాలంలో బహుమతిగా అందించిన ధన్యుడని ప్రస్తుతించారు. వీరేశలింగం సంస్కరణల కోసం మాత్రమే సాహిత్యం సృష్టించారని, దురాచారాలని అపహాస్యం చేసి, చురకలు వేసేందుకు అది ఉపయోగ పడిందని చెప్పారు. ఆమె "వీరేశలింగం సంస్కరణలు – హాస్య సంజీవని" అనే అంశంపై మాట్లాడారు.

చివరిగా మాట్లాడిన శ్రీమతి బందా శుభశ్రీ "సత్యవతీ చరిత్రము – మహిళాభ్యుదయము" అంశంపై చేసిన ప్రసంగంలో వ్యభిచారం, శిశుహత్యలు లేకుండా రెండవ వివాహం చేసుకున్న వితంతువులు సుఖసంతోషాలు పొందాలని వీరేశలింగం కోరుకునేవారన్నారు. సత్యవతి అనే చదువుకున్న అమ్మాయి పాత్రని తీసుకుని, ఆమె చదువుకోవటంతో వచ్చిన సంస్కారంతో కుటుంబాన్ని ఎలా తీర్చిదిద్దుకుందో ఎంతో సరళంగా నచ్చి మెచ్చేలా చెప్పిన నవల ఇది. ఇందులో ఎలాంటి అభూత కల్పనలు లేవు. అద్భుతాలు, అసహజాలు లేవు. స్త్రీవిద్య ప్రాధాన్యత ప్రాతిపదికగా రాసారని, మూఢ సమాజం విసిరిన రాళ్లు, చివరికి హత్యాయత్నాలు తట్టుకుని, తను చేపట్టిన సంస్కరణల కోసం అనుక్షణం పాటుపడిన ఆ మహనీయుడి స్మృతికి శిరసు వంచి పాదాభివందనం" అన్నారు.

ఈ చక్కని సభలో వ్యాసాల పుస్తకావిష్కరణ చేసిన డా॥ వాడ్రేవు వీరలక్ష్మీదేవి మాట్లాడుతూ – "ఈ రోజు ఎక్కడ ఏ సంఘ సంస్కరణ కార్యక్రమం జరుగుతున్నా దానికి మూలకారణం వీరేశలింగం పంతులు అని స్ఫురిస్తూనే ఉంటుంది. ఎక్కడ ఏ ప్రజాసంక్షేమ కార్యక్రమం జరిగినా అది ఆయనను స్మరింపచేయగలదు. ఎందుకంటే 'ఇంకా ఎంతో చేయవలసి ఉంది. నా ఆయువు సరిపోలేదు, మీరంతా చేయాలి' అని ఆయన కోరుకున్నారు. అందుకే కందుకూరి సదా చిరస్మరణీయుడు" అని అన్నారు. మొదటగా సభకి స్వాగతం పలికిన అద్దేపల్లి జ్యోతి "ప్రాతఃస్మరణీయుడు వీరేశలింగం" అనే వ్యాసం చదివారు. సభని సమన్వయ పరిచిన శ్రీమతి ఎన్.వి. పద్మావతి వక్తల ప్రసంగాల్ని "కందుకూరి వెలిగించిన మణిదీపాలు"గా అభివర్ణిస్తూ, వారిని ప్రశంసించారు.

పుస్తకంలో వక్తలు సమర్పించిన వ్యాసాలతో పాటు ఇంకా డా॥ వాడ్రేవు వీరలక్ష్మీదేవి, వక్కలంక శారద, పుప్పాల సూర్యకుమారి, శ్రీపాద అన్నపూర్ణ, అద్దేపల్లి జ్యోతి, ఎన్.వి. పద్మావతి మొదలైనవారి వ్యాసాలు కూడా పొందుపరిచారు. ఈ సభలో సాహితీస్రవంతి రాష్ట్ర ఉపాధ్యక్షులు గనారా, పట్టణ అధ్యక్షులు మార్ని జానకిరాం చౌదరి, జిల్లా అధ్యక్షులు జోశ్యుల కృష్ణబాబు, గౌరవాధ్యక్షులు వుయ్యపు హనుమంతరావు, క్రియా జగన్నాథ్, హిందూ కరస్పాండెంట్ మురళీశంకర్, శ్రీమతి భానుమతి, శ్రీమతి మీనాక్షి, ప్రొఫెసర్ విశ్వనాధరావు, గరికిపాటి మాస్టారు, డా॥ సీతారామస్వామి, సంధ్య, శ్రీహస్త తదితరులు పాల్గొన్నారు. వీరేశలింగం స్త్రీలు అనుభవించే హింస, ఆవేదన పురుషులకే అర్థం కావాలని ఆశించినట్లుగానే సభలో పురుషులే ఎక్కువగా హాజరై సభను విజయవంతం చేశారు. ◆



## అన్వేషణ

డా॥ పాపినేని శివశంకర్ సాహిత్యానుశీలన

సంపాదకుడు: బండ్ల మాధవరావు

వెల : 150/- పేజీలు: 382

ప్రతులకు : 8500884400

ఎందరో ఎన్నో కోణాలనుంచి పాపినేనిని ఆవిష్కరించిన వ్యాసాలు ఈ 'అన్వేషణ'లో వున్నాయి. పాపినేని జీవితకాలపు రచనా వ్యాసాంగానికి తొాకవు రాళ్లు 'అన్వేషణ'లోని వ్యాసాలు.

**- బండ్ల మాధవరావు**



## దేవీప్రియ బహుముఖ

ప్రముఖ విమర్శకులు, పాత్రికేయులు, రచయితల పరిశీలనలు, వ్యాఖ్యలు

సంపాదకులు: బి. నరసింగరావు, ప్రొ. ఘంటా చక్రపాణి, ఖాదర్ మొహియుద్దీన్, డా. సీతారాం, బండ్ల మాధవరావు

వెల : 300/- పేజీలు: 416

ప్రతులకు: 9247471361

దేవిప్రియ 'గాలిరంగు'కి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు- 2017 ప్రకటించిన సందర్భంగా ఇది 'దేవి' ప్రేమికుల ఆత్మీయ సమర్పణ.

**- సంపాదకులు**



## అంటరాని ప్రేమ కవిత్వం

కలేకూరి ప్రసాద్

సంపాదకుడు: నామాడి శ్రీధర్

వెల : 100/- పేజీలు: 128

ప్రతులకు: 9396807070

చిరకాల మిత్రుడు, ప్రియమైన కవి ప్రసాద్ స్వీయ, అనువాద కవితలతో మొదటిసారి సాధికారికంగా ఈ 'అంటరాని ప్రేమ' సంపుటం ప్రచురించాం. ఈ అసమ సమాజంలో తరతరంగా సాటి మనిషిపట్ల ఎడతెగని వివక్ష పర్యవసానంలోంచి, శతవిధాల అణచివేతల విపత్తుల్లోంచి పెల్లుబికిన కవిమాత్రుడి అసహ్యం, ఆవేశం, ఆవేదన ఈ కవిత్వంలో జీవన జ్వలనంగా అభివ్యక్తమవుతోంది.

**- ప్రేమలేఖ ప్రచురణ**



## అభయం నవల

సింహప్రసాద్

వెల :120/- పేజీలు: 200

ప్రతులకు: 9848787284

కార్పొరేట్ హాస్పటళ్ళలో జరిగే ఎన్నో అక్రమాలను ఈ నవలలో రచయిత సింహప్రసాద్ బయటపెట్టారు. ప్రభుత్వ ఆసుపత్రుల్లో ఆక్సిజన్ సిలిండర్లను మాయం చెయ్యడం వల్ల ఎంతో మంది చిన్నారులు చనిపోవడం, బ్రెయిన్‌డెడ్ అని చెప్పి ఆ పేషెంట్ ముఖ్య అవయవాలన్నీ తొలగించి, వాటిని అమ్ముకొని వేరే వాళ్ళకు అమర్చడం లాంటి సంఘటనలు ఈ నవలలో చూడొచ్చు. డాక్టర్లు ఎలాంటి ఇబ్బందుల్ని ఎదుర్కోవాల్సివస్తుందో ఈ నవలలో చిత్రించారు. వైద్యరంగంలోని మాఫియాపై వెలువడిన తొలి తెలుగు నవల ఇది.

**- అంపశయ్య నవీన్**



## ధిక్కారం నవల

సింహప్రసాద్

వెల :120/- పేజీలు: 216

ప్రతులకు: 9848787284

తెలుగు రాష్ట్రాల పిల్లల జీవితాలను చెరబట్టిన విద్యాసంస్థల చరిత్రంతా ఇందులో ఉంది. నిజానికి ఇది చారిత్రక నవల. ఇందులో కల్పిత పాత్రలేవీ లేవు. కల్పిత సంఘటనలు కూడా లేవు. చరిత్రను కథగా, నవలా రూపంలో నిక్షిప్తం చేశారు రచయిత. ఒక యాభై ఏళ్ళ తర్వాత ఏదైనా పెనుమార్పు వచ్చి కొత్త చరిత్ర రాయవలసి వచ్చినపుడు ఈ నవలకు ఎక్కడలేని ప్రాముఖ్యత వస్తుంది.

**- ఓల్గా**



## కవిత్వ కళాతత్త్వం

శాస్త్ర కావ్యం

ముదిగొండ వీరభద్రయ్య

వెల :20/- పేజీలు: 32

ప్రతులకు: 9440480274

అనధికార శాసనకర్తలైన కవులకు ఈ శాస్త్రకావ్యం ఒక కవిత్వ రాజ్యాంగంలా నిరంతరం ఉపయోగపడుతుందనటం ఏ మాత్రం అతిశయోక్తి కాదు. ముఖపుస్తకంలో పుంఖాను పుంఖాలుగా కవితలు రాస్తున్న కొత్తతరం కవులకు ఈ శాస్త్ర కావ్యం ఒక పాఠ్యగ్రంథంగా వారి ఎరుకను సమగ్రపరుస్తుంది. ఇదే ఈ శాస్త్ర కావ్యం ఫలశ్రుతి.

**- డా॥ కోయి కోటేశ్వరరావు**

## కర్రోడు పట్టిన త్రిశూలం ఆవిష్కరణ




సాహితీస్రవంతి కర్నూలు జిల్లా కమిటీ ఆధ్వర్యంలో కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత కుం.వీరభద్రప్ప రాసిన 'కర్రోడు త్రిశూలం పట్టిన కథ' పుస్తకావిష్కరణ సభ పింగళిసూరన తెలుగు తోటలో మార్చి 31న జరిగింది. గాడిచర్ల ఫౌండేషన్ అధ్యక్షులు, జిల్లా గ్రంథాలయ సంస్థ మాజీ చైర్మెన్ చంద్రశేఖర కల్కూర పుస్తకాన్ని ఆవిష్కరించారు. సాహితీస్రవంతి జిల్లా ప్రధాన కార్యదర్శి కెంగార మోహన్ ఆధ్యక్షతన జరిగిన ఈ సభలో కుం.వీరభద్రప్ప మాట్లాడుతూ నలబైఏళ్ళుగా సాహిత్యలోకంలో ఉన్నానని సీమలోని కన్నీటి చుక్కలే కథలకు, నవలలకు వస్తువులయ్యాయన్నారు. దాదాపు 24 ఏళ్ళు కర్నూలు జిల్లాలో ఉపాధ్యాయులుగా సేవలందించాలన్నారు. రాయలసీమ ప్రాంతమే నాతో కథలు రాయించిందన్నారు. రాయలసీమలో వాస్తవజీవితాలు కథలుగా రాశానన్నారు. రాయలసీమలో వాస్తవజీవితాలు కథలుగా రాశానన్నారు. అన్నీ సజీవపాత్రలతో పురుడుబోసుకున్నవేనన్నారు. సామాజిక జీవితాల్లో మార్పు వచ్చినరోజు కవి జీవితానికి సార్థకత లభిస్తుందన్నారు. ఒకే తరహా జీవితాలను రాయడం కూడా సరికాదని సమాజంలో సంభవించిన మార్పును రాయాలన్నారు. దు:ఖాన్నే కాదు ఆనందాన్ని కూడా రాయాలన్నారు. సీమ అస్తిత్వం జీవవాయువుగా కన్నడ సాహిత్యంలో కొనసాగుతున్న తన సాహిత్యజీవితమంతా కర్నూలులోనే సాగిందన్నారు. పుస్తకావిష్కరణ చేసిన కల్కూర మాట్లాడుతూ సాహిత్యం మనుషుల్ని కలిపే వాహకమన్నారు. కుం.వీరభద్రప్ప తెలుగు-కన్నడ భాషలకు వారధిగా కృషి చేస్తున్నారన్నారు. కథల్ని సమీక్షించిన పాణి మాట్లాడుతూ కు.వీ రాసిన ఈ 12 కథల అనువాదం చేసిన రంగనాథ రామచంద్రరావు మంచి అనువాదాన్ని తెలుగు పాఠకులకు అందించారన్నారు. కుం.వీరభద్రప్ప కేంద్రం తనకిచ్చిన అవార్డును ప్రభుత్వ తీరుకు, అకాడమీ తీరుకు నిరసనగా వాపస్ ఇచ్చి సరికొత్త అధ్యాయానికి నాంది పలికాడన్నారు. ఈ కథల్ని అనువదించిన రంగనాథ రామచంద్రరావు మాట్లాడుతూ కు.వీ రాసిన కథల్ని దాదాపు అనువదిస్తున్నానని అన్నారు. కుం.వీ రాసిన అరమనె తెలుగు అనువాదం త్వరలో వస్తుందన్నారు. అరమనె రాయలసీమ జనజీవన ముఖచిత్రమన్నారు. సభలో రచయిత ఇనాయతుల్లా సాహితీ స్రవంతి రాష్ట్రకార్యదర్శి జంధ్యాల రఘుబాబు ప్రసంగించారు. సభను గౌరెడ్డి హరిశ్చంద్రారెడ్డి ప్రారంభించగా రచయితల పరిచయం ఆచార్య దండెబోయిన పార్వతి, పెరికల రంగస్వామి చేశారు. ◆

## యువతకు స్ఫూర్తి కందుకూరి



సామాజిక సమస్యలే ఇతివృత్తంగా వీరేశలింగం చేసిన రచనలు ఆనాటి యువతకు స్ఫూరినిచ్చాయని గుడివాడ అక్కినేని నాగేశ్వరరావు కళాశాల విశ్రాంత తెలుగు విభాగాధిపతి డా॥ కొడాలి సోమసుందర్ అన్నారు. స్థానిక సుందరయ్య భవన్‌లో సాహితీస్రవంతి గుడివాడ కన్వీనర్ సురేంద్ర అధ్యక్షతన కందుకూరి జయంతి సభలో ఆయన ప్రసంగించారు. తాను నమ్మిన ఆశయాలకై పోరాడటమే గాక ఆచరించి చూపిన ధీశాలి అని కొనియాడారు. తెలుగు పండితులు వి. వీరరాఘవాచార్యులు, డి. ఆనందమోహన బోసు, నవ్వుల పొదరిల్లు నిర్వాహకులు యం.యస్.వి. సత్యనారాయణబాబు తదితరులు ప్రసంగిస్తూ నేటి యువకులు, రచయితలు కందుకూరిని ఆదర్శంగా తీసుకుని అణచివేతకు వ్యతిరేకంగా రచనలు చేసి ప్రజలను చైతన్యపరచాలని ఆకాంక్షించారు. ఈ కార్యక్రమంలో సాహిత్యాభిమానులు పాల్గొన్నారు. ◆

# అక్షర శిల్పి కొండవీటి వేంకటకవి




అక్షరం కొందరి సొంతం కాదని, అందరి సొంతమని తన పద్య రచనల ద్వారా సమాజంలో పేరుకుపోయిన కుల, వర్ణ వివక్షతను ఎండగట్టిన అక్షర శిల్పి కొండవీటి వేంకటకవి అని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ టి.రజని కొనియాడారు. కళాప్రపూర్ణ కొండవీటి వేంకటకవి శతజయంతి సభ గుంటూరులోని కొమ్మినేని గార్డెన్స్‌లో ఏప్రిల్ 3న నిర్వహించారు. కార్యక్రమానికి ఎమ్మెల్సీ కెఎస్. లక్ష్మణరావు అధ్యక్షత వహించారు. జస్టిస్ రజని మాట్లాడుతూ వేంకటకవి సాహిత్యంలో తానునమ్మిన వాదాన్ని పద్య రచనల ద్వారా బహిర్గతం చేయగలిగారని, వర్ణ వ్యవస్థను ఎండగట్టారని కొనియాడారు. చిరు ప్రాయంలోనే అశుకవిగా, అవధానిగా, వక్తగా, ఉపాధ్యాయునిగా, కవిగా, భాష్యకర్తగా, సినీగేయ రచయితగా, పత్రికా వ్యాసకర్తగా, సంఘ సంస్కర్తగా బహుముఖ ప్రజ్ఞాశాలిగా రాణించారని అన్నారు. పద్యాన్ని గుత్తాధిపత్యంగా భావించిన వారిని సవాల్ చేస్తూ ఆయన పద్యాలు రాశారని పేర్కొన్నారు. ఆర్థిక సమానత్వం రానిదే హింస పోదని వేంకటకవి నెహ్రూ చరిత్రలో పేర్కొన్నారని, ద్రావిడ దృక్పథం ఆయన రచనల్లో ప్రస్ఫుటమైందని విశదీకరించారు. కులమతాల్లేని సమాజం కొండవీటి స్వప్నమన్నారు. దళిత ఉద్యమకారుడు, కవి డాక్టర్ కత్తి పద్మారావు మాట్లాడుతూ కులం దాటిన వాడే ప్రపంచ మానవుడవుతాడని, కులాంతర వివాహాలను ప్రోత్సహించి సమసమాజ స్థాపన కోసం కొండవీటి వెంకటకవి పాటుపడ్డారని కొనియాడారు. వ్యవసాయ విప్లవం నుండి సాహితీ విప్లవం తెచ్చి 'కర్షక' అనే ఖండకావ్యాన్ని చిరుప్రాయంలో రాశారని తెలిపారు.

సాయంత్రం జరిగిన రెండో సెషన్‌కు పిడిఎఫ్ ఎమ్మెల్సీ విఠపు బాలసుబ్రహ్మణ్యం అధ్యక్షత వహించారు. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత పాపినేని శివశంకర్ 'వేంకటకవి తాత్వికత'పై, తిరుపతి మహిళా విశ్వవిద్యాలయం విశ్రాంత ప్రొఫెసర్ దావులూరి కృష్ణకుమారి, పొన్నూరు సంస్కృత కళాశాల విశ్రాంత ప్రొఫెసర్ వి.వి.సీతారామాచార్యులు 'వేంకటకవి అధ్యాపనం'పై ప్రసంగించారు. సాహితీవేత్త కొత్తపల్లి రవిబాబు, కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి సాహితీ సమితికి చెందిన ప్రొఫెసర్ రావెల సాంబశివరావు 'వేంకట కవి హేతువాదం'పై, సాహితీ విశ్లేషకులు ముత్తేవి రవీంద్రనాథ్ 'వేంకటకవి సినీ రచనలు'పై మాట్లాడారు. తొలుత వేంకటకవి చిత్రపటానికి పూలమాలలేసి నివాళులర్పించారు. అనంతరం 'వేంకట కవి కావ్య చరిత్ర' పుస్తకాన్ని జస్టిస్ టి.రజని ఆవిష్కరించారు. 'నెహ్రూ జీవిత చరిత్ర' పుస్తకాన్ని ప్రముఖ కవి, దళిత నాయకులు డాక్టర్ కత్తి పద్మారావు ఆవిష్కరించారు. కొండవీటి డాట్ ఇన్ వెబ్‌సైట్‌ను సాహితీవేత్త రావి రంగారావు ఆవిష్కరించారు. వేంకటకవి జీవిత విశేషాలను, సాహిత్య నేపథ్యాన్ని హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ చిన్నయసూరి విశదీకరించారు. కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కార గ్రహీత ప్రొఫెసర్ రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి వేంకటకవి సాహితీ పరిచయం చేశారు. కార్యక్రమంలో సాహితీ వేత్తలు కొండవీటి రామారావు, డాక్టర్ తూమాటి సంజీవరావుతో ఎమ్మెల్సీ వై.శ్రీనివాసులురెడ్డి, కవులు, కళాకారులు, వేంకటకవి శిష్యులు, కుటుంబ సభ్యులు పాల్గొన్నారు. ◆

## రంగనాథ రామచంద్రరావుకు శశశ్రీ సాహిత్య పురస్కారం




కడపలో సిపి(బ్రౌన్ పరిశోధనా కేంద్రంలో ఏప్రిల్ 1న శశిశ్రీ స్మారక సాహిత్య పురస్కారం ప్రదాన సభ జరిగింది. 2019 సంవత్సరానికి గాను అనువాద సాహిత్యంలో కృషిచేస్తున్న రంగనాథ రామచంద్రరావు ఈ పురస్కారాన్ని అందుకున్నారు. ఈ సందర్భంగా కేతు విశ్వనాథ రెడ్డి మాట్లాడుతూ తెలుగు, కన్నడ సాహిత్యాలకు వారధి రంగనాథ రామచంద్రరావు అన్నారు. ఈ సభలో టి. సంజీవమ్మ, షేక్ హుస్సేన్ సత్యాగ్ని, మూల మల్లికార్జున రెడ్డి, జి.వి. సాయిప్రసాద్, షేక్ మస్తాన్ వలి తదితరులు పాల్గొన్నారు. ◆

## ఓటు విలువపై కవితా బులెటిన్



విశాఖపట్నం సాహితీస్రవంతి, వైజాగ్ ఫెస్ట్ సంయుక్తంగా ఓటు విలువపై ప్రచురించిన కవితా బులెటిన్‌ను ఏప్రిల్ 6న జి.వి.ఎం.సి. ఎదురుగా గాంధీ విగ్రహం వద్ద ఆవిష్కరించారు. ఈ సందర్భంగా వైజాగ్ ఫెస్ట్ కార్యదర్శి ఎ.అజశర్మ మాట్లాడుతూ రాజకీయాలు కులం, మతం, ప్రాంతం, డబ్బు వంటి అంశాలతో ప్రభావితం అయి కలుషితమౌతున్నాయని అన్నారు. ఈ అంశాలపై కవులు తమ కవితలతో సమాజాన్ని జాగృతం చేయాలని పిలుపిచ్చారు. ప్రజాస్వామ్యం వర్ధిల్లాలంటే స్వేచ్ఛాయుత వాతావరణంలో నిష్పక్షపాతంగా ఎన్నికలు జరగాలని, అందుకు కవులు, రచయితలు, మేధావులు తమ గొంతు బలంగా వినిపించాలని కోరారు. కవులు నూనెల శ్రీనివాసరావు, శివకోటి నాగరాజు, యల్లాప్రగడ రమాదేవి, కుమార్ ఆర్తి, సందీప్ రుద్రబక్షుల, సుజాతామూర్తి, సాహితీస్రవంతి విశాఖ అధ్యక్షులు ఎ.వి. రమణారావు, పెంటకోట రామారావు తదితరులు పాల్గొన్నారు.

## కథల పోటీ

సమాజంలో భిన్న రూపాలలో వివక్షత నెదుర్కొంటున్న "ట్రాన్స్‌జెండర్-వ్యక్తుల జీవన విధానం, సమస్యలు, పరిష్కారాల"ను ఇతివృత్తంగా తీసుకున్న కథలను పోటీకి "సమన్విత" సంస్థ ఆహ్వానిస్తున్నట్లు సమన్విత కన్వీనర్ డి. శమంతకమణి ఒక ప్రకటనలో తెలిపారు. మొదటి బహుమతి రూ॥ 3,000/-, రెండవ బహుమతి రూ॥ 2,000/-, మూడవ బహుమతి రూ॥ 1,000/-, రెండు కన్సొలేషన్ బహుమతులు ఒక్కొక్కరికి రూ॥ 500/-లు చొప్పున అందించనున్నట్లు తెలిపారు. "కోపూరి చారిటబుల్ ట్రస్ట్ - విజయవాడ" తరుపున ప్రముఖ రచయిత్రి శ్రీమతి కోపూరి పుష్పాదేవి బహుమతులను అందిస్తారని తెలిపారు. కథలను జూలై 15లోగా **"సమన్విత", ఇ.నెం. 3-274/207, శ్రీరామ్స్ స్నేహ అవెన్యూ, అరవింద హై స్కూల్ వద్ద, కుంచనపల్లి, అమరావతి - 522 501** చిరునామాకు పంపించవలసిందిగా కోరారు. ◆




*విజయనగరం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో విజయనగరంలోని గురజాడ స్వగృహంలో జరిగిన ఉగాది కవి, గాయక సమ్మేళనంలో కవిత చదువుతున్న రత్నాల బాలకృష్ణ. చిత్రంలో పాయల మురళీకృష్ణ, గంటేడ గౌరునాయుడు, చీకటి చంద్రికారాణి తదితరులు*

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,

# గుడిపాటి వెంకటచలం

19.05.1894 - 04.05.1979



చలం సాహిత్యానికి కేంద్ర బిందువు స్త్రీ. స్త్రీ, ప్రేమలేఖలు, మ్యూజింగ్స్ లాంటి వ్యాస సంపుటాలు, ఓ పువ్వు పూసింది, కన్నీటి కాలవ లాంటి కథలు, మైదానం, బ్రాహ్మణీకం లాంటి నవలలు, పురూరవ, సావిత్రి లాంటి నాటకాలు అనేకం రాశాడు. ఈయన వస్తువు, శైలి కూడా ఆంధ్ర సాహిత్యాన్ని మలుపు తిప్పింది.

67

SAHITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.VJ/187/2017-19
Date of Posting : 1st &2nd of Every Month ▪ Date of Publication: 28.04.2019





# ఆహ్వానం

# కందుకూరి వీరేశలింగం శతవర్ధంతి సభ

## 100వ వర్ధంతి 100 సంస్థల ఆధ్వర్యంలో

మే 26 • ఆదివారం
ఉ.10 గంటల నుండి సా.6 గంటల వరకు
వేదిక ఫంక్షన్ హాలు, బెంజిసర్కిల్, విజయవాడ

• సాహితీ సమాలోచన • సాంస్కృతిక కార్యక్రమాలు
పుస్తకావిష్కరణలు • పుస్తక ప్రదర్శన • చార్ట్స్ ఎగ్జిబిషన్స్
• రచయితల కళాకారుల పాదయాత్ర

**ప్రారంభ సభ: 10 గంటల నుండి 12 గంటల వరకు**

సభాధ్యక్షత: తెలకపల్లి రవి • ప్రారంభోపన్యాసం: వకుళాభరణం రామకృష్ణ
గౌరవ అతిథులు: డా॥ విజయం • దీర్ఘాసి విజయభాస్కర్ • కె.యస్. లక్ష్మణరావు
• మనసు ఫౌండేషన్ రాయుడు

**సాహితీ సమాలోచన సదస్సు - 1 (12 గంటల నుండి 1.30 గంటల వరకు)**

కందుకూరి వీరేశలింగం - తెలుగు సాహిత్యం
సభాధ్యక్షులు: డా॥ పాపినేని శివశంకర్
వక్తలు: ఓల్గా • రాచపాళెం చంద్రశేఖర రెడ్డి
• మేడిపల్లి రవికుమార్ • గుంటూరు లక్ష్మీనరసయ్య

**సాహితీ సమాలోచన సదస్సు - 2 (2 గంటల నుండి 4 గంటల వరకు)**

కందుకూరి వీరేశలింగం - సంఘసంస్కరణ ఉద్యమాలు
సభాధ్యక్షులు: ఎన్. అంజయ్య
వక్తలు: కడియాల రామమోహన్‌రాయ్ • కొత్తపల్లి రవిబాబు
• వి. బాలసుబ్రహ్మణ్యం • చూపు కాత్యాయని

**సాహితీ సమాలోచన సదస్సు - 3 (4 గంటల నుండి 6 గంటల వరకు)**

సంఘసంస్కరణ ఉద్యమాలు - సాహిత్యం - వర్తమాన సమాజం
సభాధ్యక్షులు: డా. జి. సమరం
వక్తలు: పుణ్యవతి • ఎం.వి.ఎస్. శర్మ • పెనుగొండ లక్ష్మీనారాయణ
• కొలకలూరి ఆశాజ్యోతి • శిఖామణి



If Un delivered please return to: Prasthanam, C/o M.B. Vignana kendram, 27-30-4, 3rd Floor
Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002. Ph: 0866-2577248, Cell: 9490099059



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A197 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |